1

# నిరంజన్

[నవల]


మూలం : రవీంద్రనాథ మైత్రా

అనువాదం : మద్దిపట్ల శ్రీసూరి







ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ.

మొదటికూర్పు

1955

ముద్రణ

లీలా ప్రెస్:

విజయవాడ.

వెల : రెండురూపాయలు

# నిరంజన్

రాయ్‌సాహెబ్‌గారి బంగళాలో డ్రాయింగ్‌రూమ్‌లో కూర్చునిఉన్న వ్యక్తి అక్కడ అట్టే గౌరవం లేనివాడనే చెప్పాలి. అతడి క్రాఫు దుబ్బు రేగిఉంది. ఒంటిపై సగంమాసిన ట్వీల్‌చొక్కా- దానికి కుడిచేతిమీద వేసిన పెద్దమాసిక స్పష్టంగా కన్పిస్తోంది. అతడికి ఇరవై అయిదు- ఇరవై ఆరు ఏళ్ళు ఉంటాయి. అలంకరించిఉన్న రౌండు టేబిల్ దగ్గిరగా ఒక కుర్చీలో అతడు ఒదిగి కూర్చున్నాడు. మధ్యమధ్య ఆ టేబిల్‌మీద చెయ్యి వెయ్యబోయి మళ్ళీ వెనక్కి తీసుకుంటున్నాడు. ఎన్నో విలాసవస్తువులతో అలంకరించిఉన్న టేబిల్ తాకటానికి ధైర్యం చాలకుండాఉన్నదనుకుంటాను. గోడల్ని చిన్నవీ, పెద్దవీ మొత్తం ఓ డజన్ అద్దాలు వ్రేలాడుతున్నాయి. అతడు ఒకసారి అటుచూసి, మళ్ళీ ముఖం వెనక్కి త్రిప్పుకుంటున్నాడు. బక్కచిక్కిన తనముఖప్రతిబింబం తనకళ్ళకే బాగున్నట్లు కన్పించటంలేదు.

ఆ ప్రదేశంపేరు సాలవనం. కాని పేరులోతప్ప ఆ ఊళ్ళో ఎక్కడా ఒక్కసాలవృక్షంకూడా లేదు. ఆ ఊరును మొదట్లో చూడగానే అదొక చిన్నబస్తీ అనిపిస్తుంది. పట్నంలో ఉండే చమకులన్నీ ఈ ఊళ్ళో ఉన్నాయి కంకరరోడ్లు, చిన్నవీ పెద్దవీ మేడలు, లాంతరు స్తంభాలు- అన్నీఉన్నాయి. ఒకటి రెండు ఇళ్ళల్లో టెన్నిస్‌కోర్టులుకూడా ఉన్నాయి. ఊరుకుసరిగ్గా

మధ్యనుంచేఒకనది. ఆనదికి అవతలఒడ్డున వరుసగా పల్లెవాళ్ళ యిళ్ళుమాత్రం ఉన్నాయి. ఆ గుడిసెలనుబట్టి అది పల్లెటూరు అనాలేకాని అంతకన్న అలా అనటానికి మరో వీలులేదు.

నిజానికి సాలవనం ఒక పల్లెటూరు. ఆవూరుయొక్క ఇప్పటిస్థితికీ, పదిసంవత్సరాలనాటి స్థితికీ చాలా వ్యత్యాసం ఉంది. పూర్వం ఇక్కడ కొన్ని బ్రాహ్మలయిళ్ళూ, కాయస్థుల ఇళ్లూ ఉండేవి. వాళ్ళుఎవరూ లేరు ఇప్పుడు. వాళ్ళంతా ఊళ్లో నుంచి లేచిపోయి, ఏదోవిధంగా కాలక్షేపం చేస్తున్నారు. వారి పురాతన గృహాలు ఇప్పుడు ధనవంతులమేడలయినాయి. ఒక వీధిచావడిముందు ఒన్నిస్కోర్టు వెలిస్తే మరొక వీధిచావడి క్లబ్ గా మారిపోయింది. నదిఒడ్డున ఉన్న శివాలయం మాత్రం కాలప్రవాహాన్ని నదీ ప్రవాహాన్నికూడా తట్టుకుని ఎలాగో నిలిచిఉంది.

అప్పటి ఆ సాలవన్ గ్రామం ఇప్పటి 'షిలోవాన్' గా ఎలా పరిణమించిందో ఆ చరిత్ర చాటభారతంఅంత లేదు. ఎటర్నీ రావుసాహెబ్ విష్ణుపదగుప్త మహాశయుడు పది పన్నెండు సంవత్సరాలక్రితం నావలమీద ప్రయాణం చేసే రోజుల్లో ఈ గ్రామాన్ని కనుక్కొన్నాడు. నదిఒడ్డున ఉన్న గ్రామం. బస్తీనుంచి ఒక్కపూట ప్రయాణం. సిటీలో ఉండే గందరగోళం ఉండకుండా, సిటీలో ఉండే సౌకర్యాలన్నీ ఉండే ఇలాంటి గ్రామంకోసం వృద్ధుడైన రాయ్‌సాహెబ్ చాలా కాలంనుంచి వెతుకుతున్నాడు. టక్కున ఈ సాలవన గ్రామం కన్పించగానే తన సంకల్పాన్ని ఆచరణలో పెట్టడానికి ఉపక్రమించాడు.

అప్పటికి ఆ గ్రామానికి జమీందారైన రఘునాథ మైత్రాకు కలుసుకుని, ఆనాటి మామూలు ధరకన్న ఇరవై రెట్లు ఎక్కువ ధర ఇచ్చి ఆ గ్రామంమీది జమీందారీ హక్కు కొనేశాడు. ప్రజలంతా వీల్లేదని అభ్యంతరం చెప్పినా మైత్రామహాశయుడు వినలేదు. ఊళ్ళోఉన్న గృహస్థులలో చిన్నా, పెద్దా చాలామంది ఇదీ ఒక సదవకాశమే అని భావించి తమ ఆస్తిపాస్తులనుకూడా అమ్ముకుని పొరుగూళ్ళకు పోయి, కొంతమంది ఆవూరి పొలిమేరలు దాటివచ్చి నివాసాలు ఏర్పరుచుకున్నారు. కొంతమంది సాలెవాళ్లూ, తోటమాలీలు, నదికి ఆవతలిఒడ్డునఉన్న పల్లెవాళ్ళూమాత్రం ఊరు విడిచిపెట్టి పోకుండా ఉన్నారు వాళ్ళు కుంటపొలం అయిదువందలని విన్నప్పుడు ఆశ్చర్యపోయారు. కాని, తాత ముత్తాతలనాటి గడ్డ వదులుకుని పోవటానికి మాత్రం సిద్ధపడలేదు.

ఆ గ్రామం కొని రాయ్‌సాహెబ్ దాన్ని సంస్కరించట టాలో శ్రద్ధవహించాడు. సంస్కరించిం తర్వాత ఆ గ్రామం ఎలా ఉన్నదో ఆ సంగతి మొదట్లో చెప్పాను రాయ్ సాహెబ్‌తోపాటు ఆయన అనుగ్రహానికై ప్రాకులాడే కొంత మంది యువక బారిష్టరుకూడా సాలవనం వచ్చేశారు. చూస్తూచూస్తూ ఉండగానే మూడు నాలుగేళ్ళలో సాలవన మల్లా 'షిలోవాన్' అయిపోయింది. ఇదీ పూర్వగాథ.

రావుసాహేబ్‌గారి కోసమై ప్రతీక్షిస్తూ కూర్చుని ఉన్న యువకుడు – ఇప్పటికి వారంరోజులుమంచీ ఆయన దర్శనం చేసుకునే సుయోగంకోసమై ప్రయత్నిస్తున్నాడు. రావుసాహెబ్‌గారి శెక్రటరీ మాధవదత్తుని అనుగ్రహంవల్ల

ఆయన్ని ఇంతవరకూ కలుసుకునే అదృష్టం కలగలేదు. ఇవాళ దత్తుగారు ఊళ్ళోలేరు. రోజురోజూ తిరగటం చూసేసరికి బంట్రోతులకు కూడా కాస్త దయకలిగింది. అంచేత రాగానే ఆ యువకుణ్ణి సరాసరి తీసుకెళ్ళి డ్రాయింగ్‌రూమ్‌లో కూర్చోపెట్టారు.

మామూలువేళకు రావుసాహెబ్‌గారు వచ్చారు. దాదాపు అరవైయేళ్ళుంటాయి బలిష్ఠమైన పొడుగాటి శరీరం. తలమీద ఒక్క వెంట్రుకయినాలేదు. ఈ యువకుణ్ణి చూడగానే "ఏం పనిమీద వచ్చావ్?" అని అడిగాడు రావ్ సాహెబ్.

యువకుడు లేచి నిలబడి, ఎలాగో ఒక నమస్కారంచేసి, "తమవద్ద—"అనేటప్పటికి

'సరే, కూర్చో. చెప్పు" అంటూ ఒక కుర్చీలాక్కుని కూర్చుని, ఒక బర్మాచుట్ట వెలిగించి, "ఇహ చెప్పు, కాని క్లుప్తంగా చెప్పదలచుకున్నదేదో పూర్తిచేయాలి.ఇవాళ మాకు మళ్ళీ బోట్ రేస్' ఉంది. పెందరాళే వెళ్ళిపోవాలి"అన్నాడు.

ఆ మాట విని యువకుడు కొంచెం వెనకాముందాడి "అలా అయితే పోనీ మీరు అనుమతిస్తే—"

రావ్‌సాహెబ్ ఆమాటకు అడ్డువచ్చి "ఉహూ,అలాంటి అవకాశం ఉండదు. నువ్వు ఎప్పుడొస్తావో - వచ్చినప్పుడు నాకు తీరుబడి ఉంటుందో ఉండదో అంతకన్న చెప్పుకోతలచిం దేమిటో ముక్తసరిగా చెప్పేస్తే వింటాను నేను" అన్నాడు.

యువకుడు అతివినయంగా "నాకథ చాలా—"

"ఉంటే ఉండనీ. నీ పేరేమిటి?"

"శ్రీ నిరంజన్ గంగూలీ. మాయిల్లు పూర్వం—"

"ఎక్కడైనా ఉండనియ్. ఇప్పుడేంకావాలి నీకు?"

"సహాయంకోసమై మీ దగ్గరకు—"

అతడిఉద్దేశం ఇలాంటిదే ఏదో అయిఉంటుందని రావు సాహెబు ముందుగానే ఊహించుకున్నాడు. అంచేత ముఖంలో మార్పుఏమీ కనపరచకుండానే "ఆసంగతి నేనుగ్రహించాను. కాని ఇలాంటివన్నీ స్వయంగా నేనేమీ చూసుకోను. శెక్రటరీ—"

నిరంజన్ రావుసాహెబ్‌గారు చెప్పబోయే దేమిటో గ్రహించి "ఉహూం, అలాంటి సహాయమేమీ అవసరంలేదు నాకు. యాచనకోసమని రాలేదు నేను. నౌకరీకోసమై ప్రయత్నిస్తున్నాను. కాని నాకు చనువుసంధ్యలేమీ రావు. దయ ఉంచి తమరేదయినా అవకాశంఇస్తే—" అంటూ అతడు రావ్‌సాహెబ్‌గారి ముఖాన్ని పరిశీలించసాగాడు. రావు సాహెబ్ చుట్టనుసి రాలుస్తున్నాడు. ఎలాంటి అభిప్రాయాన్నీ ముఖంలో వ్యక్తంచెయ్యలేదు.

ఇదివరలో నౌకరీచేస్తున్నవాణ్ణే. కాని దొరగారి అనుమానంవల్ల అదికాస్తా పోయింది. ఏడెనిమిది నెలలనుంచీ నౌకరీ లేకుండా కూర్చున్నాను. ఇంట్లో ముసిలిది మాఅమ్మ—"

'దొరగారి అనుమానంవల్ల ఉద్యోగంపోయింది' అన్న మాటమీదనే ఆయన ఎక్కువ లక్ష్యం ఉంచాడు. కాని నిరంజన్ ఆ విషయమై ఇంకేమీ చెప్పకపోవటంతో "దొరగారి అనుమానం ఏమిటి?" అని ఆయన అడిగాడు.

"దానికి చాలా గాథ ఉంది. మీరు వినేటట్లయితే వీలైనంతవరకు చెప్పగలను. కాని నావల్ల ఏమాత్రం దోషంలేదని మాత్రం చెప్పగలను. నాచేతనయినంతవరకు వారిపనులు చేసిపెడుతూండేవాణ్ణి అయినా వెళ్ళిపొమ్మంటే ఇంకేంచెయ్యాను నేను? ఇప్పు డింక గత్యంతరంలేదు. మీరు అనుగ్రహించకపోతే—" సరిగ్గా ఆ సమయానికి రావ్‌సాహెబ్ కుర్చీలోంచి లేచేసరికి నిరంజన్ ఆగిపోయాడు. అతడిముఖం మరీ నల్లగా అయిపోయింది. రావ్‌సాహెబ్ గారితో మాట్లాడుతున్నపుడు అతడి మనస్సులో చాలా ఆశలు మొలకెత్తాయి; కాని అవన్నీ ప్రచండమైనగాలికి శరత్కాలమేఘం విడిపోయినట్లు ఎక్కడి వక్కడ అణగిపోయాయి. ఒక్కసారి దీర్ఘంగా నిట్టూర్చి అతడు కుర్చీలోంచిలేచి "నేను చాలా ఆపదలో ఉన్నాను. లేకపోతే అసమయంలోవచ్చి—"

రావుసాహెబ్ వెనక్కితిరిగాడు. ఆయనకు వెళ్ళిపోవాలనే ఉద్దేశంలేదు నిజానికి. ఏదైనా విషయంమీద ఒక నిర్ణయానికి వచ్చేముందు కాస్సేపు పచార్లుచెయ్యటం ఆయనకు అలవాటు. ఆ అలవాటుప్రకారమే కుర్చీలోంచిలేచాడు. రావ్‌సాహెబ్ వెనక్కితిరిగి "నౌకరీ కావాలా? ఏం నౌకరీ చేస్తావ్?" అని అడిగాడు.

నిరంజన్ ఉత్సాహాన్ని తెచ్చుకుని "ఏదో ఒక నౌకరీ. ఏ పని చెపితే ఆ పని చేస్తా. వ్రాతకూ చదువుకూ సంబంధించని పని—"

"ఉహూ, అలాంటిపనికాదులే. సరే, ఆలోచిస్తా" అని కాస్సేపుఆగి, "తోటపని చెయ్యగలవా? అంటే

తోటమాలిపని కాదు. తోటలూ అవీ తనిఖీ చెయ్యటం- ఇలాంటిది. ఏడెనిమిదిమంది కూలీలున్నారు. ఏమీ పనిచెయ్యటం లేదు వాళ్లు. తెలిసిందా? అంతా మోసం! కేవలం దగా...!"

అప్రత్యాశితమైన ఆనందంలో నిరంజన్ కంఠం డగ్గుత్తికపడింది. కంఠస్వరాన్ని వీలైనంత సవరించుకుని "నన్ను బ్రతికించారు. మీరే తండ్రులు. ఆ పని నాకు అంత బాగా తెలిసింది కాకపోయినా నాలుగురోజుల్లో నేర్చుకుంటాను. ఏం చెప్పను? నేను మీ దయవల్ల—"

"దయఏముంది? శ్రమ తీసుకోవటం — డబ్బు ఇవ్వటం. మీరు కష్టపడతారు. మేము జీతం యిస్తాం. సరే, ఉండు నువ్వింక. నే నిప్పుడే బైటికి వెళ్ళాలి. పెద్దతోటమాలితో చెప్పివెడతాను కావలసిన ఏర్పాట్లన్నీ వాడు చేస్తాడు. సరే, వస్తాను" అంటూ నిరంజన్‌కు మళ్ళీ మాట్లాడేందుకు అవకాశం ఇవ్వకుండానే రావుసాహెబ్ బైటికి వెళ్ళిపోయాడు.

నిరంజన్ ఏమీ ఆలోచించుకోలేకపోయాడు. గడప గడపకూ తిరిగి అతను ఆత్మవిశ్వాసాన్ని కోల్పోయాడు. ఇంత త్వరలో తనప్రార్థన నెరవేరుతుందని అతడసలు ఊహించనే లేకపోయాడు. అపరిమితమైన ఆనందంతో కృతజ్ఞతతో అతడి కళ్ళలో నీళ్ళుతిరిగాయి. కాస్సేపు కదలకుండా అలాగే నిలబడిపోయి, ఆశ్రయదాతనుద్దేశించి ఒక నమస్కారం చేసి, ఇంట్లోంచి బైటికి వచ్చాడు.

రావుసాహెబ్ నిజంగా తోటమాలీల అజమాయిషీకి ఎవరైనా కావాలని వెతుకుతున్నాడా అంటే అదేంలేదు. ఆప

దలో ఉండి అర్థించటానికి వచ్చిన వ్యక్తిని నిరాశతో పంపటం అతడి స్వభావంకాదు.

విశేషించి దొరలమూలంగా ఎవరయినా ఉద్యోగం పోగొట్టుకున్నారూ అంటే – అలాంటివాళ్ళకు సహాయం చెయ్యటం అతడిస్వభావం. దొరల సంప్రదాయాలమీద అతడి కెంత గాఢమయిన అనురాగముందో, దేశవాళీ దొరలమీద అననురాగంకూడా అంతయెక్కువ ఉంది. రావుసాహెబ్ మొదట్లో వుద్యోగంచేస్తున్న రోజుల్లో తన పై అధికారి అయిన దొర మూలంగానే అతను ఉద్యోగం పోగొట్టుకున్నాడు. అప్పటి నుంచీ ఆ అవమానం అతడిహృదయంలో జాగృతమయ్యే ఉంది. ఆయన సహాయాన్ని అర్థించి చాలామంది దొరలమీద అబద్ధాలు కల్పించిచెప్పి ఆయన సహాయాన్ని పొందగలిగారు. ఈ సంగతి ఆయనకుటుంబంలోవాళ్ళకి అందరికి తెలుసు దేశవాళీదొరలు యజమానులైతే యెప్పుడూ అనాలోచితంగానే ప్రవర్తిస్తారని ఆయనకు గట్టినమ్మకంఉంది. కనుక నిరంజనుడి కథ సులభంగానే విశ్వసించాడు. అంచేతనే సిఫార్సు అక్కర్లేకుండా నిరుద్యోగి అయిన నిరంజనుడు రావుసాహెబ్ గారి ఉద్యాన పర్యవేక్షక పదవిలో ప్రవేశించగలిగాడు.

౨

నిరంజన్ పూర్వం మంచి స్థితిమంతుడే అతని తండ్రి మోహన్ గంగూలీ సంపన్నుడు. కోర్టులో నాజర్‌గా ఉండి డబ్బు బాగా సంపాయించాడు. రిటైరయి స్వగ్రామం వచ్చే శాక అతడిదృష్టి వ్యాపారంమీదికి పోయింది. మొదటి సంవత్సరం బెల్లం వ్యాపారంలో నష్టం వచ్చింది. ఆ నష్టం పూడ్చు కోటానికి మరుసటి సంవత్సరం జనపనారవ్యాపారం మొదలెట్టాడు. రెండు మూడేళ్ళయ్యేప్పటికి వ్యాపారంలో ఉన్న డబ్బుఅంతా పోవటమేకాకుండా చివరకు అప్పుకూడా తేలింది. తర్వాత మరికొన్నియేళ్ళు ఆర్థికంగా నానా బాధలూపడి, గంగూలీ మహాశయుడు పరమపదించాడు. అప్పుడే నిరంజన్ యఫ్. ఏ. ప్యాసయి బి. ఏ. లో చేరాడు. ఆకస్మికంగా ఈ ఆపదరావటంతో నిరంజన్ చదువు వదిలేసి ఇంటికి రావలసి వచ్చింది.

"నువ్వు చదువు మానవద్దు నిరంజన్! నేను భిక్షాటన చేసి అయినా గడుపుతాను" అన్నది అతనితల్లి.

"నువ్వు భిక్షాటనే చేయాల్సివస్తే నేను చదువుకుని మాత్రం లాభం ఏముంటుందమ్మా? ఉన్నభూమీ పుట్రాతో ఏదోవిధంగా గడవకపోదు. నువ్వేమీ దిగులుపడొద్దు"

ఏ భూమిమీదైతే నిరంజన్ ఇంతగా ఆధారపడ్డాడో అది ఆట్టేరోజులు నిలవలేదు. వడ్డీవ్యాపారస్తుడైన గోపాల్ కుండూతో గంగూలీకి ఇచ్చిపుచ్చుకోటాలు, లావాదేవీలు ఉంటూఉండేవి. గంగూలీపోయాక కొన్ని నెలలకు గోపాల్

ఒకరోజున చటుక్కున నిరంజన్ దగ్గిరకు వచ్చి గంగూలీ తనకు చాలా బాకీ ఉన్నాడని క్లెయిమ్ చేశాడు. నిరంజన్‌కు నెత్తికి చేతులొచ్చాయి. ఊళ్లోవాళ్ళంతా "ఇదంతా ఒట్టి దగా. మోసం. గంగూలీ గోపాల్ బాకీఅంతా అణాపైసలతో సహా తీర్చేశాడు" అన్నారు ఏమయితేనేం గోపాల్ కుండూ దావావేశాడు. నిరంజన్ చేతులురెండూ జోడించి బ్రతిమాలు కున్నాడు. కాని వినలేదతను. అసమర్థుడైన నిరంజన్ దావా నడిపించలేకపోయాడు. ఆ దావా డిక్రీ అయింది. పిత్రీయమైన భూమి ఉన్నదికాస్తా అమ్మేసి, పితృఋణం నిశ్శేషంగా తీర్చేసి, అతను ఊరునదిలి వచ్చేసినరోజునే – అతడి విధవచెల్లెలు సుధ అత్తవారింట్లోంచి లేచిపోయిందన్న పుకారు విన్నాడు. ఈ వార్తవిని నిరంజన్‌తల్లి మూర్ఛపోయింది. నిరంజన్ రెండు చేతులతో తల పట్టుకుని కూర్చుని 'ఒక్కసారిగా ఇన్ని శిక్షలు అనుభవించటం మానవుడికి సాధ్యమేనా?' అని ఆలోచించ సాగాడు. తెల్లవారిపోయింది ఆలోచనలతోనే.

పొద్దున్నే వీధిలోకి రావాలంటే నిరంజన్‌కి ధైర్యం చాలకపోయింది. ఈ కళంకం అప్పటికప్పుడే ఊరంతా పాకి పోయింది. సుధ అత్తవారింటి నుంచి ఉత్తరం తీసుకువచ్చిన పెద్దమనిషి దయవల్ల ఈ విషయం ఊళ్ళోనలుగురు పెద్దమనుష్యులచెవినీ పడింది. ఇది జరిగాక చాలామంది నిరంజన్‌నూ, అతడి తల్లినీ వచ్చి చూచిపోదామని మహా ఉబలాటపడ్డారు; కాని వాళ్ళ ఉబలాటం నెరవేరలేదు. నిరంజన్ గడపవిడిచిపెట్టి రానేలేదు. ఇక ఉండపట్టలేక శశాంక గోస్వామి సాయంకాలమప్పుడు సపరివారంగా నిరంజన్‌ను కుశలప్రశ్న చేయటానికని

వచ్చాడు. శశాంకగోసాయి గుమ్మంముందుకువచ్చి నిరంజన్‌ను కేకేసేసరికి అతడిగుండె గుబగుబలాడిపోయింది. పలకటమూ, పలకకపోవటమూ అనేది నిర్ణయించుకోలేక అతడు కాస్సేపు మెదలకుండా ఊరుకున్నాడు. మరుక్షణంలోనే "ఏమోయ్! బైటికి రావాయేం! పద కాస్త ఏటిఒడ్డున తిరిగివద్దాం" అని మళ్ళీ కేకేశాడు శశాంక్. గత్యంతరంలేక నిరంజన్ బైటికి వచ్చాడు, కాని తలయెత్తుకుని సరిగ్గా మాట్లాడలేకపోయాడు. కాని అసంగతి ఈ కుశలప్రశ్న చేయటానికని వచ్చినవారి కందరికి తెలియనిదికాదని అతడు ఊహించుకున్నాడు — హఠాత్తుగా ఇంతమంది ఇలా రావటానికి కూడా కారణం ఉందని గ్రహించాడు.

అతడు ఎలాగో ఒంట్లో బాగుండటంలేదనే సాకుతో బైటికిరాకుండా ఇంట్లో పడుకున్నా నిష్కృతి కలగలేదు. చీకటిపడగానే కుశలప్రశ్న చేసే స్త్రీలు వీరి అంతఃపురానికి రావటం మొదలెట్టారు. తలిస్థితి ఊహించుకుని నిరంజన్ కొంచెం భయపడ్డాడు, అమ్మలక్కలంతా ముందు అనవసరపు సంగతులేవో మాట్లాడి — అసలు సంగతి ఎత్తేసరికి నిరంజన్ ఇంక ఊరుకోలేకపోయాడు. తుఫానులా రివ్వున అమ్మలక్కలు చేరిన కొట్లా లోకిపోయి "ఎందుకొచ్చారు మీరంతా? ఫోండి, ఇక్కడి నుంచి. ఆవిడకు అసలే అస్వస్థతగాఉంది. మీరంతాచేరి మరింత చీకాకు కలిగించకండి" అన్నాడు. ఆవచ్చినవాళ్ళంతా కొందరు తెల్లపోయి, మరికొంతమంది భయపడి మెల్లగా అక్కడినుంచి జారుకున్నారు. కాని వెళ్ళేముందు ఒకళ్ళిద్దరు

నూటికి పోటీమాటలు అనుకుంటానుమాత్రం వెళ్ళలేను.

నిరంజన్ మనస్సులో ఒక నిర్ణయానికి వచ్చాడు: రాత్రి పదింటికి చరణుడు తన మాతృదేవతకు నమస్కరించటానికివచ్చి నప్పుడు:"చరణ్! విన్నావా ఈసంగతి?"అనడిగాడు నిరంజనుడు.

చరణుడు నెత్తిమీది తట్టదించుకుని "విన్నానుబాబూ! కాని విశ్వాసం కలగటంలేదు బాబు" అన్నాడు.

"నిజంకానీ- అబద్ధంకానీ, ఇంక ఈఊళ్లో ఉండలేను"

"ఎక్కడికి వెడతారు బాబూ?"

"అమ్మను మామయ్యగారిఇంటికిపంపించి, నేను కలకత్తా వెళ్ళిపోదామని నిశ్చయించుకున్నాను."

చరణుడు కాస్సేపు నిరుత్తరుడై "అలాగే వెళ్ళవచ్చు. ఎప్పుడు వెడతారు?" అన్నాడు.

నిరంజనుడు స్థిరనిశ్చయంతో"ఇవాళ రాత్రే"అన్నాడు.

చటుక్కున ఇల్లు విడిచిపెట్టి పోవటంలో కలిగే ఇబ్బం దులను, వచ్చే అప్రతిష్ఠనూ వెనకా ముందూ బాగా ఆలో చించుకుని ఆ రాత్రే ఊరువిడిచిపెట్టి పోవాలని స్థిరీకరించుకు న్నాడు నిరంజనుడు ఇంటి బాధ్యతఅంతా పూర్వంనుంచీ ఉన్న నౌకరు చరణ్‌కు అప్పగించి, తల్లీ కొడుకూ ఆ తెల్ల వారుఝామునే వెళ్ళిపోయారు. వెళ్ళేముందు చరణుడు ఉభ యులకూ నమస్కరించి "ఇవాళ మళ్ళీ మా అమ్మను పోగొ ట్టుకుంటున్నాను బాబూ!" అని కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు.

నిరంజనుడు అతణ్ణి ఓదార్చి "నువ్వు ప్రతినెలా వెళ్ళి అమ్మను చూసివస్తూఉండు చరణ్! నేను కలకత్తా వెళ్ళాక నీకు ఉత్తరం రాస్తాను" అన్నాడు.

మేనమామ అయిన హారాన్‌చంద్రుని ఇంట తల్లిని దిగబెట్టి నిరంజనుడు కలకత్తా వెళ్ళిపోయాడు. వెళ్ళేప్పుడు మేనమామ "ప్రతినెలా ఏదో కాస్త ఖర్చులకు పంపుతూఉండు నాయనా! నా పరిస్థితి నీకు తెలియనిదికాదుగా!" అన్నాడు.

కలకత్తావచ్చి నిరంజనుడు ఉద్యోగంకోసం వేటాడటం మొదలెట్టాడు. వారం తిరక్కముందే ఒక ఇంగ్లీషు వార పత్రికలో ఉద్యోగందొరికింది. ఆ పత్రికాధిపతులు చవుకగా ఎవరైనా దొరుకుతారేమో అని వెతుకుతున్నారు. నిరంజన్ ముప్ఫైరూపాయలకు కుదిరాడు. విదేశీ వార్తాపత్రికలనుంచి వార్తలు సంగ్రహించటం చెయ్యవలసినపని. మొదటి రెండు మూడు మాసాలూ నిరంజనుడు నిరుపద్రవంగానే తన పని చేసుకుపోయాడు. ఒకసారి దేశీపత్రికలో - దేశీయసంఘటన ఒకదానిమీద హీనదృక్పథంతో వ్యాఖ్యానించటంచూసి, దాన్ని ఉటంకించి తమ పత్రికలోవేస్తూ - దానిమీద చమత్కారంగా తన వ్యాఖ్యానంకూడా అచ్చుకిచ్చాడు. అసలు సంపాదకుడు ఊళ్ళోలేడు. అదికాస్తా అచ్చుఅయింది. మర్నాడో మూడోనాడో సంపాదకుడువచ్చి నిరంజనుణ్ణి పిలిపించాడు. నిరంజనుడు గజగజలాడుతూ ఆతనగదిలోకి వెళ్ళగానే_ఎంత పరమవైష్ణవుడూకూడా సహించటానికి వీల్లేనంత నీచంగా సంబోధించాడు అతణ్ణి. నిరంజనుడు ఆదెబ్బతో తన సహనాన్నీ దానితోపాటు ఉద్యోగాన్నీకూడా పోగొట్టుకొన్నాడు. కాని నిరంజనుడు రాసిన ఆ పదిపంక్తులవ్యాఖ్యానం మూలంగా ఆ సంపాదకుడికి ఆ సంవత్సరం రావలసిన 'రావ్‌సాహెబ్' బిరుదు రాకుండాపోయింది.

ప్రతి కాఫీసులోంచి వచ్చి నిరంజనుడు మళ్లీ వీధినిపడ్డాడు. జేబులో ఉన్న డబ్బు కాస్తా అయిపోయింది. ఉద్యోగం మాత్రం దొరకలేదు. మేనమామదగ్గిరనుంచి డబ్బుకోసం తాఖీదుల మీద తాఖీదులు రావటం ప్రారంభించాయి. మొదటినెలలో చేతిగడియారం అమ్మి, రెండో నెలలో తాను ఎంతో కష్టపడి సంపాయించుకున్న ఇంగ్లీషుపుస్తకాలు అమ్మి మేనమామకు డబ్బు పంపించాడు. మూడో నెలలో ముగ్గురిసిఫార్సుల మీద దొరగారిదగ్గిర యాభైరూపాయలమీద గుమాస్తా ఉద్యోగం దొరికింది. మొదటిరోజున ఉద్యోగంలో ప్రవేశించటానికై వెళ్ళేప్పుడే ఈ శిఫార్సుదారులలో ఒకరైన రామవిలాస బాబు చాలా "చాకచక్యంగా నీపని చేసుకుపోతూ ఉండు బాబూ! దొర మంచివాడు. అందులోనే వృద్ధిలోకి వస్తావు" అని చెప్పాడు.

వాస్తవానికి దొర చెడ్డవాడు కాదు. మొదటిరోజునే అతణ్ణి తన గదిలోకిపిలిచి, చాలా ఉపదేశాలూ, ఉత్సాహమూ ఇచ్చాడు. ఆ ఆనందంలో నిరంజన్ తనగాథ యావత్తూ ఆ దొరతో చెప్పుకున్నాడు. అదంతావిని దొర సానుభూతి కనపరిచాడు. చివరకు "కష్టపడి చక్కగా పనిచేస్తే త్వరలోనే వృద్ధిలోకి వస్తావు" అని ధైర్యంగా చెప్పాడు. ఆ ఆశతో నిరంజనుడు మొదట్లో కొన్ని నెలలు చాలా ఓపికగా శక్తివంచన లేకుండా పనిచేశాడు. తాను ఇహ 'ఇంక్రిమెంట్' వస్తుందని ఆశిస్తున్న నెలలోనే 'మిసెస్ డబ్సన్' డబ్సన్‌తో చెప్పి నిరంజన్‌ని తనకు బెంగాలీ చెప్పేందుకు మాష్టరుగా నియమించుకుంది కాని నిరంజనుడు మొదట్లో ఒప్పుకోలేదు. ఎందుచేత

నంటే మిసెస్ డబ్‌సన్ ప్రవర్తన మంచిదికాదని అప్పటికే నిరంజన్ విని ఉన్నాడు. కాని ఏమయినా మాష్టరుగా ఉండక తప్పలేదు. ఒక వారంరోజులు ఉపాధ్యాయపదవి నిర్వహించగానే నిరంజనుడు ఒక నెల శెలవడిగాడు. ఈ నెల్లాళ్ళలో ఎక్కడైనా మరో ఉద్యోగం చూసుకుని ఈ నౌకరీ వొదులుకుందామని నిరంజనుడి ఉద్దేశ్యం. డబ్‌సన్ దొర అప్పుడు ఏదో పనిమీద బొంబాయివెళ్ళాడు. ఆయన ఊళ్ళోలేదనే సాకుతో మిసెస్ డబ్‌సన్ శెలవు మంజూరుచెయ్యలేదు.

ఈలోపుగా ఒక సంఘటన జరిగింది. డబ్‌సన్ స్నేహితుడొకాయన రోజూ వాళ్ళింటికి టెన్నిస్ ఆడటానికి వస్తూ ఉండేవాడు. దొర బొంబాయి వెళ్ళినదగ్గర్నుంచీ ఈ స్నేహితుడి రాకపోకలు జాస్తి అయినాయి. ఒకరోజున సాయంకాలం దొరసాని నిరంజనుడ్ని తన రీడింగ్‌రూమ్‌లోకి పిలిపించుకుని 'చాలా చెడ్డపిల్లవాడు' అన్న పాఠం చదువుతోంది. చదవటం మొదలుపెట్టిన కాస్సేపటికి ఆ డబ్‌సన్ మిత్రుడు తప్పతాగి గదిలోకి వస్తూనే వెనకనుంచి నిరంజనుడిమెడపట్టుకుని కుర్చీమీదనుంచి క్రిందకులాగి, "బైటికిఫో ఇక్కడినుంచి నల్లకుక్కా!" అని తిట్టాడు ఇంగ్లీషులో. నిరంజనుడు కొద్దినిమిషాలు అలాగే నిలబడి, ఆవేశంతో కాలిచెప్పు తీసుకుని అతడ్ని కొట్టాడు తర్వాత దొరసానికేసి తిరిగి "నేను మళ్లీ ఆ గుమాస్తాపోస్టుకేవెళ్ళి పనిచేస్తాను. దొరవచ్చాక వచ్చి కనిపిస్తాను" అని ఇంగ్లీషులో చెప్పి వెళ్ళిపోయాడు. కాని దొర రాలేదు. మూడునాలుగు రోజులతర్వాత నిరంజన్ గంగూలీ దుష్ప్రవర్తన మూలంగా అతడ్ని 'డిస్‌మిస్' చేసినట్లుగా దొర

దగ్గిర్నుంచి పెద్దగుమాస్తాకు రహస్యంగా ఉత్తరం వచ్చింది

ఆ పెద్దగుమాస్తాకు నిరంజనుడి అపరాధం ఉన్నదీ లేనిదీ తెలుసు, "నీకు నిజంగా బహుమతి ఇవ్వాల్సినవానికి నీ నోటిముందరి రొట్టె పడగొట్టాడు అదే విచారించతగ్గసంగతి బాబూ! పోనీ, నువ్వు దిగులుపడకు. మంచిపని చేసినందుకు భగవంతుడు నీకు మేలుచెయ్యకపోడు" అని చెప్పి అతడు నిరంజన్‌కు అప్పటికి రావలసిన జీతంతోపాటు మరో పాతిక రూపాయలుకూడా అదనంగాయిచ్చి ఆశీర్వదించి పంపించివేశాడు.

నిరంజనుడు మళ్లీ బజారునపడ్డాడు. రామవిలాసబాబు కొడుక్కి జబ్బుగా ఉండటంవల్ల తనదేశం వెళ్ళిపోయాడు. ఆయన సహాయం ఏమీ పొందటానికి వీల్లేకపోయింది పత్రికల్లో 'కావలెను' అని ప్రకటించిన ప్రకటనలకు దరఖాస్తులు పెట్టి తాను మూడునెలలు కాళ్ళను బలపాలుకట్టుకుని తిరిగాడు. ఆ వచ్చిన జీతంరాళ్ళు అన్నీ ఖర్చు అయిపోయాయి. ఉద్యోగంమాత్రం దొరకలేదు. చివరకు కొన్నాళ్ళు ఒకపూట అర్ధాకలి తిండి తిని రెండోపూట కాసిని ఒటాసీలు తిని పంపులో మంచినీళ్లు త్రాగి గడపాల్సివచ్చింది. అప్పుడు నిరంజనుడు ఇహ 'సిటీ' విడిచిపెట్టి సిటీ పరిసరాల్లో తిరగడం మొదలెట్టాడు. ఇద్దరు ముగ్గురు యువక బారిష్టర్లు ఏవైనా కేసులు అప్పగిస్తే నౌకరీ ఇస్తామని ఆశ చూపించారు. అందుకోసమని ప్రయత్నించటంలో మిగిలిన చిల్లరడబ్బులుకూడా పూర్తిఅయినాయి. అప్పుడొక ముసలిప్లీడరు అతణ్ని చూసి జాలిపడి, ఒక రూపాయి తీసుకువచ్చి ఇచ్చి, ఈ గుప్తగారి దగ్గిరకు వెళ్ళమని సలహాయిచ్చాడు.

అక్కడకు వచ్చిన మొదటిరోజుల్లో గుప్తగారి దర్శనానికై పడిగాపులుపడి ఉండి దర్శనంకాక వెళ్ళిపోతూఉండేవాడు. తర్వాత అతడు ఏ పరిస్థితుల్లో ఎలా రావుసాహెబ్ గుప్తగారిని కలుసుకున్నాడో మొదట్లో చెప్పాను.

## 3

నౌకరీలో చేరిన నాలుగయిదు రోజుల్లోపుగానే ఊళ్లో వాళ్ళందర్నీ పరిచయంచేసుకున్నాడు నిరంజనుడు. అయితే దొరలతో మాత్రం ఎవరితోనూ పరిచయంకాలేదు. నిజానికి దొరలంటూ సాలవనంలో ఎవరూలేరు. విజాతీయ - విదేశీయ ఆచారాలను ఆచరిస్తూఉండే స్వదేశీయ ధనికులుండే వీధినే మామూలువాళ్ళందరూ దొరల వీధి అని అంటూ ఉంటారు. రావుసాహెబ్ అతడికి అప్పగించిన పనిలో కావలసినంత తీరిక ఉంటుంది ఆ తీరికసమయాల్లో ఊళ్ళో రైతులతో, పెద్దమనుష్యులతో కబుర్లు చెబుతూ కాలక్షేపం చేస్తూ ఉండేవాడు. అహంకారం ఏమీ లేకుండా కమ్మగా కబుర్లు చెబుతూఉండే ఈ నిరంజనుడితో తమ కష్టసుఖాలు చెప్పుకోటానికి ఎవరికి సంకోచం లేకపోయింది. అతడూ అత్యంత ఆప్తునిలాగా ఓపికగా ఎవ రేది చెప్పినా విని తనకు తోచిన సలహాలిస్తూఉండేవాడు. పగలల్లా ఇలాగడిపి, సాయంకాలం తిరిగి వచ్చి సాంధ్యకృత్యాలు నిర్వర్తించుకుని తలుపులు వేసుకుని చదువుకుంటూ కూర్చునేవాడు. కలకత్తానుంచి వచ్చేటప్పుడు

నిరంజనుడు తన స్నేహితుడొకాయన దగ్గిర కొన్ని ఐతిహాసిక గ్రంథాలు తీసుకుని వెంట తెచ్చుకున్నాడు. ప్రస్తుతం అతడు రోజూ చదివే పుస్తకాలుఅవే. పొద్దున్నే సంధ్యావందనాదులు నిర్వర్తించుకుని, ఒకసారి పోయి ఆ తోటలూ, పార్కులూ చూసుకుని, కొంచెం అలసట అనిపిస్తే దేవిడీకివెళ్ళి దర్వాన్ బిహారీసింహుని దగ్గిర హిందీ చదువుకోటానికి కూర్చునేవాడు. ఇలా నిరంజనుడు ఒకరకంగా నిశ్చింతగా నే రోజులు వెళ్లబుచ్చుతున్నాడు. మధ్యమధ్య చెల్లెలుసుధసంగతే అతడికి మనస్సంకటంగా ఉండేది. సుధ అసలు సౌందర్యవతీ, శీలవతీ. దురదృష్టవశాత్తూ చిన్నతనంలోనే వితంతువయింది. కాని ఇంతవరకు ఆమెవిషయమై ఎవరూ పల్లెత్తుమాట అని ఎరుగరు. భర్త పోయిన నెలలోపల మూడుసార్లు ఆత్మహత్య చేసుకోటానికి ప్రయత్నించింది. అలాంటి సుధ ఇప్పు డిలా అవుతుందని అతడు కల్లోకూడా అనుకోలేదు. క్రితంసంవత్సరం వెళ్లినప్పుడు సుధ ఎంత ఓర్పుకలదో తాను కళ్ళారా చూసివచ్చాడు. ప్రొద్దుటనుంచి సాయంత్రంవరకూ అత్తగారితిట్లు, మరదుల ఈసడింపులు అన్నిటినీ చిరునవ్వుతో సహిస్తూ యమచాకిరీ చేస్తూఉండేది. "నువ్వు చాలా కష్టపడుతున్నావు సుధా!" అని అడిగాడు తానొకసారి. ఆమె నవ్వుతూ "కష్టమేముంది అన్నయ్యా? ఈ చాకిరీ అంతా చెయ్యటానికేగా వారు నన్ను విడిచిపెట్టిపోయిందీ!" అన్నది. ఆనాడు చెల్లెలి ఈ ఓర్పు చూసేసరికి నిరంజనుడికి కళ్ళల్లో నీళ్లు తిరిగాయి. కాని నేడు తలచుకున్న కొద్దీ ఏడుపువస్తోం దతడికి. సుధ జ్ఞాపకంవచ్చిన రోజల్లా ఇంక అతడికి మరోపని సాగటంలేదు.

నౌకరీ కుదిరాక ఇప్పటివరకూ నిరంజనుడికి రావు సాహెబ్ మళ్ళీ కన్పించలేదు. నిరంజనుడూ ఆయన్ని కలుసుకోటానికిప్రయత్నించలేదు. ఆరోజున అతను సాంధ్యకృత్యాలు నిర్వర్తించుకుని పుస్తకంతీసుకుని చదువుకుంటూండగా దొరగారు పిలుస్తున్నారని కబురు వచ్చింది. నిరంజనుడు పుస్తకం మూసి అక్కడ పెట్టి సరాసరి డ్రాయింగ్ రూంలోకి వెళ్ళాడు. డ్రాయింగ్‌రూమ్‌లోకి వెళ్ళేప్పటికి రావు సాహెబ్‌గారి శెక్రెటరీ మాధవదత్తు అంటే మిష్టర్ యమ్. దత్ కూర్చుని ఉత్తరాలు రాసుకుంటున్నాడు. ఇతడి అడుగుల చప్పుడు విని తలయెత్తి చూసి "ఏమిటోయ్ ఛోక్ రా! ఇక్కడ చేరావన్లేఉందే!" అన్నాడు.

దత్తుగారి ఈ అశిష్ట సంభాషణాధోరణి నిరంజనుణ్ణి ఆఘాతపరిచింది. ఒకవిధమైన జవాబు మనస్సుకు తట్టింది. కాని అతడు ఉద్రేకాన్ని తమాయించుకుని నిర్వికారభావంతో "చిత్తం" అన్నాడు.

"జీతమెంత?"

"అది తెలియదు. ఇంకా చెప్పలేదు"

దత్తుగారు నీచార్థకమైన ఒక ఇంగ్లీషుమాట విసిరి "నిన్నుకూడా ఎవడో దొర వెళ్ళగొట్టి ఉంటాడనుకుంటా అవునా! ఏమయితేనేం, మీకందరికీ భలే చమత్కారమైన ఉపాయం దొరికిందిలే" అన్నాడు.

ఈసారి నిరంజనుడికి కోపంతో ముఖం ఎఱ్ఱపడింది. అతడి మాటల్లో తననిగురించి ఏ అసహ్యకరమైన భావన వ్యంగ్యంగా ఉందో అది క్షణంలో గ్రహించాడు. కాని సాధా

రణంగా ఇలాంటి పరిస్థితుల్లో అతను ఏంచేసేవాడో ఆ పని మాత్రం చెయ్యలేదు ఈసారి. ఆతడి మాటలు విని కొన్ని నిమిషాలు అలాగే నిలబడి, ఆతడిమీదికి ఒక కటాక్షబాణం విసిరి వెనక్కి తిరిగి బయలుదేరాడు సరీగా సమయానికి రావు సాహెబ్ గదిలోకివస్తూ "ఏమిటి గంగూలీ? ఏం, వెళ్లిపోతు న్నావేం? రా." అని పిలిచాడు. తర్వాత నిరంజనుడు దగ్గరకు రాగానే "ఇదిగో చూడు, నిన్ను ఒక్కొగంగూలీఅని పిలిచానని మన స్సులో ఏమీఅనుకోకు. ఎంచేతనో ఏమో నాకు పేరెప్పుడూ జ్ఞాపకం ఉండదు. నీ పేరేమిటి?" అని అడిగాను.

"చిత్తం. నిరంజన—"

"ఆఁ, ఆఁ. ఇకార జకారాలు ఉన్న అక్షరం ఒకటి ఉన్నట్లు నాకు జ్ఞాపకంవచ్చింది. కాని అది పురంజయుడో, సంజయుడో, నిరంజయుడో, పర్రి రంజనుడో మాత్రం గుర్తుకు రాలేదు. ఇంక జ్ఞాపకం ఉంటుంది లే. సరే కూర్చో" రావు సాహెబ్‌గారి మాటలతో నిరంజనుడి మనస్సులోని విచారం మాయమైంది. అతడు టేబిల్ దగ్గిర్నుంచి కుర్చీ ఈవలకు లాక్కుని కూర్చున్నాడు. రావుసాహెబ్ మాధవదత్తుని ఉద్దే శించి "చూశావా మాధవ్? ఇతడు ఒకడు మనదేశంలోని ఆంగ్లోఇండియనుల బాధలకు—"

మిస్టర్ దత్తు ముఖం పైకిఎత్తకుండానే "చిత్తం, అవును కాని నాకు అట్టేచూడగా అసమర్థులంతావచ్చి చివరకు ఇక్క డకు చేరుకునేట్లు తోస్తోంది" అన్నాడు.

ఇలాంటిమాటలు వినటం రావుసాహెబ్‌కు అలవాటే. కాని నిరంజనుడిఎదుట ఇలాంటిమాట అన్నందుకు ఆయన

నొచ్చుకున్నాడు. "మీరు చేస్తున్నదే సరిఅయినదనీ, మేమంతా 'ఓల్టుఫూల్స్'మనీ నీ ఉద్దేశం" అని మరుక్షణంలోనే నిరంజనుడికేసి తిరిగి "నిన్ను ఎందుకు పిలిపించానంటే—ఎల్లుండి లలిత పుట్టినరోజు. పార్టీ అవీ ఉంటుంది. నేను ఎప్పుడూ 'కల కత్తా'నుంచే పూలు తెప్పిస్తూ ఉండేవాణ్ణి. ఈసారిమాత్రం కావలసిన పూలన్నీ నువ్వు సప్లయిచెయ్యాలి. ఆ భారం నీకు అప్పగించాను. తెలిసిందా? వెళ్ళు"అని నిరంజనుణ్ణి పంపించేసి తానూ అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

రావుసాహెబ్‌గారింట్లోకి కొత్తవ్యక్తులు వచ్చి ప్రవేశిస్తూఉండటం మొదట్లో దత్తుగారికి ఇష్టంఉండేదికాదు. లోకంలో ఎవ్వర్నైనా విశ్వసించటమంటే అతడి స్వభావానికి విరుద్ధం. రావుసాహెబ్ కల్లాకపటం లేనిమనిషి. ఎవర్నయినా సరే విశ్వసించటం ఆయనజబ్బు చాలాకాలం 'ఎటర్నీ'గా పనిచేసినా ఆయన ఈ మానసిక దౌర్బల్యాన్ని పోగొట్టుకోలేక పోయాడు. క్రొత్తగా ఎవరయినా సహాయంకోరి వస్తే-వాళ్ళను చూచాదంటేచాలు, దత్తు గేటుదగ్గరనుంచే వెనక్కి పంపించేసేవాడు. ఎవడైనా దైవాద్వా ఎలాగోఅలా రావుసాహెబ్‌ను కలుసుకున్నాడంటే - ఆయన్ని హెచ్చరిక చేస్తూఉండటం దత్తుగారి ముఖ్యమైనపని. ఎవరిమాటమీదనో ఆధారపడి, కేవలం వాళ్ళుచెప్పినట్లుగానే నడుచుకోవటం రావుసాహెబ్‌గారి కెన్నడూ అలవాటులేదు. అంచేత దత్తుగారు ఎన్నివేలయుక్తులు పన్నినాకూడా రావుసాహెబ్‌గారి విశ్వాసాన్నీ, వివేచనాశక్తినీ ఏమాత్రం మార్చలేకపోయాడు. మామూలు అలవాటుప్రకారం అతడు మొదట్లో నిరంజనుణ్ణి రావుసాహెబ్‌ను

కలుసుకోకుండా చేశాడు. అతడు వెళ్ళిపోయాడని, బెడద తీరి పోయిందనీ అనుకున్నాడు. కాని తాను ఊరినుంచి తిరిగివచ్చే సరికి నిరంజనుడు తోటమాలీలపైన అజమాయిషీ చేసేవాడుగా కుదరటం చూశాడు. ఈ వ్యవహారం ఆదిలో అతడికేమీ రుచించలేదు. అతడు రావుసాహెబ్‌గారి దగ్గరకు వెళ్ళి, "చూడండి, మనం ఏ వ్యక్తినయితే చేర్చుకోవాలని చూస్తామో ఆ వ్యక్తినిగురించి పూర్తిగా వాకబుచేసి తెలుసుకోందే—"

"వాకబుచెయ్యటమా? అతడు చేసేపని కూలీలపైన అధికారం. దానికి వాకబు ఎందుకు!" అన్నాడు. ఆపైన రావు సాహెబుగారితో ఇంక సంభాషణ జరగలేదు. కాని దత్తుగారు నిరంజనుడంటే మనస్సులో మండిపోతూనేఉన్నాడు.

మాధవదత్తుకు ముప్ఫై ఏళ్ళుంటాయి. మధ్యపాపిడి క్రాపు. రెండువైపులా దుబ్బులాగా ఉంటుంది జుట్టు. మెడల మీద అంటకత్తెర. గడ్డం మీసం నున్నగాఉంటాయి. కళ్ళకు బంగారంఫ్రేమ్ అద్దాలు. ఆకర్షణీయమైన శరీరచ్ఛాయ. కేవలం అచ్చ దొరలా ఉంటాడు. యమ్. ఏ. పాసయినాడు. రావుసాహెబుగారి ఫర్మ్‌లో చేరాడు. డబ్బు లేకపోవటం మూలంగా విదేశాలకు వెళ్ళలేకపోయాడు. అంచేత వేష భాషల్లో-హావభావాల్లో-ఆచార సాంప్రదాయాల్లో విదేశాలకు పోయివచ్చిన వాళ్ళకు ఏవిషయంలోనూ తీసిపోకుండా ఉండా లని నిశ్చయించుకున్నాడు. కనుకనే ఒక్క పేరుతప్ప మిగతా సర్వవిషయాల్లోనూ విదేశీయునిలాగా ఉండటానికి సర్వవి ధాలా ప్రయత్నిస్తూ వుంటాడు. విదేశాలకు వెళ్ళివచ్చిన వా రెవరైనా కనిపిస్తే అనర్గళంగా ఇంగ్లీషు మాట్లాడుతాడు.

టేబిల్ మీద ఫోంచేస్తాడు. ఆంగ్ల మర్యాదలకు సంబంధించిన పుస్తకం కనుక ఏదైనా జేబులో వుంటే అది తీసి ఇంక ఆ విషయాలమీద ఉపన్యాసాలు దంచుతాడు ఇలాంటి దత్తుగారు రావుసాహెబ్ గారి శెక్రటరీ. రావుసాహెబ్ గారు మధ్యమధ్య ఎప్పుడయినా శెక్రటరీగారిన్ని అలక్ష్యంగా మాట్లాడినా మొత్తానికి అతడంటే ఇష్టమే. దానికి కారణం ఒక్కటే: దత్తుగారు చక్కని ఇంగ్లీషు వ్రాయగలడు. అదీగాక రావుసాహెబ్ గారి భార్యను ఎప్పుడూ 'అమ్మా' అని ఆప్యాయంగా పల్కరిస్తూ తనని గురించి అంతఃపురంలో కూడా అప్రియంగా మాట్లాడుకోటానికి వీల్లేని స్థితిలో పెట్టాడు వారిని. గృహిణే కాకుండా దత్తుగారికి మరో భక్తురాలుంది-ఆమె లలిత—రావుసాహెబ్ గారి ఏకైక పుత్రిక. ఆమె లేడీస్ కాలేజీలో 'థర్డ్ ఇయర్' చదువుతోంది. ఆమెకు ఇంగ్లీషుభాషలో అసాధారణమైన ప్రవేశంవుంది.

ఇంగ్లీషులో కవిత్వం రాయాలనీ, బిసెంట్‌లాగా అనర్గళమైన వాగ్ధోరణి అలవరచుకోవాలనీ ఆమెకాంక్ష. ఇందుకోసమై ఆమె చేసే ప్రయత్నాలకు అంతులేదు. కాలేజీలో డిబేటింగ్ క్లబ్బులో ఎప్పుడూ నియమంగా వాద వివాదాల్లో పాల్గొంటూ ఉండేది. దత్తుగారు వ్రాసియిచ్చిన ఉపన్యాసం రాత్రిళ్ళు కంఠస్థంచేసేది. తాను కవిత్వం రాయటం ప్రారంభించి దత్తుగారికిచ్చి తప్పులు సవరించుకునేది. సంశోధించబడిన రచనలో పదిహేనువంతులు దత్తుగారి రచనా, ఒకవంతు రచయిత్రిదీ అయినా కాలేజీ మాగ్‌జైన్‌లో ఆమె పేరుతోనే అచ్చుఅయ్యేది. కొన్నాళ్ళయాక

ఆ కాలేజీ మాగ్‌జైన్‌ను ఒక ఇంగ్లీషుపత్రిక రివ్యూచేస్తూ లలిత రచనను ప్రత్యేకంగా ప్రశంసిస్తూ ఈమెకు ఉజ్వలమైన భవిష్యత్తుఉందనికూడా వ్రాసింది. కవిత్వమూ, రచన. సమాలోచనలకు సంబంధించిన ఈ రహస్యవిషయం వీళ్ళిద్దరిమధ్యనే ఉండేది. రావుసాహెబ్‌గారికికాని, వారి బంధువులకుకాని లలితరచనలవిషయంలో ఎలాంటి అనుమానాలూ లేవు.

ఇలా కీర్తికాంక్షిణియైన ఆబాలికమీద దత్తుగారు తన అధిపత్యాన్ని విస్తృతం చేసుకుంటూవచ్చాడు. గృహిణిగారి అనుగ్రహమూ, లలిత శ్రద్ధాభక్తులూ అనుకూల గ్రహాలలాగా మాధవదత్తుని సర్వపరిస్థితుల్లోనూ రక్షిస్తూవచ్చాయి. అందుకనే రావుసాహెబ్‌గారియింట్లో అతడంటే అపరిమితమైన గౌరవముంది.

## ౪

ఊళ్ళో పెద్దమనుష్యులయిన వారితో, కానివారితో పరిచయంచేసుకోటమే కాకుండా నిరంజనుడికి మరో ముఖ్యమైన పనిఉంది—— చేపల్నిపట్టటం ఈపనిలో అతడికి ప్రధానమైన సహచరుడు భిల్లుక్. భిల్లుక్ రావుసాహెబ్‌గారి కోచ్‌మాన్. అతడు మొదటిరోజుల్లో బండికొన్నప్పుడు భిల్లుక్ ఒక ఖూనీ కేసులోంచి విడుదలై రావుసాహెబ్‌గారిదగ్గిర పనిలో చేరాడు. అప్పటినుంచీ- అంటే- ఈ పది కేళ్ళనుంచీ చాలా శాంతంగానే వాళ్ళకుటుంబంలో కలిసి కాలక్షేపంచేస్తున్నాడు. అత

డికి ఇంచుమించు డెబ్భైఏళ్ళున్నా యౌవనోత్సాహం మాత్రం ఏమీ తగ్గలేదు. అతడు ఇప్పుడు యించుమించు పించన్ తీసుకుంటున్నాడని చెప్పవచ్చు. ఎంచేతంటే రావుసాహెబుగారు కారు కొన్నప్పట్నుంచీ ఆ బండి ఉపయోగించటం మానేశారు. గుర్రాలు రెండూ రెండుపూటలా దాణా మేస్తాయి. గుర్రాల నౌకర్లు ఇద్దరూ ఉదయందగ్గిర్నుంచీ సాయంకాలం వరకూ వలలు అల్లుతూ దారేపోయే పల్లెపడుచులతో సరసాలాడుతూ ఉంటారు. భిల్లుక్ ఇదివరకు ఎప్పుడూ ఏడున్నరదాకా నిద్రపోతూండేవాడు నిరంజనుడు వచ్చిందగ్గిర్నుంచీ ఉదయం ఆసమయంలో అతడివెంట తిరుగుతున్నాడు.

దత్తుగారిదృష్టి ఈ వైపునా పడింది. అతడు పనిచెయ్యని మనుష్యులను ఏమాత్రం గౌరవించడు. ఒకరోజున రావుసాహెబుగారితో "చూడండి. గుర్రాలూ, బండీ ఉంచుకోవటం అనవసరం. వృధాఖర్చు; కారు ఉందిగా!" అన్నాడు.

"గుర్రాలూ బండీ లేకపోతే ఎలాగడుస్తుంది?" అని అన్నాడు రావుసాహెబు.

"కారు ఉందిగా! పోనీ మరొక 'టూసీటర్' కూడా కొంటే—"

"అది సరే, తెలిసింది. కాని వీళ్ళకు ఎలాగడుస్తుంది?"

"వీళ్ళకంటే ఎవరికి?"

"కోచ్‌మన్ భిల్లుక్ ఉన్నాడాయె. మాధూ గుర్రాల్ని మేపేవాడు ఉండె. పీటని అమ్మివేస్తే వాళ్ళసంసారాలు ఎలా గడుస్తాయి?" దత్తుగారు ఆశ్చర్యపోయి "అదేమిటి, వాళ్ళను గురించే చెప్పేది నేను. వీళ్ళకేంపనిపాటాలేదు. రోజల్లా ఎక్కడో

ఎవరితోనో కబుర్లు చెబుతూ తిరుగుతూంటారు. ఇప్పటికి మూడు నెలలనుంచీ అసలు బండిని కదిలించనేలేదుకదా! ఇదంతా అనవసరంఖర్చు—" అన్నాడు.

రావుసాహెబ్ గారు గాంభీర్యం వహించి, "అది నిజమే ననుకో. కాని వీళ్ళల్లో ప్రతిఒక్కడూ ఇరవై పాతికేళ్ళనుంచి మా చెప్పులు మోసి బ్రతికినవాళ్లు, తెలుసా మాధవ్! గవర్నమెంట్ ఆఫీసులోనే కనుక అయితే పింఛన్ తీసుకునేవాళ్లు. నేనూ వాళ్ళకు పింఛను ఇస్తున్నాననుకో. బండి అమ్మివేసే వాణ్ణే. కాని నేను చాలా ఆలోచించి వీళ్ళకోసమనే దాన్ని అమ్మటం మానేశాను" అన్నాడు.

మాధవదత్తు ప్రభువుగారి మూర్ఖతకు ఆశ్చర్యపోయాడు. అప్పుడు పైకి ఏమీ అనలేదు. కాని అంతఃపురంలోకి వెళ్ళి రావుసాహెబుగారి గృహిణి యెదుట ఆ బండిని అమ్మటానికి గల కారణాలనూ యుక్తులనూ ఒక్కొక్కటే ఏకరువుపెట్టాడు. ఆమె ఆ యుక్తులన్నీవిని, 'అందుకనే డబ్బు నిల్వ కన్పించటం లేదు. జీతాలుయిచ్చి ఎంతమందినీ కూర్చోబెట్టి మేపడం! నేను చెబుతున్నాను- నువ్వువెళ్ళి ఆబండీ గుర్రాలూ అమ్మేసెయ్" అన్నది;

దత్తుగారు సంతుష్టుడై వెళ్ళిపోయాడు. ఆరోజున సాయంకాలం ఆవిడ భర్తతో "వృధాగా బండివుంచి ఇంతమందిని పోషించడం దేనికి? ఎంత ఖర్చవుతోందో మీ కేమయినా తెలుస్తోందా?" అన్నది.

రావుసాహెబుగారు గ్రహించాడు. "ఏం చెయ్యమంటావ్ చెప్పు?" అని అడిగాడు.

"మీరేమీ చెయ్యనక్కర్లేదు. బండిని అమ్మమని నేను మాధవునితో చెప్పాను."

"పొరపాటుచేశావు '

గృహిణి ఉత్తేజితురాలై "అది తెలుసు నాకు. ముప్పై ఫైఅయిదేళ్ళనుంచీ నే నేమేమి చేస్తున్నానో అవన్నీ పొరపాట్లే. మీరుచేస్తున్న వన్నీ మాత్రం సరిఅయిన పనులు. కాకపోతే ఇవాళ మీస్థితి ఇలా ఎందుకుంటుంది? లోకంలో అందరూ మిమ్మల్ని మోసగిస్తున్నా ఇంకా కళ్ళుతెరిచి చూడటంలేదు" అన్నది.

ఇది ఇహ దాంపత్యకలహంగా పరిణమిస్తుందని రావు సాహెబుగారు శంకించారు. బండి అమ్మకుండా ఉంచటానికి శెక్రటరీతో ఏయే యుక్తులు చెప్పాడో అవన్నీ ఆవిడముందర చెప్పినా పనికిరావని గ్రహించాడు. కాస్సేపు ఆలోచించి చిరునవ్వునవ్వుతూ "అయితే భేషైన పని చేశావు. లక్ష్మిని అమ్మమనిచెప్పి మంచిపనే చేశావు!" అన్నాడు.

గృహిణిముఖం నల్లబడిపోయింది. "అయ్యో! అదేమిటి ఆ విలక్షణపుమాటలు? లక్ష్మిని అమ్మమని ఎవరు చెప్పారు!" అన్నది.

ఈ ఔషధం పనిచేసిందని ఆయన గ్రహించాడు. మనస్సులో నవ్వుకుని "ఈ బండి - గుర్రాలే నాకు లక్ష్మి, తెలుసా? అవి కొన్నప్పటినుంచే వ్యాపారం కలిసిరావటం ప్రారంభమైంది. ఈ యిల్లూవాకిలీ, ఈ ఆస్తిపాస్తులూ అన్నీ ఆ గుర్రాలను కొన్నప్పటినుంచీ కలిసివచ్చినవే. అమ్మదలచుకుంటే అమ్ము, నాకేం అభ్యంతరం లేదు"అన్నాడు.

భర్తమాట ఇంకా పూర్తికాకముందే "అమ్మో! అలాగా! ఈసంగతులన్నీ నాకేంతెలుసు? మాధవుడు అనవసరంగా బోలెడంత ఖర్చుఅని చెప్పాడుకనుక కాని— మీరు వెళ్ళి ఒకసారి మాధవుణ్ని నన్ను కలుసుకోమని చెప్పండి" అన్నది.

విపన్నభావం వ్యక్తమవుతున్న గృహిణిముఖంకేసి రావుసాహెబు ఎంతో కుతూహలంగా చూడసాగాడు. ఆయన అక్కడినుంచి కదలకపోవటంచూసి. మళ్ళీ "వెళ్ళండీ, కొంచెం చప్పున వెళ్ళండి. మాధవుని నాదగ్గిరకు పంపండి. ఈలోపుగానే అమ్మివేశాడేమో అసలు" అని బతిమాలుతుంది.

రావుసాహెబు ఉదాసీనునిలాగా "అమ్మివేస్తే ఇంక చేసేదిమాత్రం ఏముంది? నువ్వుచెప్పాక—"

గృహిణి మరింత బతిమాలుతూ "నేను అమ్మమని చెప్పాను. తెలియక పొరపాటే చేశాను మీరు మగవాళ్ళు ఆ పొరపాటును చక్కదిద్దలేరూ? నాకు వందమాటలు అక్కరలేదు. మీరు చప్పున వెళ్ళిరండి. మాధవుడు రానిదే నేను ప్రశాంతంగా జపంచేసుకుంటూ కూర్చోలేను" అన్నది.

ఈ అపూర్వమైన ఉపాయంతో గృహిణి మనస్సు మార్చి శెక్రిటరీని పరాజితుణ్ణి చేసినందుకు తాను సంతోషించుకున్నాడు. ఇలా బండీ, బండివాళ్ళూ, కోచ్ మానూ దత్తుసాహెబుగారి శనిదృష్టినుంచి తప్పించుకున్నారు.



నదికి అటువైపున మడుపులో చేపలు పడుతున్నాయి అని ఎవరో పొద్దున్నేవచ్చి చెప్పిపోయారు వలవేసి ఎత్తితేచాలు

అన్నీ చేపలేట! ఈమాట విన్నప్పటినుంచీ భిల్లుక్‌కి ఎంతో ఆదుర్దాగా వుంది. అతడు అందుకు కావలసిన సరంజామా అంతా సిద్ధపరచడంలో మునిగివున్నాడు. నిరంజన్ కొత్తగాలం తయారుచేస్తున్నాడు. సరీగ్గా ఇలాంటిసమయంలో నిరంజన్ ప్రక్కన నుంచుని అతడు చేస్తున్న పని అంతా శ్రద్ధగాచూస్తున్న గొల్లవాళ్ళ కుర్రాడు "అమ్మగారొస్తున్నారు, అమ్మగారొస్తున్నారు" అని చప్పట్లుకొడుతూ అరవటం మొదలెట్టాడు. నిరంజన్ తలయెత్తి చూశాడు. ఒక యువతి తన యింటివైపే వస్తున్నది. ఆమె రావుసాహెబుగారి కూతురు లలిత అయి వుంటుందని నిరంజన్ ఊహించాడు. అతడు ఆ గాలం ప్రక్కన పెట్టి కంగారుగా లేచి నుంచున్నాడు. లలిత దగ్గిరకువచ్చి, ఇతడు కొత్తగావచ్చిన వ్యక్తి అని ఊహించుకుంది. కొంచెం వెనకాముందాడుతూ "చేపలు పట్టటానికి వెడుతున్నారా?" అని అడిగింది.

"చిత్తం" అన్నాడు నిరంజనుడు.

ఆ తర్వాత ఇంక ఒక్కమాట మాట్లాడటమయినా అనవసరమేఅని తెలుసుకుని ఆమె అతి సహజధోరణిలో 'పెద్ద చేప ఒకటి పట్టుకురావాలి' అని అంటూనే దేవిడీకేసి ముందుకు నడిచింది.

వెళ్ళిపోతున్న ఆమె నుద్దేశించి "ప్రయత్నిస్తాను" అని నిరంజనుడు మళ్లీ తనపని చూసుకోటం మొదలెట్టాడు.

దారిలో నడుస్తూ నిరంజనుడు భిల్లుక్‌తో 'ఇవాళ ఒక చేప కావాలి ఏమయినాసరే భిల్లుక్‌దా!' అన్నాడు.

"ఎందుకు భాయిజీ"

"మీ అమ్మగారు ఓ పెద్ద చేప కావాలంటున్నారు"

"ఊఁ, గొప్పవాళ్ళకు చేపలకుదిగులేముంది? అమ్మాయి గారు వచ్చిందని తెలిస్తే ప్రొద్దుకూకకమునుపే కుర్రాళ్ళంతా ఎన్నో బహుమతులతో వచ్చి చేరుతారు. ఎన్నిసామానులు వస్తాయి—చేపలు, బాదంపప్పు, కిస్‌మిస్, పూలదండలూ! నీవు పట్టుకొచ్చే చేపకోసం అమ్మాయిగారు చూస్తూ కూచుంటుందా!"

ప్రత్యక్షంగా చూస్తూఉన్న ఈ భిల్లుక్ చెప్పినమాటలు వస్తుతః యదార్థాలే. ఈ ఎటర్నీ మహాశయుని కూతుర్ని సరి క్రొత్త బారిష్టరుగారు ఎంతగానో కాంక్షిస్తున్నాడు. శనివారం నాడు లలిత తండ్రిగారి పల్లీభవనానికి వచ్చిందంటే, పొద్దు క్రుంకకమునుపే కోర్టుపని పూర్తిచేసుకుని క్రొత్తబారిష్టుగారు ప్రేమోపాసకుడై ఏదో ఒకబహుమతి చేతపుచ్చుకుని తన ఆరాధ్యదైవంఇంటికి వచ్చి హాజరవుతాడు. ఆనాడురాత్రి గానాబజానా- బిలియర్డ్సుతో గడిపి ఆదివారమంతా పిట్టల్ని కొట్టడంతోనో చేపల్నిపట్టడంతోనో గడిపి ఆ సాయంత్రానికి మళ్లీ పట్నం చేరుకుంటూఉంటాడు. ఈ ఆదివారం పల్లెస్త్రీలకు శిక్షాదినం అన్నమాట. రోజల్లా వాళ్లు ఇంట్లోంచి బైటికి రావటానికి వీలుండదు. సూర్యోదయం కాకమునుపే వాళ్ళు చెరువుకువచ్చి స్నానం వగైరా పూర్తిచేసుకు పోవాలి. ఏంచేతంటే కొంచెం పొద్దెక్కిందంటే రావుసాహెబుగారి అతిథుల జలక్రీడలు ప్రారంభమవుతాయి. తర్వాత మధ్యాహ్నమంతా ఇహ తుపాకీ చప్పుళ్ళతో ప్రతిధ్వనిస్తూఉంటుంది. ఆ ధ్వనులతోపాటు ప్రియబంధువుల కోల్పోయే పక్షుల ఆర్తనాదాలకు

అంతు ఉండదు. నిరీహామ్ములైన పక్షుల ఆర్తనాదాలు ఈ నాగరిక స్త్రీలను అన్నిటికన్నా ఎక్కువ కోపాన్ని కలిగిస్తూ వుంటాయి.

పొద్దు క్రుంకబోతోంది. అయినా అవసరమైన చేప దొరకనేలేదు. భిల్లుక్ ఇంక ఉండపట్టలేక 'ఇంక లేచి వెళదాం భాయీజీ' అన్నాడు.

నిరంజన్ గాలంమీదనుంచి దృష్టి మరల్చకుండానే 'ఏం భిల్లుక్ దా?' అని అడిగాడు.

'చీకటి పడుతోంది. ఇంక కూర్చుంటే ఏం లాభం?'

"ఇంకాస్సేపు కూర్చో. సాయంకాలమప్పుడే చేపలు వచ్చిపడేది. తెలుసుగా!' ఇలా అంటూండగానే నిరంజనుడి గాలం కదలటం మొదలెట్టింది. దానిప్రక్కనే రోహితమత్స్యం యొక్క పైకియెత్తిన ఎర్రనితోక కన్పించింది. భిల్లుక్ ఊపిరి బిగబట్టి,అణుచుకున్న గొంతుకతో "ఊఁ,రోహితం!" అన్నాడు.

ఆ అభేది వస్తున్నట్లు గాలంచివర ఎర మునిగింది. నిరంజనుడు గాలాన్ని మెల్లిగా కదిలిస్తూ పైకి ఎత్తుతున్నాడు. గాలందారం బిగువుగా క్రిందకు లాగుతోంది.

'ఇంక విడిచిపెట్టకు భాయిజీ. నదిమధ్యలోకి ప్రవాహం వైపుకు పోయిందా అంటే ఇంక మనం లాగలేము' అని అరిచాడు భిల్లుక్.

నిరంజనుడు మాట్లాడకుండా దాన్ని పైకిలాగాడు. కాస్సేపు వృథాగా పోరాడి, చివరికి రోహితం పట్టుపడింది. నిరంజనుడు హుషారుగా "చూశావా భిల్లుక్ బా!" అన్నాడు సగర్వంగా.

భిల్లుక్ నిరంజనుని వీపుమీద చరిచి "నువ్వు ఉస్తాదువు భాయీజీ! నీలాంటివాళ్ళు ఇంకా ఇద్దరున్నారంటే నదిలో చేపలన్నీ మూడురోజుల్లో పట్టేయగలం' అన్నాడు.

పడమరవైపున చాలా సేపటినుంచీ మబ్బుగావుంది. నిరంజనుడు గాలంతీసుకుని లేవగానే ముందు గాలిదుమారం వచ్చి; తర్వాత వాన ప్రారంభమయింది. నిరంజనుడికి దిక్కుతోచక 'ఇప్పుడేమిటీ వుపాయం భిల్లుక్ దా!' అని అడిగాడు.

భిల్లుక్ ఏమీ ఆలోచించకుండా నే'పల్లెకారి చంద్రాయ్ యింటికి పోదాం, ఇక్కడే దగ్గర్లోనేవుంది' అంటూ వెదురు పొదలలోంచి కన్పిస్తున్న అతడిఇల్లు— వ్రేలితో అదిగో అని చూపించి ఒకచేత్తో ఆగాలాలూ అవీ-రెండోచేత్తో ఆ చేపనూ పట్టుకుని బయలుదేరాడు.

నిరంజనుని వెంటపెట్టుకుని చంద్రనాథుని యింటి మెల్లాలోకి వచ్చి, భిల్లుక్ బిగ్గరగా "ఓయ్ చందర్ దా! వసారాలో కాస్త గోనె సంచి తెచ్చివేద్దూ! పాడు వానలో తడిసిపోయాం" అని కేకేశాడు.

భిల్లుక్ గొంతు విని యింట్లోనుంచి ఒక వృద్ధుడు బైటికి వచ్చి అతణ్ణిచూసి "ఇదేమిటి! ఈ వానలో!" అన్నాడు. "ముందు కాస్త కూచోనియ్యవోయ్!"అంటూ అతడి ఆహ్వానం కోసంచూడకుండానే నిరంజనుణ్ని చెయ్యిపట్టుకుని వసారాలోకి తీసుకువెళ్ళాడు. భిల్లుక్ వెంటఉన్న యువకుని చూసి, చంద్రనాథ్ వంటయింట్లో వంటచేస్తున్న కూతుర్ని పిలిచి "మణీ! వసారాలో కాస్త ఆ తాటాకుచాప తెచ్చివేసివెళ్ళు.

కాసిని కుపంట్లో బొగ్గులుకూడా తీసుకురా చలి కాసుకోటా నికి", అన్నాడు.

చంద్రనాథుని పిలుపుకి ఒకచేత్తో చాపచుట్టుకుని నెత్తినెట్టుకుని రెండోచేత్తో నిప్పులున్న ఇనుపచట్రం పుచ్చుకుని వచ్చినవ్యక్తి రాతివిగ్రహంలాఉంది. యౌవనం ఆమెశరీరంలో పిక్కటిల్లుతోంది. పొడుగాటి జుట్టును చుట్టలా చుట్టుకున్నా - అందులోంచి కొన్ని వెంట్రుకలు అటూయిటూ జారి ఆమెచెక్కిళ్ళమీద పడుతున్నాయి. పసుపుపచ్చచీర పమిట చేతిక్రిందనుంచిలాగి మరోపార వక్షస్థలంమీద కప్పుకుంది కాని దానివల్ల ఆమెలోని పరిపుష్ట యౌవనం మరింత ప్రస్ఫుటంగా కనిపిస్తోంది. ఒంటిమీద నగలేమీ లేవు. నిరాభరణసుందరి. రాయిమణి ఆ చాప వసారాలోవేసి, తండ్రి హుక్కాగొట్టంలో పొగాకువేసి తెచ్చియిచ్చి కొత్తవాడైన నిరంజనుడికేసి ఒక ఓరచూపుచూసి, మళ్ళీ వంటయింట్లోకి వెళ్ళిపోయింది.

చంద్రనాథ్ ఆ హుక్కాలో నిప్పువేసిఊది నిరంజనుడికి అందిచ్చాడు. "నువ్వుతాగు- నాకు పొగతాగటం అలవాటు లేదు" అన్నాడు నిరంజనుడు.

చంద్రనాథుడు ఒకగుక్క పీల్చి ముక్కులోంచి పొగ వదలుతూ "ఊఁ, తర్వాత ఏమిటి ఇంక విశేషాలు భిల్లుక్? ఈ వానలో ఎలావచ్చారు?" అని అడిగాడు.

భిల్లుక్ తను చేపలవేట వృత్తాంతం సవిస్తరంగాచెప్పి, చివరకు "మా భాయిజీ చదువు సంధ్యల్లో ఎంతగట్టివాడో

చేపల్ని పట్టటంలో కూడా అంత ఘటికుడు. నువ్వు వలవేసే రోజున వచ్చిచెప్పు, ఆరోజున చూద్దువుగాని" అన్నాడు.

చంద్రనాథ్ దీర్ఘంగా నిట్టూర్చి "వలవెయ్యటం మానేశాను భిల్లుక్! ఏదో దేముడిదయవల్ల ఎప్పుడైనా కాసినిచేపలు దొరికితే వాటినే అమ్ముకుని కాలక్షేపంచేస్తున్నాం. అవిఅయినా పిల్లది ఉన్నది కనుక దొరుకుతున్నాయి. నాకు యిదివరకున్న చూపుబలం లేదు ఇప్పుడు" అన్నాడు.

ఆ అమ్మాయిమాట రాగానే 'ఆమె నీ కూతురా చంద్రినాథ్?" అని అడిగాడు నిరంజనుడు.

"అవును బాబూ! ఈ చంద్రినాథ్‌కు ఒకప్పుడు అందరూ ఉన్నారు - కాని యిప్పుడున్నది అదొక్కతే." అంటూ అతడు మెల్లగా తన కొడుకులు చేతికి ఎదిగివచ్చిన వాళ్లు ముగ్గురూ చనిపోయినగాథ చెప్పాడు. ఆ గాథ విని నిరంజనుడు జాలిపడి, ఆ ప్రసంగం మార్చాలనే ఉద్దేశంతో "మీ అమ్మాయికి చదువు చెప్పించలేదా?" అని అడిగాడు.

బీదవాళ్ల కూతుళ్లకి చదువేమిటి బాబూ! అయినా జమీందారుగారు పెట్టించిన బళ్లోకి పంపించాను చిన్నప్పుడు. కాస్త కలిగిన యింట్లోనే ఇచ్చిచేశాను. కాని దాని అదృష్టం మంచిదికాలేదు. ఏడో యేట పెళ్లిచేశాను. ఎనిమిదో యేడు యింకా పెళ్లికమునుపే నొసటి కుంకుమ చెరిపేసుకుని ఇంటికి వచ్చింది. అంతా రాత బాబూ!" అంటూ ఆ వృద్ధుడు నొసటి మీద కొట్టుకున్నాడు. చంద్రనాథుడి జీవితమంతా విషాదమయమే. అతడు తన జీవితంలోని ఏ విషయం చెప్పటం

మొదలెట్టినా ముందు దుఃఖవిషయమే వస్తుంది. నిరంజనుడు అది అంతా గ్రహించాడు. అడిగితే కేవలం దుఃఖ గాథ వినాల్సివస్తుందనుకుని అతడు ఇంక ఏ సంగతీ అడుగలేదు.

వాన కాస్త తగ్గింది. మేఘాలమధ్య అక్కడక్కడ కొద్దిగా నక్షత్రాలుకూడా కన్పిస్తున్నాయి. నిరంజనుడు లేచి "ఇంక వెళ్ళివస్తాం చంద్రనాథ్! ఇటువైపు వచ్చినప్పుడు మళ్ళీ కన్పిస్తానులే" అన్నాడు.

చంద్రనాథ్ కూడా లేచినిలబడి, "మణీ! ఆదీపంకొంచెం ఇటుతీసుకురా అమ్మా! ఆ జామచెట్టు దాటేంతవరకూ కాస్త దీపంచూపించి బాబుగారిని పంపిరా!" అన్నాడు కూతురితో.

నిరంజనుడు అప్పటికే మెల్లాదాటి ఈతలికి వచ్చాడు. రాయిమణి దీపం తీసుకుని రాగానే "నువ్వు రావాల్సినంత అవసరంలేదు. దారికన్పిస్తూనేఉంది. ఇద్దరున్నాం, భయమేమీ లేదు." అని భిల్లుక్‌తో బయలుదేరాడతడు. ఆ జామచెట్టుదగ్గరకు సరీగ్గా ఆ యిల్లెంతదూరంవుందో చూద్దామని నిరంజనుడు అక్కడకువచ్చి వెనక్కి తిరిగిచూచాడు దీపం చేత్తోపట్టుకుని రాయిమణి యింకా అక్కడే నిలబడిఉండడం అతడికంట పడింది.

౪

మర్నాడు లలిత జన్మదినోత్సవం. కాని సాయంత్రం అయేసరికే అతిథులు రావటం మొదలెట్టారు. డ్రాయింగ్ రూంలో ఒక చిన్నసభ జరుగుతోంది. అక్కడ లలిత అతిథులకు టెన్నిసన్ కావ్యం చదివి వినిపిస్తోంది. లలితకు ఎదురుగా అర్థనిమీలితనేత్రుడై మిస్టర్ దత్తు కూర్చుని ఉన్నాడు. అతడి చుట్టూ అతిథులు కూర్చున్నారు. ఆ సభలో రావుసాహెబ్ గారూ, ఆయన గృహిణీమాత్రం లేరు. ఆయన ఏదో పనిమీద బైటికి వెళ్ళాడు. గృహిణికి ఇంగ్లీషు రాదు. అదీగాక అపరిచితులఎదుటికివచ్చి కూర్చునే అలవాటు ఆమెకు మొదటి నుంచీ లేదు. అంచేత ఆమె మర్నాడు భోజనాలకు చేయవలసిన ఏర్పాట్లలో లోపల యింట్లోనే ఉండిపోయింది.

హతభాగినిఅయిన డోరాదుఃఖగాథ వింటూ దత్తు జేబురుమాలతో కళ్ళనీళ్ళు ఒత్తుకుంటున్నాడు. అతిథులు కూడా ఆ దుఃఖగాథకు ఒకరితర్వాత ఒకరు సానుభూతి సూచక పదాలను ఉచ్ఛరిస్తున్నారు. సరిగ్గా ఈస్థితిలో అతిథులంతా కరుణరసంతోపాటు హాస్యరసంలో మునిగి తేలవలసిన సంఘటన ఒకటి జరిగింది భిల్లుక్‌ను వెంటబెట్టుకుని, ఆ రోహిత మత్స్యంపుచ్ఛం పట్టుకొని, కొంచెం బురదకొట్టుకునిఉన్న శరీరంతో నిరంజనుడు డ్రాయింగ్‌రూంలోకి వచ్చి లలితను ఉద్దేశించి "చూడండి, చేపను పట్టుకొచ్చాను—సరిగ్గా సాయంకాలానికి—" అన్నాడు.

నిరంజనుడిమాట పూర్తికాకముందే దత్తుగారు అతి కఠినంగా "బైటికి తీసుకుపో. ఇక్కడ ఇంతమంది ఎదుట—"

నిరంజనుడు తెల్లపోయాడు. అతిధు లందరిఎదుటికీ ఆ చేపను తెచ్చి చూపించాలని అతడి ఉద్దేశంకాదు. లలిత కోరిన వస్తువు తీసుకొనివచ్చి ఆమెకు చూపి ఆమెను సంతోష పెట్టాలని—ఇదీ అతడి ఉద్దేశం. కానీ దత్ గారిమాటలతో అతడి ఉత్సాహంఅంతా పూర్తిగా భస్మమైపోయింది. అతడు ఒక్క నిమిషం లలితముఖంకేసి చూశాడు. కాని అప్పుడామె ఏమీ మాట్లాడకపోయేసరికి, ఇంక అక్కడ ఆగకుండా నిరంజనుడు ఆ గదిలోంచి బైటికి వచ్చేశాడు. లలిత ఒకసారి ఆ మత్స్యంకేసి చూసి, గుమ్మందగ్గర నిలబడిఉన్న భిల్లుక్‌తో "దాన్ని ఇంట్లో యిచ్చిరా భిల్లుక్!" అన్నది. ఆ ఒక్కమాటా చెప్పి ఆమె మళ్ళీ శ్రద్ధగా కావ్యపఠనం ప్రారంభించింది.

ఆచేపనుచూసి ఆమె సంతోషించింది ఉత్సాహంతో ఏదో అందామని మాట నాలికచివరవరకూ వచ్చిం దామెకు. కాని 'డోరా' దుఃఖగాథ చదువుతూ, ఇలాంటి సామాన్య విషయాన్ని గురించి మాట్లాడితే అతిధులముందు తన కవితాదృష్టికి లోపం వస్తుందనే భయంతో ఆమె చేపను చూసినా నిమీలిత నేత్రియై మెదలకుండాఊరుకుంది. దత్తుగారు నిరంజనుడితోకటువుగా మాట్లాడినప్పటికీ ఆమె ఏమీమాట్లాడకుండాఊరుకుంది.

నిరంజనుడు కాళ్లూ చేతులూ కడుక్కుని సాంధ్యాహ్నికం ముగించుకుని తన గదివసారాలో చాపవేసుకుని పుస్తకం తెరచికూర్చోగానే భిల్లుక్ వచ్చి "ఏం భాయిజీ, చూశావా?" అన్నాడు.

"చూశాను భిల్లుక్! గొప్పవాళ్ళధోరణి అంతా ఇంతే. నేను చాలామందిని చూశాను. పోనిద్దూ, ఆ విషయాన్నే పట్టుకు రాపాడినందువల్ల ప్రయోజనం ఏమీలేదు. రేపు పార్టీ ఉంది. నేను పూలు సప్లయిచేయాలి. నువ్వు కాస్త పెందరాళే లేచివెళ్లి రెండు మూడు పూలతోటలు చూసిరా. కేవలం ఉద్యానవనంలోని పూలతో పనిగడవదు"

సాయంత్రం జరిగిన సంఘటనను నిరంజనుడు ఎంత తేలికగా త్రోసిపారవేశాడో, భిల్లుక్ అలా త్రోసిపారెయ్యలేకపోయాడు. లలితఉదాసీనత భిల్లుక్‌ని విచలితుణ్ణిచెయ్యలేదు కాని, మిస్టర్ దత్తుమాటల్ని మాత్రం అతడు మరిచిపోలేకపోయాడు. "నువ్వు అనవలసిన నాలుగు మాటలూ ఆయన ముఖాన్నే అనేస్తావని అనుకున్నా కాని నువ్వు మెదలకుండా ఊరుకుని వచ్చేశావ్" అన్నాడు భిల్లుక్.

"ఏం చెయ్యమంటావ్ చెప్పు భిల్లుక్! అంతమంది యెదుట ఏమంటాను? అదీగాక అలా తొందరపడి ఏదో చెయ్యటం మూలానే రెండుసార్లు నౌకరీ పోగొట్టుకున్నాను నేను. ఎంత ఇది అయినా కానీ ఈసారి అన్నిటికీ సహించాలని నిశ్చయించుకున్నాను. ఎవరేమన్నా సరే, జవాబు చెప్పదలుచుకోలేదు."

భిల్లుక్ ఉత్తేజితుడై "నౌకరీకోసం భయపడటమా? ఛా! నీకు నౌకరీ భయమేమిటి భాయిజీ?" అన్నాడు.

నిరంజన్ చిరునవ్వు నవ్వి, భిల్లుక్ చెయ్యి పట్టుకుని "కోపం తెచ్చుకోకు భిల్లుక్‌దా! నీ భాయిజీకూడా నౌకరీకి భయపడాల్సిందే! అతన్ని లోకం నీ దృష్టిలో చూడదు. నీ

భాయిజీ ఎంతవరకు శరిఖించగలడో లోకం పరీక్షించి చూసి,ఆ దామాషాని తిండిపెడతుంది'' అన్నాడు.

భిల్లుక్ నిరంజనుడి చివరి మాటలు సరిగ్గా అర్థంచేసుకో లేదు. అయినా "తిండి విషయమై ఏమీ దిగులు పెట్టుకోవద్దు భాయిజీ! ఎవరూ తిండి పెట్టకపోయినా భిల్లుక్ తన శరీరాన్ని వంచి పనిచేసిఅయినా నీకు తిండిపెట్టగలడన్న సంగతి తెలుసుకో నువ్వు. పక్కైడు మెతుకులు పెడుతున్నారుకదా అని లోకులు నిన్ను అవమానం చేస్తారా?" అన్నాడు.

"నువ్వు వృథాగా కోపం తెచ్చుకుంటున్నావు భిల్లుక్‌దా! నువ్వు ఎవరి సంగతి చెబుతున్నావో అతడు ఎవరి నౌకరో నేనూ వారి నౌకర్నే. తేడా అల్లా జీతం దగ్గరే. ఆయన నన్ను అవమానంచేస్తే నేనూ ఆయన్ని అవమానం చెయ్యగలను కాని దానివల్ల అవమానానికి ప్రతీకారంకాదు జరిగేది! వృథా కావేషాలు పెరుగుతాయి. కేవలం నౌకరీ పోతుందనే భయంతో జవాబు చెప్పకపోలేదు. నౌకరీ పోతుందనే భయమున్నా, ఎవరికోసమో కళ్ళు మూసుకుని అవమానంసహించాల్సినంత భయపడేవాణ్ణికాను" అన్నాడు.

ఈసారి భిల్లుక్‌కు తృప్తికలిగింది. "నా కా సంగతి తెలుసు భాయిజీ నువ్వు అవమానాన్ని సహించేవాడివి కావని నేను చాలారోజుల్కితమే తెలుసుకున్నాను. అయినా నీది కొంచెం మెతక స్వభావం" అన్నాడు.

నిరంజనుడు మనస్సులో నవ్వుకుని "కొంచెంకాదు-బాగాను!" అని అనుకుని; భిల్లుక్‌తో 'నువ్వు వెళ్ళు భిల్లుక్‌దా! వాళ కొంచెంవిశ్రాంతితీసుకో. రేపుచాలాపనిఉంది'అన్నాడు.

భిల్లుక్ వెళ్ళిపోయాక నిరంజనుడు దత్ గారు అన్న మాటల్ని మరోసారి ఆలోచించుకుని చూసుకున్నాడు ఆయన గారి ప్రవర్తన పూర్తిగా అగౌరవకరంగా ఉన్నదనటంలో సందేహంలేదు. కాని అంతమంది అపరిచితులూ — ఆడవాళ్ళూ ఉన్నచోట — అందరియెదుటా దత్తుగారిని నాలుగుమాటలూ ఝాడించినట్లయితే దానివల్ల రావుసాహెబ్ గారి గృహమర్యాదకు భంగం కలిగేది! నిరంజనుడు ఎన్నోవిధాల ఆలోచించి చివరకు "జవాబుచెప్పలేకపోవటమే మంచిపని చేశాను" అని అనుకున్నాడు అస్ఫుటంగా. ఈ సిద్ధాంతానికి రావటం మూలంగా అతడి మనస్సులోని గ్లాని యావత్తూ తుడిచేసినట్లు పోయింది. తర్వాత ఇహ మనస్సును 'ట్రాయ్‌పతనకథ' మీదనుంచి మరల్చుకోలేకపోయాడు.



మర్నాడు పొద్దున్నుంచీ నిరంజనుడికి కింత తీరుబడే కాలేదు. తెల్లవారీ తెల్లవారకముందే పూలకోసమై తాఖీదు వచ్చింది. అంతకుముందే కలకత్తానుంచి సితార్‌విద్వాంసుడు సపరివారంగావచ్చి దిగాడు వాళ్ళకు ఏర్పాట్లన్నీ చేయవలసిన బాధ్యత నిరంజనుడిమీద పడింది. అతడు తనపుస్తకాలూ పక్కచుట్టా ఒకమూలసర్ది తన ఆ కాస్తగదిలోనే వాళ్ళకు చాపలువేశాడు. పొద్దెక్కినకొద్దీ లలిత స్నేహితులైన టెన్నిస్ ప్లేయర్స్ రావటం మొదలెట్టారు సితార్ విద్వాంసు డిప్పుడు తన సితార్‌ను సాధనచేసుకోవటం మొదలెట్టాడు. అది ప్రారంభంకాగానే నిరంజనుడి గదిలోకి శ్రోతలు రావటం మొదలెట్టారు. అప్పుడిహ నిరంజనుడు తనగది వదలి పోయి

భిల్లుక్ గదిలో కూర్చున్నాడు. భిల్లుక్ నిరంజనుడు రావటం చూసి కపటనిద్ర అభినయించాడు. ఎందుచేతంటే అంతక్రితమే అతడు మాధూతో కలిసి ఒకముంత తాటికల్లు సేవించాడు. అప్పటికింకా అతడినోరు ఆ కల్లువాసన కొడుతూనేఉంది. మాట్లాడితే తాను తాగినసంగతి ఎక్కడ బైటపడి పట్టుపడ తానో అన్నభయంతో నిరంజనుడి పిలుపు వినిపించినా జవాబివ్వలేదు. నిరంజనుడు భిల్లుక్‌ను వీపుమీద చరిచి "ఏమిటి భిల్లుక్‌దా! అవతల అంతపని పెట్టుకుని నిద్రపోతున్నావా నువ్వు?" అన్నాడు.

భిల్లుక్ కళ్ళు తెరవకుండానే ముఖం కొంచెం పక్కకు తిప్పుకుని "ఉస్, అబ్బ! తలపోటు,పగిలిపోతోంది భాయిజీ?" అన్నాడు.

భిల్లుక్ అంత జాగ్రత్తా వ్యర్థమయింది; తలమీదచెయ్యి పెట్టి పోటు ఎక్కడో తెలుసుకుందామని ప్రయత్నిస్తుంటే అసలుసంగతి కాస్తా పట్టేశాడు నిరంజనుడు. "నువ్వు మళ్ళీ కల్లుతాగావా భిల్లుక్‌దా?" అని అడిగాడు

భిల్లుక్ పట్టుపడి తెల్లపోయి లేచి కూర్చున్నాడు. తర్వాత కళ్ళు నలుముకుని "కొద్దిగా తాగాను భాయిజీ. ఏం చెయ్యను, మాధూ విడిచిపెట్టాడు కాదు – 'అమ్మాయిగారి పుట్టినరోజు! కాస్త తాగు' అన్నాడు. దానివల్ల మత్తెక్కదు భాయీజీ" అన్నాడు.

తన తప్పును మాధూ మీదికి తొయ్యాలని ప్రయత్నించడం చూసి, నిరంజనుడు నవ్వుకుని, "ఇంకెప్పుడూ తాగకు భిల్లుక్‌దా!" అని అన్నాడు ముక్తసరిగా.

భిల్లుక్ కొంచెం తేరుకుని, ఉత్సాహంతో 'ఇంకా మళ్ళీనా? ఇంక కల్లూలేదు, ఏం లేదు ఒళ్ళూ గుండం, ఇల్లూ గుండం. చూడరామూ, జగ్‌రూప్ తండ్రి సంపాదించిపెట్టిన డబ్బంతా రెండు నెలల తాగుడుతో ఖర్చు పెట్టేశాడు. కల్లు తాగటమా యింక! అరే తోబా, తోబా!' అన్నాడు.

మంచి నిషాలో ఉన్న భిల్లుక్‌నోటినుండి తాగుడు వ్యతిరేకంగా వచ్చిన ఉపన్యాసం విని నిరంజనుడు బిగ్గరగా నవ్వాడు. తర్వాత "ఆగు భిల్లుక్‌దా, ఆగు. ఇంక వద్దు. నే నొకసారి పోయి చూసివస్తాలే. నువ్వు కాసేపు పడుకో. ఒళ్ళు కాస్త తేలిక చేసుకో. రేవు మళ్ళీ చేపలుపట్టటానికి పోవాలి' అన్నాడు.

నిరంజనుడు తోటలోకివచ్చి చూశాడు. ఉత్సవం యథాప్రకారంగా ప్రారంభమయింది పూలతో అలంకరించబడిన ప్రాకారంగా లలితను మధ్యకూర్చోబెట్టి, చుట్టూ రౌండ్ టేబిల్ మీద ఆమె స్నేహితురాండ్రు కూర్చున్నారు. ఆ వనశాల అక్కడక్కడ విడివిడిగా ఉన్న కుర్చీలలో రావుసాహెబ్ గారిచే ఆహ్వానింపబడి వచ్చినవారు కూర్చున్నారు. లలిత కూర్చున్న కుర్చీకి ఎదురుగా కొంచెందూరంగా నిలబడి దత్తుగారు తాను యింగ్లీషులో వ్రాసిన అభినందనపత్రం చదువుతున్నాడు. అతడు మధ్య మధ్య శ్రోతల కరతాళధ్వనుల మూలంగా కొంచెం సేపు ఆగి, మళ్లీ మరుక్షణంలోనే మరింత ఉత్సాహంతో చదవటం మొదలెట్టాడు. ఆ వ్యవహారమంతా నిరంజనుడికి క్రూరతనం వ్యవహారంగా తోచసాగింది. అతడు వెళ్లిపోదామని ప్రయత్నిస్తున్నాడు. ఇంతలో అతిథుల హర్షధ్వానులతో ఉలిక్కి

పడి వెనక్కి తిరిగిచూశాడు. లలిత లేచినుంచునిఉంది. కుతూహలంతో నిరంజనుడు దగ్గిరకువచ్చాడు. లలిత ఆ అభినందన పత్రానికి సమాధానం చెప్పబోతున్నది. మొదట్లో క్షీణస్వరంతో ప్రారంభించి, క్రమశః కంఠస్వరాన్ని సవరించుకుని, లలితమైనభాషలో వచ్చిన అతిథులకు అభివందనాలుచెప్పి అభినందన పత్రం సమర్పించిన దత్తుగారికీ, తన శ్రేయోభిలాషులకూ అందరికీ కృతజ్ఞత తెలిపింది చమత్కారమైన ఆమె సౌందర్యమూ, అపూర్వమైన ఆమె పుష్పాలంకరణ, అతి కోమలమైన ఆ కంఠస్వరమూ అన్నీకలిసి ఒక విచిత్రమైన మోహజాలాన్ని సృష్టించాయి దానివల్ల స్త్రీలవిషయంలో వస్తుతః ఉదాసీనుడైన నిరంజనుడుకూడా ఆమెనుచూచి ఒక్క క్షణం ముగ్ధుడుకాకుండా ఉండలేకపోయాడు.

౬

ఇంకా పొద్దువుంది. సాయంకాలం కాలేదు మేల్లాలో ఒక చింకిచాప పరచుకుని కూర్చుని రాజమణి దారాలు తెగినవల మరమ్మత్తు చేస్తోంది. వసారాలో చంద్రనాథుడు పడుకున్నాడు. మూడురోజులనుంచీ జ్వరం అతడికి ప్రొద్దున జ్వరం కొంచెం జారింది – మళ్ళీ మధ్యాహ్నం ఎక్కువగా వచ్చింది.

"లే మణీ! పెందరాళే రెండు మెతుకులు వండుకుని తిను" అన్నాడు చంద్రనాథుడు.

జారి నేలమీాదివరకూ పడినజుట్టును ముడేసుకుంటూ "ఇదిగో, లేస్తున్నా, ఇంకా కొంచెం మిగిలిపోయింది. ఈ కాస్తా పూర్తిచేసి—" అన్నది రాయమణి.

"అదిరేపు పూర్తి చెయ్యవచ్చులే అమ్మాయీ! ఇవాళకు ఇంక కట్టిపెట్టుదూ" అన్నాడు చంద్రనాథుడు.

"అయితే మరి రాత్రికి ఒగ్గేందుకు వల ఏదీ?"

"ఇవాళకు వద్దులేద్దూ, పోనీ"

"అదేమిటి నాన్నా! మరి రేపటికి డబ్బులు ఎలా?"

"డబ్బులెందుకే? బియ్యం ఉన్నాయిగా యింట్లో"

"నీకు పథ్యంపెట్టటానికి కావొద్దూ? అన్నీ తీసుకు రావాలి. అదీగాక వైద్యుడికి డబ్బు ఇవ్వాలేసింకా."

వదనుడు ఆఊరివైద్యుడు ఇంతవరకూ ఎక్కడో గురువు గారిదగ్గిర కాంపౌండరుగా ఉండేవాడు ఇప్పుడు స్వగ్రామానికి వచ్చి వైద్యంచెయ్యటం మొదలెట్టాడు బస్తీనుంచి క్వైనైన్ తీసుకువచ్చి, దానికి ఒక్కొక్కప్పుడు నల్లరంగో, ఎర్రరంగో తగిలించి 'బృహజ్జ్వరాంతకలోహం' 'జ్వరసింహ ఘటకవటి' అని ఇలా పెద్దపెద్ద పేర్లుపెట్టి అమ్ముతూఉంటాడు.

పథ్యానికి డబ్బుకావలసివస్తుందని విని చంద్రనాథుడు కోప్పడ్డాడు. పథ్యంఅంటే అతడికి మొదటినుంచీ కిట్టటంలేదు. "ఊc. పథ్యంట! పథ్యం! నాతలకాయ పథ్యం! ఇంతగంజిపోసి రెండు మెతుకులు పెట్టమని పొద్దునవంగా చెప్పా అదేంలేదు. సగ్గుబియ్యంజావ తెచ్చింది. ఇప్పుడుచూడు మజా- మళ్ళీ చలి వొణుకుతో వస్తోంది జ్వరం" అని చలివేస్తున్నట్లు వణుకుతూ "అన్నంతింటే ఇలా వచ్చేదేనా! ఆ రోజున బజారుకు వచ్చి

నప్పుడు పాదిరీ చెప్పలేదూ-లంఖణంచేస్తే మలేరియా జ్వరం మరింత ఎక్కువౌతుందనీ? ఇప్పటికయినా నేను బ్రతకాలను కుంటే రాత్రికైనా నూనెలో వేయించిన వేడివేడి ఊరమిరప కాయలు రెండు వేసి రెండుమెతుకులు పెట్టు. ఈ చలి తగ్గిపో తుంది" అన్నాడు.

రాయిమణి తండ్రిమాటలు విని మెల్లిగా నవ్వుకుంది. జవాబు చెప్పలేదు. జ్వరం వచ్చినప్పటినుంచీ అన్నంతింటానని చంద్రనాథుడు మహా పీడిస్తున్నాడు. రాయిమణి అన్నంపెట్ట లేదు. పసిపిల్లవాడు అర్ధంలేని మారాంచేస్తే తల్లి ఎలా ఉపే క్షించి ఊరుకుంటుందో, అన్నం తింటానని చంద్రనాథుడు చెప్పే విచిత్రమయిన యుక్తులనుకూడా రాయిమణి అలాగే ఉపేక్షిస్తూ వచ్చింది. రోగులకు శుశ్రూష ఎలా చెయ్యాలో ఆమెకు తెలుసు. ఆరోగ్యశాస్త్రానికి సంబంధించిన ఒకటిరెండు పుస్తకాలుకూడా చదివిందామె. జ్వరం ఉన్నప్పుడు రోగికి అన్నంపెట్టకూడదు అన్న ఆమె గట్టినమ్మకాన్ని మార్చటా నికి చంద్రనాథుడికి చక్కని హేతువేమీ కనిపించలేదు.

రాయిమణి మెదలకుండా ఊరుకోవటంచూసి, చంద్ర నాథుడు ఉత్తేజితుడై "పెట్టవా అన్నం? ముందు అన్నంతినక చస్తాను. తర్వాత చక్కగా వండి పిండాలు వేద్దువుగాని" అన్నాడు.

రాయిమణి కోపం తెచ్చుకుని "కొంచెం మాట్లాడకుండా ఊరుకోలేవూ? దారం గుచ్చాల్సిన బెజ్జం కాస్తా జారిపో యింది" అని గద్దించి మళ్లీ ఆ జారిపోయిన చోటే మరమ్మత్తు చెయ్యటం మొదలెట్టింది.

వల మరమ్మతుచెయ్యటం పూర్తిఅయ్యాక 'నాన్నా!' అని పిలిచింది రాయిమణి. చంద్రినాథుడికి నిద్రిపట్టింది. రాయిమణి మెల్లిగా అడుగులో అడుగు వేసుకుంటూ దగ్గిరకు వచ్చి ముఖంమీద ముసుగు తీసి చూసింది. చంద్రినాథుడు నిజంగానే నిద్రిపోతున్నాడు. అప్పు డిహ హుక్కాలో పొగాకు వేసి తండ్రికి తలంపిదిక్కున పెట్టి ఆ వల తీసుకొని రాయిమణి వెళ్ళిపోయింది.

నిరంజనుడి పిలుపుతో చంద్రినాథుడికి మెలుకువ వచ్చింది. నిరంజనుడు చేపలుపట్టటానికని వచ్చి అవి దొరక్క తిరిగి వెళ్ళిపోతున్నాడు. హఠాత్తుగా చంద్రనాథుడు జ్ఞాపకం వచ్చి అతడిసంగతి తెలుసుకునిపోదామని వచ్చాడు. చంద్రినాథుడు ఒళ్ళంతా దుప్పటి కప్పుకుని లేచి కూర్చున్నాడు. తర్వాత నిరంజనుణ్ని చూచి, "ఆ చాప కొంచెం ఇవతలకి లాక్కొని కూర్చో బాబూ! పిల్లదానిమాట ఎక్కడా వినిపించటంలేదు. నీళ్ళకు వెళ్ళిందనుకుంటాను. నేనేమో ఒకపూటల చస్తుంటే అది పథ్యపు వస్తువులు తీసుకురావటానికి తిరుగుతోంది" అన్నాడు.

'నీకు సుస్తీగావుందా చంద్రనాథ్?' అని అడిగాడు నిరంజనుడు.

"అవును బాబూ! ఈ మలేరియా జ్వరం శరీరాన్ని కట్టెపుల్లలా చేసింది బాబూ! ఇదెక్కడి పాడురోగం వచ్చి పట్టుకుందో ఊళ్ళో నాలుగురోజులు ప్రశాంతంగా తిండి తినటానికి కూడా వీల్లేకుండాపోయింది.

"జ్వరం ఎన్నాళ్ళనుంచి?"

చంద్రనాథుడు పుల్కాల్లో నిప్పువేస్తూ "ఈసారి ఇది నాలుగు రోజులనుంచి. కానీ ఒత్తిజ్వరం కాదు బాబూ! ప్లీహం కూడాఉంది'' అన్నాడు.

"ఏదీ, పడుకో, ఒకసారి చూస్తాను నేను,''

నిరంజనుడికి కొంచెం హోమియోపతి తెలుసు. వాళ్ళ ఊళ్ళో ఉన్నప్పుడు అప్పుడప్పుడు పల్లెవాళ్ళకు వైద్యంచేస్తూ ఉండేవాడు నిరంజనుడు చంద్రనాథునికళ్ళూ, నాలికాపరీక్షించి ఆ ప్లీహం యొక్క పరిమాణం ఎంతో తెలుసుకునే ప్రయత్నం లోఉన్నాడు. ఇంతలో రాయిమణి ఒంటికి అంటుకుపోయిన తడిచీరతో నీళ్ళోడుతూ మెల్లాలోకివచ్చి నిరంజనుణ్ణిచూసి, అతిసంకుచితురాలై పమిటచెంగు సవరించుకుంటూ ఒదిగి ఒదిగి పక్కనుంచి తప్పుకుని ఇంట్లోకి వెళ్ళిపోయింది. నిరంజనుడు చంద్రనాథుని పరీక్షించి "ఇవాళ ఏం తిన్నావ్ చంద్రనాథ్?'' అని అడిగాడు.

చంద్రనాథ్ వంటయింటిగుమ్మంకేసి చూస్తూ రాయి మణికి వినిపించేట్లుగా 'ఆఁ, తిన్నా. పొద్దున్నే ఒక కప్పుజావ మింగాను. ఇంకేంతింటాను!'' అన్నాడు బిగ్గరగా.

చంద్రనాథుడు కోపంతో ఉన్నాడని నిరంజనుడు గ్రహించాడు. అతడు కొంచెం నవ్వుకుని "పాలు తాగావా?'' అని అడిగాడు.

చంద్రనాథుడు అదే ధోరణిలో 'గొప్పవాళ్ళకే చాలవు ఎక్కడలేని పాలు! మాకెక్కడ మిగులుతాయి? శేరు అరణాలు, పాలు తాగగలనా! అయ్యోరాతా!'' అని నొసలు కొట్టుకున్నాడు.

"అయితే ఏమీ తినలేదన్నమాట. ఇప్పుడు తిను" అన్నాడు నిరంజనుడు. చంద్రనాథుడు ఇంకేదో చెప్పబోయాడు. ఇంతలో రాయిమణి బైటికివచ్చి నెమ్మదిగా "పొద్దున సగ్గు బియ్యంజావ ఇచ్చాను. ఈపూట అన్నంతింటా నంటున్నాడు" అని చెప్పింది.

చంద్రనాథుడు కూతురికేసి కొరకొరలాడుతూ చూశాడు. రాయిమణి ముఖం పక్కకుతిప్పుకుని నవ్వుకుంది. నిరంజనుడు తండ్రీకూతుళ్ళ ఇద్దరి ముఖలక్షణాలూ గమనించాడు. అసలు సంగతేమిటో పూర్తిగా అర్థంచేసుకున్నాడు. నవ్వుతూ "ఈపూటకూడా జావఇయ్యి" అన్నాడు. 'ఊం. జావ! అరవైయేళ్ళ ముండాకొడుక్కి సగ్గుజావ పథ్యమా? బ్రతికేది రెండురోజులు- సగ్గుజావకోసమయితే ఎందుకూ?" అని గర్జించాడు.

నిరంజనుడు నవ్వుకున్నాడు. జేబులోంచి రెండు కమలాఫలాలు పైకితీసి "పోనీ జావతాగలేకపోతే ఇవిరెండూ తిని ఈ రాత్రికి ఎలాగోగడుపు. రేపటపరిస్థితి చూసి అన్నంపెట్టిస్తాను" అన్నాడు. ఆ కమలాఫలాలు రెండూ చేపలుపట్టటానికి వచ్చేప్పుడు నిరంజనుడు దాహనివారణకోసమని తెచ్చుకున్నాడు.

చంద్రనాథుడు ఆ పళ్ళురెండూ ఎంతో ఆప్యాయంగా తీసుకుని "మణీ! ఇంట్లో ఆకులులేవూ? బాబుగారికి తాంబూలం తెచ్చి ఇయ్యి" అన్నాడు.

నిరంజనుడు ఆమాటకు అడ్డువచ్చి 'ఊహూం. అక్కర్లేదు నేనుతాంబూలం వేసుకోను' అన్నాడు.

తర్వాత కాస్సేపుమాట్లాడి, చంద్రనాథుని పథ్యంవిష యంలో జాగ్రత్తగా ఉండమని హెచ్చరించి నిరంజనుడు వెళ్ళ టానికి లేచాడు. ససారామెట్లు దిగేసరికి వంటయింట్లోంచి రాయిమణి వచ్చింది. నిరంజనుడి పాదాలమీదవాలి నమస్క రించి, తలవంచుకుని అతిమృదువైన కంఠంతో "రేపు అన్నం పెట్టవచ్చునా?" అని అడిగింది.

నిరంజనుడు ఒక్క క్షణం అలాగే నుంచుండిపోయాడు. 'వద్దు, రేపుకూడానద్దు. ఏదోవిధంగా నచ్చచెప్పి రేపుకూడా అన్నం తినకుండా ఉండేటట్లు చెయ్యి. ఎల్లుండికి కులాసాగా ఉంటే పెట్టవచ్చు. మరేం బెంగ పెట్టుకోవద్దు. నయమై పోతుందిలే' అన్నాడు.

కృతజ్ఞతతో రాయిమణి మళ్ళీ నమస్కరించబోయింది. నిరంజనుడు ఆమె అభిప్రాయాన్ని గ్రహించి పాదాలు వెనక్కు లాక్కుని అస్ఫుటంగా ఏదో ఆశీర్వదించి నదివైపుకు వెళ్ళి పోయాడు.

౭

జన్మదినోత్సవం అయిపోగానే రావుసాహెబ్‌గారి బంగళా నిశ్శబ్దమైపోయింది. ఇద్దరు ముగ్గురు అతిథులుమాత్రం ఉత్సవం అయిపోయాక కూడా రావుసాహెబ్‌గారి కోరిక మీదనో, ఆయన కూతురి నిర్బంధం వల్లనో ఆ రోజునే వెళ్ళి పోలేక ఇవాళ మధ్యాహ్నమే వెళ్ళిపోయారు. రావుసాహెబ్ గారి బంగళా బావురుమంటోంది. వస్తుతః పదిమందితో కలిసి

ఉండే స్వభావం కల లలితకు ఈ ఖాపురుతనం ఏమీ బాగాలేదు. రావుసాహెబ్ గారు ఎవరిదో ఒక వీలునామాముసాయిదా తయారుచేస్తూ ఆ తొందరలో ఉన్నాడు. లలితతల్లి ఇంట్లో విచ్చలవిడిగా పడిఉన్న సామానులు సర్దటంలో నిమగ్నురాలై ఉంది. దత్తుగారు లలితతో ఏకాంతంగా కూర్చుని కావ్యమీమాంస చెయ్యాలనే అభిలాషతో ఆ అవకాశంకోసం ఎదురుచూస్తున్నాడు. కాని ప్రస్తుతం ఉన్నస్థితిలో ఆమెకు కావ్యమీమాంసమీదికి ఏమాత్రం బుద్ధిపోనటం లేదు. అప్పుడిహ ఆమెమనస్సును రంజింపచేయుటానికి ఏమిటా ఉపాయం అని దత్తు ఆలోచనలో పడ్డాడు. ఇంతలో ఆ వీలునామా నకలు తయారుచేయించటానికి రావుసాహెబ్ గారు వచ్చి అతణ్ణి తీసుకువెళ్ళారు.

లలిత కాస్సేపు ఒంటరిగా గడిపి- ఏమనుకుందో ఏమో నిరంజనుడి ఇంటికేసి వెళ్ళింది. నిరంజనుడు చేపలుపట్టటానికి వెళ్ళిఉండటంమూలంగా అతడు కన్పించలేదు. అక్కడనుంచి ఏదో పరధ్యానంగా దేవిడీలోకి వెళ్ళి, నిద్రపోతున్న దర్వాన్‌ను పిలిచి ఏవో ఒకటి రెండు అనవసర ప్రశ్నలడిగింది. దర్వాన్ ముక్తసరిగా జవాబులుచెప్పి ఆమెను పంపించివేశాడు. ఆమె తండ్రి గదిలోకివెళ్ళి "ఏం తోచటంలేదు నాన్నా! పద, కాస్త షికారు వెళ్ళివద్దాం" అన్నది.

"చేతిలో పని ఇంకా పూర్తికాలేదు లలితా! ఎవరినయినా పిలిచి తీసుకువెళ్ళు నువ్వు" అంటూ ఆయన కూతురి జడ కొంచెంలాగి - పంపేశాడు.

ఇంతలో మిష్టర్ దత్తు కొంచెంగా దగ్గాడు - దాని అర్థం 'నేనున్నాను ఇక్కడ' అని.

లలిత అతడి సూచనను గమనించలేదు. "ఎవర్ని తీసుకు వెళ్ళను నాన్నా? ఒక్కరూ కన్పించటం లేదు" అన్నది.

రావుసాహెబ్‌గారు చేతిలో కలం టేబిల్ మీద ఆనించి "ఎవరూ లేరూ? ఫిల్లుక్, మాధూ వీళ్ళంతా ఏమయినారు? ఎవర్నీ ఏమీ అనను కదా అని వెధవలంతా..."

"కాదు నాన్నా! అందరూ ఉన్నారు; కాని నిద్రపోతున్నారు. నిన్నంతా శ్రమపడి పనిచేశారు కదూ!"

మిష్టర్ దత్తుకు హుషార్ వచ్చింది. ఇంతలో రావుసాహెబ్‌గారు "ఊఁ. నిద్రపోతున్నారా?- పగలునిద్ర! సోమరిపోతులనుతా! బాగుంది. ధనంజయ్‌ని పిల్చుకుని వెళ్ళరాదూ! బహుశా అతడు నిద్రపోతూ ఉండడనుకుంటా" అన్నాడు.

దత్తుగారు మళ్లీ దగ్గాడు లలిత అది వినిపించుకోలేదు. "నువ్వు ధనంజయు డంటున్నావే-అతడు అందరికన్నా ఘనుడు అసలు యింట్లోనే లేడు" అన్నది.

రావుసాహెబ్ కోపంతో విసుక్కుని "ఇంట్లో లేడా! వీళ్ళందరికీ ఊళ్ళోనాయేం పనులు? దర్వాన్‌ను పిలిచి కనుక్కుంటానుండు" అన్నాడు.

మిష్టర్ దత్తు లేవబోయాడు. "నువ్వు లేవకు మాధవ్! ఈపని ఇప్పుడే పూర్తిచెయ్యాలి. ఇది మార్వాడీ కేసు- చాలా తిరుగుళ్ళున్నాయి" అన్నాడు రావుసాహెబ్.

మిష్టర్ దత్తు బిక్కముఖం వేసుకుని మళ్ళీ కూర్చున్నాడు. లలిత బైటికి వెళ్ళిపోయింది. బైటికివచ్చాక తండ్రిఆదేశాన్ని నిర్వర్తించటానికి సబబైన కారణం ఏమీ కన్పించలేదామెకు. అంచేత దర్వాన్‌ను పిలవకుండానే సరాసరి వీధిగేటుదగ్గరకు వచ్చి నిలబడింది.

నిరంజను డప్పుడే గాలం చేతపుచ్చుకుని తిరిగివస్తు న్నాడు. లలితను చూడగానే ఆ గాలం కటకటాలకు ఆన్చి చేతులుజోడించి ఆమెకు నమస్కరించాడు. లలిత ప్రత్యభి వాదనంచేసి "సమయానికి వచ్చారు, మంచిదే అయింది—" అని మళ్ళీ అంతలో తమాయించుకుని అతిసహజమైన ధోర ణిలో "చేపలేమైనా దొరికాయా?" అని అడిగింది.

నిరంజనుడికి ఆనాటి సంగతి జ్ఞాపకంఉంది. అతి మర్యా దగా 'ఉహూఁ. ఇవాళేమీ దొరకలేదు' అని చెప్పి మళ్ళీ గాలం చేతపుచ్చుకున్నాడు.

లలిత సంభాషణ పొడిగించాలని 'ఆ రోజున దొరికాయి కదూ?' అన్నది.

నిరంజనుడి మనస్సు ప్రఫుల్లమయింది. అయితే ఆ నాటి సంగతి ఆమెకు జ్ఞాపకం ఉన్నట్లే. అతడు నవ్వుతూ 'ఆ రోజున ఆకాశం తెరపిగావుంది. మబ్బుగా వున్నరోజున చేపలు తిన కూడదు' అన్నాడు.

ఆ తర్వాత ఆ మితభాషిని అడగడానికి లలితకు మరో ప్రశ్న ఏమీ స్ఫురించలేదు. ఆమె కాస్సేపు కదలకుండా నేలచూపు చూస్తూ ఊరుకుని, మళ్ళీ ఆకాశంకేసి చూసి,

'ఓ, అవును. మబ్బువేసింది సరేకాని మబ్బుగా ఉన్నరోజున చేప లెందుకు తినకూడదో చెపుతారా?' అని అడిగింది.

నిరంజనుడు చిక్కులోపడ్డాడు. ఈ ప్రశ్నలన్నిటికీ సరియైన సమాధానాలు చెప్పాలంటే శరీరతత్వశాస్త్ర గ్రంథాలన్నీ విప్పాలి. అంచేత మామూలుగా తప్పించుకోటానికి 'అది చేపల తత్వం' అన్నాడు.

లలిత ఈ మామూలు జవాబు విని కొంచెం నవ్వుకుంది. కాని ఇంక చేపల్ని గురించి ఏమీ అడగలేదు. కొద్ది నిమిషాలు మెదలకుండా ఊరుకుని, తాను అడగటం బావుంటుందో బావుండదో ఆలోచించుకుని "ఒకపని చెయ్యగలరా?" అని అడిగింది.

"చెప్పండి"

"ఒక్కసారి నదికేసి షికారు వెళ్ళివస్తే..." అని లలిత నిరంజనుని కేసి చూసింది.

"వెళ్ళవచ్చు. పొద్దుంది కాని ఒక్కరూ వెళ్ళటం—"

లలిత నిరంజనుణ్ణి ఆమాట పూర్తిచెయ్యనీయకుండానే "మీరు రండి కూడా" అన్నది.

నిరంజనుడు మాట్లాడలేదు. కాని చటుక్కున అతడి ముఖంలో, కళ్ళలో కన్పించిన వెలుగు చూసి ఆమె గ్రహించుకుంది. అయినా సందేహం తీర్చుకోటానికి 'వస్తారా?' అన్నది మళ్ళీ.

"బాబుగారితో చెప్పి—"

"నేను చెప్పేవచ్చాను. మిమ్మల్ని వెంటతీసుకుని వెళ్ళమని చెప్పారాయన"

లలితను తనను వెంటపెట్టుకుని తీసుకువెళ్ళమన్నాడన్న మాట విని నిరంజనుడు అత్యుత్సాహంతో చేతిలోవున్న గాలం తోటలోకి విసిరేసి 'పదండి' అన్నాడు.

ముఖం చిట్లించుకుని కిటికీ సందుల్లోంచి లలిత ప్రవర్తన అంతా మిష్టర్ దత్తు గమనిస్తూనే ఉన్నాడు. లలితతో నిరంజనుడు మాట్లాడటమంటేనే అసలతడికి నచ్చదు ఈర్ష్యతో అతడి మనస్సంతా విషలిప్తమైపోయింది. లలిత నిరంజనుడితో వెళ్ళిపోవటం చూసి అతను వేలు కొరుక్కున్నాడు ఆక్రోశంతో. బయటికిరావటానికి ఉపాయం ఏమీ కన్పించటంలేదు. గుమ్మం ప్రక్కనే రావుసాహెబ్‌గారు కూర్చునిఉన్నారు. ఆ వీలునామా ముసాయిదా యింకా పూర్తికాలేదు. దత్తుగారు తన అవకాశాన్ని పాడుచేసిన ఆ వీలునామాకేసి ఎంత కోపంగా చూశాడంటే—ఇదే సత్యయుగమయినట్లయితే ఆ కాగితం భగ్గున మండిపోయేది—

ఒకగంట నదిఒడ్డునతిరిగి, ఏదో అనవసర బాతాఖానీ వేసుకుంటూ లలితా నిరంజనులు తిరిగి వస్తున్నారు సూర్యుడు అస్తమిస్తున్నాడు. అతడి అరుణకాంతులు మాత్రం అవతలి ఒడ్డునఉన్న చెట్లఆకులమీది మమకారాన్ని త్యజించుకుని పోలేక పోతున్నాయి ఇంకా... కీచురాళ్ళ ఐక్యగానం ఇంకా ప్రారంభంకాలేదు. దారి కటూ ఇటూ ఉన్న చిన్నచిన్న చెట్లలోంచి ఒకటిరెండు కీచురాళ్ళుమాత్రం స్వరం ప్రారంభించాయి.

చటుక్కున లలిత "మీ యింటిసంగతులేమీ చెప్పారే కాదు. ఇంట్లో ఎవరెవరున్నారు!" అని అడిగింది.

నిరంజనుడు ఇరుకున పడ్డాడు. ఒక్కనిమిషం ఆలోచించి "ఇంటివిషయాలు వినతగినంతగా ఏమీలేవు. మానాన్న లేడు, అమ్మమాత్రం ఉంది" అని అతడు ప్రసంగం మార్చటానికి ప్రయత్నించాడు. కాని అంతకుముందే "అక్కచెల్లెళ్ళో?" అని అడిగింది లలిత.

నిరంజనుడు కంపించిపోయాడు. అంతలో తమాయించుకుని, "అన్నదమ్ముల్లేరు" అని నిరంజనుడు తలవంచుకున్నాడు. ఇహ లలిత తన చెల్లెలిసంగతి ఏక్షణాన అడిగినా అడగవచ్చు. ఏమిటీ ఉపాయం? తాను అబద్ధం చెప్పలేడు. కాని ఆ సత్యం వెల్లడిచేస్తే తర్వాత రాబోయే పరిణామాలు ఊహించుకుని భయపడ్డాడు. పరిహాసాలు... తన కుటుంబంఅంటే అసహ్యం. ఆ రూపంగా ఈ నౌకరీకి భంగం... అంతదూరంపోకపోయినా లోకులయెదుట తలవంపులు. జీవితానికి ఎంతఅశాంతి!

లలిత నిరంజనునిలోని భావ పరివర్తనను గమనించలేదు. నిరంజనుడి సాంసారిక విషయాలమీద ఆమె కేమాత్రం ఆసక్తిలేదు. ఆమె కేవలం కాలం గడపటానికి నోటికి వచ్చిన ప్రశ్నల్లా అడుగుతోంది. అంతే. లలిత మళ్ళీ 'మీకు చెల్లెలున్నదా? ఎక్కడుందీ ఆమె?' అని అడిగింది.

ఆ ప్రశ్నవిని పాముకరచినవాసలా నిరంజనుడు హఠాత్తుగా నల్లపడిపోయాడు. నిజం చెప్పాలనే నిశ్చయించుకున్నాడు కాని చెప్పటానికి ధైర్యం చాలలేదు. నీళ్ళు నములుతూ ఏదో జవాబు చెప్పబోయాడు. ఇంతలో 'హల్లో' అన్న గొంతు ఒకటి వినిపించింది. లలిత నవ్వుతూ "మిష్టర్, దత్!... వచ్చారే!..." అన్నది.

నిరంజనుడు బ్రతికిపోయాడు. హఠాత్తుగా మిష్టర్ దత్తురావటం అతడికి భగవంతుడు ప్రత్యక్షమయినట్లనిపించింది. దత్తు రాగానే ఉపోద్ఘాతం ఏమీ లేకుండగానే 'ఇంతసేపటి దాకా నువ్వు బైట ఎందుకు తిరుగుతున్నావ్?' అని అడిగాడు నిరంజనుణ్ని.

"అతడి దోషమేమీ లేదు మిష్టర్ దత్! నేను వెంట తీసుకెళ్ళాను" అన్నది లలిత.

దత్తు లలిత అన్న మాటలకు ఇంగ్లీషులో చెప్పిన సమాధానం ఇది:-ఇలాంటి చదువురాని అనాగరికుల కందరికి చనువిస్తే ప్రభువును సర్వనాశనం చేస్తారు-అని...తర్వాత నిరంజనుడితో 'నువ్వువెళ్ళి నీ పనేదో చూసుకోవోయ్. కేవలం చేపలుపడుతూ తిరుగుతూఉన్నంత మాత్రాన నీ పనులు నిర్వర్తించుకున్నట్లు అవదు" అన్నాడు.

మరో రోజున అయినట్లయితే దత్తు ఈమాటలు అని తప్పించుకుని బైటపడగలిగేవాడుకాడు కాని ఇవాళ నిరంజనుడు ఎలాగయినా లలితదగ్గిర్నుంచి తప్పించుకుని బైట పడితే చాలునని చూస్తున్నాడు. అంచేత అతడిమాటలకు జవాబు చెప్పకుండానే నిరంజనుడు గబగబా వెళ్ళిపోయాడు.

దత్తుగారు మళ్ళీ రమ్మనయితే చెప్పాడు. కాని నిరంజనుడు మళ్ళీ రాకుండానే బంగళాకు ఎదురుగాఉన్న వీధినపడి ఊరు వెలుపలకు వెళ్ళిపోయాడు. అక్కడ కిప్పుడు ఒక జట్టు లంబాడీలు వచ్చి ఉన్నారు ఏదో పరధ్యానంగా వాళ్ళ వివిధ కలరవాన్ని వింటూ కూర్చున్నాడు. రాత్రి ప్రొద్దుపోయిన కొద్ది వాళ్ళ కలరవం తగ్గుతూ వచ్చింది. అయినా నిరంజనుడు

అక్కడినుంచి కదలలేదు. విచారంతోనూ, అభిమానంతోనూ అతడిమనస్సు విషలిప్తమయినట్లుంది. ఇంటికి రావటానికి బుద్ధిపుట్టలేదు. సామానంతా సర్దుకుని ఈరాత్రికి రాత్రే రావుసాహెబ్‌గారి ఆశ్రయాన్ని వదలుకుని వెళ్ళిపోదామా అని మధ్యమధ్య అనిపించసాగింది. కాని అనిశ్చితమైన భవిష్యత్తుయొక్క ఆశంక అతడి సంకల్పానికి విఘ్నం కలిగించింది.

హఠాత్తుగా పరిచితమైన కంఠధ్వని వినిపించటంతో అతడి పరధ్యానం వదిలింది. వెనక్కితిరిగి చూసేసరికి గుడ్డి లాంతరు చేతపుచ్చుకుని భిల్లుక్ తన వెనకాలనుంచునిఉన్నాడు.

నిరంజనుడేమీ అడగకముందే "నువ్వుఇక్కడున్నావా భాయీజీ! నేను ఊరంతా వెతుకుతున్నా ఇంకా. ఏం జరిగిందేమిటి చెప్పు భాయిజీ!" అన్నాడు భిల్లుక్.

"ఏమ్బే! ఏమీ లేదే!"

"నువ్వు నాదగ్గిర దాస్తున్నావా భాయీ, నీ భిల్లుక్ అమాయకుడు కాడు. కొంత కొంత తెలుసుకున్నాడు. ఎలా తెలుసుకోగలిగానో తెలుసా భాయిజీ, అమ్మాయిగారు రాగానే ముందుగా నీకోసం వెతకసాగింది. నువ్వు ఎక్కడా కనిపించక పోయేసరికి వెతుక్కుని రమ్మని నాతోచెప్పింది. నువ్వు వెంటనే వస్తావని అనుకున్నా. అంచేత నేనేమీ ఆదుర్దాపడలేదు. ఒక గంటపోయాక అమ్మాయిగారు మళ్ళీ నీకోసమని వచ్చేసరికి, నిన్ను వెతుక్కుంటూ వచ్చాను."

లలిత తనకోసం ఎందుకు వెతుక్కుంటోందో నిరంజనుడు గ్రహించలేకపోయాడు. "బహుశా ఏదో పనిఉండి ఉంటుంది. పద, పోదాం" అని భిల్లుక్ వెంట నడవసాగాడు.

ఉద్యానవనం నిర్జనంగా ఉంది. ఒక గులాబీపొదదగ్గిర ఆకుపచ్చదీపం వెలుతుర్లో ఒక సిమెంటుబల్లమీద కూర్చుని లలిత పుస్తకం చదువుకుంటోంది. ఆమెకాళ్ళదగ్గిరే ఒకదానీది లలిత పెంపుడుకుక్కను దువ్వుతూ కూర్చునిఉంది ఇంతలో నిరంజనుడు వచ్చి "పిలిచారా నన్ను?" అని అడిగాడు.

"వచ్చారా? ఇంతసేపటిదాకా ఎక్కడున్నారు?" అని లలిత తలపైకెత్తి అతడిముఖంకేసి తీక్ష్ణంగా చూసింది "బైట ఉన్నాను" అన్నాడు నిరంజనుడు ముక్తసరిగా. "బయట అంటే ఎక్కడ? నదిఒడ్డునా?"

"కాదు, ఊరిబయట లంబాడీలు ఉన్నారే—అక్కడ" లలిత కాస్సేపు మెదలకుండా ఊరుకుని "మీరు మనస్సులో ఏమీ అనుకోవద్దు. నామూలంగా మీరు వృథా మాటలు పడాల్సివచ్చింది. నే నందుకు చాలా విచారిస్తున్నాను" అన్నది.

లలిత తన కోసమై ఎందుకు వెతికిందో నిరంజనుడికి ఈ మాటతో తెలిసిపోయింది. "మనస్సులో ఎందుకను కుంటాను? అనే అధికారం ఆయనకుఉన్నది, అన్నారు. నేను పడ్డాను. అందుకు మీరు విచారిస్తే లాభం ఏముంది?"

లలితకు గుండెలమీది బరువు దింపినట్లయింది. సాయంకాలం తనయెదుట దత్తుగారు నిరంజనుణ్ణి చీవాట్లు పెట్టినప్పట్నుంచీ దీనికంతకూ తానే కారణంకదాఅని ఆమె బాధ పడుతోంది. ఇంటికివచ్చినప్పట్నుంచీ ఈమాట చెప్పాలనే ఆమె నిరంజనుడికోసం వెతకటం మొదలెట్టింది.

అతి మామూలువ్యవహారమే. కాని లలిత ఈ సంఘటనతో వెల్లడిచేసిన సహృదయత నిరంజనుడి హృదయాన్ని స్పృశించింది. అతడు సంతుష్టుడై వెళ్ళిపోయాడు అక్కడినుంచి.

## ౮

నిరంజనుడు సంతుష్టుడైనాడు. నిజమే. కాని ఆ తర్వాత రెండు మూడు రోజులవరకూ లలితను కలుసుకోలేదు. కలుసుకుంటే ఏమాటలధోరణిలోనయినా తమ సాంసారికవిషయాలు పైకివస్తాయేమోనన్న భయం. లలిత సాయంత్రం షికారు వెళ్ళేప్పుడూ ఆతడ్ని పిలువలేదు భిల్లుక్ నిరంజనుడి ఈ భావ పరివర్తనగమనించాడు. దానికి కారణంతెలుసుకోవాలనిప్రయత్నించాడు. కాని మితభాషిఅయిన నిరంజనుడు ఎక్కువగాఏమీ మాట్లాడేవాడుకాడు. చివరకు భాయిజీమనస్సుకు ఉత్సాహం కలిగించాలని భిల్లుక్ చేపలనుపట్టటానికి వెడదాం రమ్మని పిలిచాడు. కాని ఒంట్లో అస్వస్థతగా ఉన్నదనే మిషతో నిరంజనుడు అతన్నికూడా ఆ ప్రయత్నంనుంచి విముఖుణ్ణిచేశాడు.

ఆ రోజున సాయంత్రంనుంచీ మబ్బుగా నేఉంది. రోజూ షికారువెళ్ళేవాళ్ళు వర్షం వస్తుందేమో అన్న భయంవల్ల పొద్దుకుంకకముందే ఇళ్లకుచేరుకున్నారు. రావుసాహెబ్ గారి బంగళాముందు రోడ్డుమీద నిరంజనుడు మాత్రం పరధ్యానంగా తిరుగుతున్నాడు. సాయంత్రపువేళ నిర్జనంగా ఉన్నప్పుడు అలాతిరుగుతూంటే సుధ విషయం జ్ఞాపకం రాసాగింది. తనుఊరు వెళ్ళి సుధ విషయం గట్టిగా వాకబుచేసి కనుక్కోవాలనికూడా మధ్యమధ్య అనిపించింది. కాని మరుక్షణంలోనే 'తర్వాత?' అన్నప్రశ్న బయలుదేరేది సుధ తిరిగివస్తే ఆమెకు స్థానం ఎక్కడ? లోకులు నాలుగువైపులనుంచి ఆమెను దూషిస్తూ ఆకలిగొన్న పులుల్లాగా మీదపడి కరవొస్తారే— వాళ్ళనుంచి ఆమెను ఎవరు రక్షిస్తారు? ఈ ఆలోచనలు సాగి

వస్తూనే ఉన్నాయి. ఇంతలో ఎవరోవచ్చి వాటికి అంతరాయం కలిగించారు. ఆగంతుకుడు వచ్చి నమస్కరించి నిలబడగానే "నువ్వు ఎక్కడినుంచి వస్తున్నావ్?" అని అడిగాడు నిరంజనుడు.

"ఆవైపునఉన్న పల్లెకారుల పేటనుంచి. ఒక ఉత్తరం ఉంది." అని అతడు పైపంచను మూటకట్టిన, మడతపెట్టిన కాగితం విప్పియిచ్చాడు. నిరంజనుడు ఆ ఉత్తరం చదువుకుని కనుబొమలు చిట్లించి "ఎప్పటినుంచి అస్వస్థతగాఉంది?" అని అడిగాడు.

"జ్వరబాధ చాలారోజులనుంచీ ఉంది నిన్నటినుంచీ ఎక్కువగా ఉంది"

నిరంజనుడు కాస్సేపు ఆలోచించి, ఆకాశంకేసిచూసి, "వెళ్లు. వస్తున్నా"అని అతణ్ణిపంపి బంగళాకేసి వెళ్ళాడు.

రాయిమణి రాసినఉత్తరం అది. అపథ్యంచెయ్యటం మూలంగా చంద్రనాథుడికి మళ్ళీ జబ్బు ఎక్కువయింది. ఇవాళ సంధించిన చిహ్నాలుకూడా కన్పిస్తున్నాయి. ఈ సంగతులన్నీ తెలియచేస్తూ ఒక్కసారివచ్చి తండ్రిని చూసివెళ్ళమని బ్రతిమాలుతూ రాసింది. రాయిమణికి కొంచెం చదువువచ్చునని చంద్రనాథుడు చెప్పగా నిరంజనుడు మొదట్లోనే తెలుసుకున్నాడు. అది తండ్రి కేవలం కూతురిమీద వాత్సల్యంతో సగర్వంగా చెప్పినమాట కాదనీ, అతడు చెప్పినమాటల్లో యథార్థం ఉన్నదనీ ఈ ఉత్తరంచూసి గ్రహించాడు. చక్కని దస్తూరితో వర్ణక్రమం తప్పులు లేకుండా-ఒద్దిక అయిన భాషలో రాసింది ఆ వుత్తరం.

రెండుసార్లు చదువుకుని ఆ ఉత్తరంచించేసి నిరంజనుడు బంగళాలోకివెళ్ళి ముందుగా భీల్లుక్ కోసం వెతకటం మొదలెట్టాడు. అతను కన్పించనేలేదు. అప్పుడిహ తనగదిలోకివెళ్ళి రగ్గు కప్పుకుని హోమియోపతి బాక్సు చేతపుచ్చుకుని బయలు దేరి వెడుతూ భీల్లుక్ కనుక వస్తే వెంటనే ఆవైపునఉన్న చంద్ర నాధ్ ఇంటికి రమ్మన్నానని చెప్పమని దర్వాన్‌తో చెప్పి వెళ్ళి పోయాడు.

చంద్రనాధ్ మంచంలో పడుకుని చెరుపు మరుపు మాటలు మాట్లాడుతూ కంగారుపెట్టేస్తున్నాడు. రాయిమణి మొద్దుబారిపోయి తలంపి దిక్కున తండ్రికి విసురుతూ కూర్చుని కళ్ళు ఒత్తుకుంటోంది. చీమ చిటుక్కుమన్నా నిరంజనుడు వస్తున్నాడేమోఅని బైటికివచ్చి చూస్తోంది. నిరంజనుడికి కబురు చెయ్యాలని, నిన్న సాయంకాలంనుంచీ అనుకుంటోంది. కాని ధైర్యం చాలలేదు. రెండు మూడుసార్లు ఉత్తరాలురాసి చించి పారేసింది. కాని చంద్రనాధుడికి జ్వరం ఎప్పుడైతే తగ్గలేదో, క్రమశః ప్రలాపన జాస్తి అయిందో, అప్పుడిహ గత్యంతరం లేక నిరంజనుడికి ఉత్తరం పంపింది. ఉత్తరం పంపికూడా ఆమె నిశ్చింతురాలు కాలేకపోయింది. కొత్తగా పరిచితుడైన ఆ పెద్దమనిషి కబురు చేసినంతమాత్రాన తన యింటికి వస్తాడని ఆమె ఊహించుకోలేకపోయింది. అయినా మనస్సులో ఆశ మాత్రం మధ్యమధ్య మినుకుమినుకుమంటూనే ఉంది. కాని వెళ్ళి జామయినా ఉత్తరంతీసుకెళ్ళినవ్యక్తి ఏజవాబూఎప్పుడైతే చెప్పలేదో అప్పుడామె నిరాశచెందింది. వస్తున్నాడేమో అని ఎదురు చూసి చూసి, రాయిమణి ఇంట్లో ఒక మూ

చేరి ఏడుస్తూ కూర్చుంది. తండ్రిముఖంకేసేచూసేందుకు ధైర్యం చాలటంలేదు. ఒక్కొక్కప్పుడు చంద్రనాథుడి అరుపులు వినలేక చెవుల్లో వేళ్ళుపెట్టుకునేది. తండ్రి ఆ ప్రవాహం ఆమె సహించలేకపోతోంది. ఇంతలో ఎవరో మెల్లాలోకివచ్చి 'చంద్రనాథ్' అని పిలిచారు. రాయిమణి వడుగెత్తుకుంటూ వచ్చి చూసింది. నిరంజనుడు మెల్లలోకివచ్చినిలబడిఉన్నాడు. నిరంజనుడువసారాలోకివచ్చి "ఎలాఉంది? చంద్రనాథ్ ఎక్కడున్నాడు?"అని అడిగాడు. రాయిమణికి నోట మాటరాలేదు. చేతితో ఆ గదిలో వున్నాడని సూచించింది.

నిరంజనుడు గదిలోకి రాగానే చంద్రనాథుడిది సామాన్యమైన రోగం కాదని తెలుసుకున్నాడు జ్వరం విపరీతంగా ఉంది. దానికితోడు దగ్గు; అప్పైన ఇంకా కొన్ని ఉపలక్షణాలుకూడా ఉన్నాయి. చంద్రనాథుడి పక్కనకూర్చుని నిరంజనుడు రోగిని చాలాసేపు పరీక్షించాడు. తర్వాత వసారాలోకివచ్చి నుంచోగానే, రాయిమణి చీకటింట్లోంచి ఎక్కడినుంచోవచ్చి "చూశారా?" అని అడిగింది. "ఊఁ" అన్నాడు ముక్తసరిగా నిరంజనుడు.

నిరంజనుడి గంభీరమైనముఖంకేసి చూసేసరికి రాయిమణికి ఇంకేం అడగడానికీ ధైర్యంచాల్లేదు. కాసేపు అలాగే నుంచుని చటుక్కున నిరంజనుడికాళ్ళమీదపడి, "మా నాన్నను బ్రతికించండి. నాకు—"అంటూ వెక్కింది. అసంపూర్తిగాఉన్న ఆ వాక్యం ఆమె ఏడుపులో కలిసిపోయింది.

ఇలాంటిదృశ్యాలుచూడటం నిరంజనుడికి అలవాటుంది. మెల్లిగా రాయిమణిని చెయ్యిచ్చుకుని లేవతీసి, "గాభరా

పడొద్దు. గాభరాపడినంతమాత్రాన ప్రయోజనంలేదు. నేను మందుఇచ్చి ఇక్కడే కూర్చుంటాను. నువ్వు ఈలోగా అన్నం వండుకుని తిను. రాత్రల్లా మేలుకుని ఉండాలి” అన్నాడు.

రాయిమణి ఏమీ చెప్పకుండా వెళ్ళిపోయింది. కొంచెం సేపయాక కాసిని బియ్యం, కూర అన్నీ తెచ్చి నిరంజనుడిఎదుట క్రిందపెట్టింది. నిరంజనుడు అప్పుడు వైద్యపుస్తకంతీసి ఈవ్యాధి లక్షణాలను సమన్వయం చేసుకుంటున్నాడు. తలయెత్తి “ఇదేమిటి?” అని అడిగాడు. రాయిమణి మృదువుగా “బైటకుంపటి రాజేసిపెట్టాను.” అన్నది.

నిరంజనుడు గ్రహించాడు. “అదేమీ అవసరంలేదు మణీ! ఏమిటుకు నువ్వు వండుకుతిను. నాకుఆకలి లేదు, నేనేమీ తినను” అని చంద్రనాథుడికి మందు ఇవ్వటానికి మళ్ళీ లోపలికి వెళ్ళాడు. అతడికి మందుఇచ్చి నిరంజనుడు మళ్ళీబయటికివచ్చి చూచేసరికి రాయిమణి ఇంకా అలాగే నుంచుని ఉంది.

రాయిమణి తాను చెప్పినట్లు చేయనందుకు అతడికి కోపంవచ్చింది. కాని రాయిమణికేసితిరిగి కేకలెయ్యటానికి మనస్కరించలేదు. అయినా “నేను చెప్పినట్లుచెయ్యి. ఎందుకు అనవసరంగా హంగామా చెయ్యటం? నేను ఈ గదివిడిచిపెట్టి ఒక్కక్షణంకూడా ఇవతలికి రాను” అన్నాడు.

ఆమాటలువిని రాయిమణి జవాబుచెప్పలేదు. మెల్లిగా వంటయింటికేసి వెళ్ళింది. కాని నిరంజనుడిఆదేశాన్ని పూర్తిగా నిర్వర్తించలేదు. కాస్సేపు వంటయింట్లోని సామానులు అటూ యిటూ చప్పుడుచేస్తూ సర్ది, మళ్ళీతిరిగివచ్చింది. నిరంజనుడు చంద్రనాథుడి మంచం ప్రక్కన కూర్చుని

ఉన్నాడు. "అన్నం వండుకున్నావా?" అని అడిగాడు. రాయి మణి భయపడుతూ "ఆనక వండుకుంటాను" అనిచెప్పి తండ్రి పాదాలదగ్గిరకువచ్చి అతడికి కాళ్ళు పిసుకుతూ కూర్చుంది. నిరంజను డింక వంటవిషయం తీసుకురాలేదు.

రాత్రి పొద్దుపోయింది. రోగిలో మార్పుఏమీ కన్పించలేదు. నిరంజనుడు మళ్లీ పుస్తకంచూస్తూ కూర్చున్నాడు. నిద్రతో బరువెక్కిన కళ్ళతో రాయిమణి నిరంజనుడి ముఖభావాల్ని గమనిస్తూ కూర్చుంది. అతడు మళ్ళీ మందు యివ్వటంచూసి, "ఎలాఉంది?" అని అడిగింది భయపడుతూ.

ఆ ప్రశ్నకు సమాధానం యదార్థమైంది చెప్పాలంటే అది చాలా బాధకలిగిస్తుంది. అంచేత అతడు యథార్థం చెప్పలేకపోయాడు. "మందు పట్టిస్తే భయంలేదు" అని మాత్రం అన్నాడు. రాయిమణికి కొంచెం ఊరటకలిగింది.

శ్రావణమేఘాలు ఎప్పుడు వర్షించటం మొదలెట్టాయో పుస్తకంచూస్తూకూర్చున్న నిరంజనుడు గమనించలేదు. చటుక్కున ఉరుము ఉరమేసరికి ఉలిక్కిపడి అతడు పుస్తకంమీది నుంచి దృష్టిమళ్ళించి రోగిముఖంకేసి చూశాడు. చూడగానే మందుపట్టిస్తున్నట్లు గ్రహించాడు. రోగికి ఉచ్ఛ్వాసనిశ్వాసలు మామూలుగా వస్తున్నాయి. నాడి పరీక్షించిచూసి ప్రమాద స్థితి దాటిందని తెలుసుకున్నాడు.

విచారంతో, ఉపచారాలతో అలసిపోయిఉన్న రాయి మణి ఎప్పుడు నిద్రవచ్చి అక్కడే ఒరిగిందో నిరంజనుడు గమనించలేదు. చుట్ట చుట్టుకున్న ఆమె జుట్టు జారిపోయి రోగి కాళ్ళమీదినుంచి నేలమీదిక పడిఉంది. అనావృతమైఉన్న

పరిపుష్టమైన ఆమె వక్షస్థలంమీద ప్రక్కనున్న దీపపుకాంతి పడటంచూసి నిరంజనుడు కొంచెం కంపించాడు. రెండు చేతులతో ముఖం కప్పుకుని "రా యి మ ణీ" అని బిగ్గరగా పిలిచాడు.

రాయిమణి కంగారుగాలేచి కూర్చుని 'ఆఁ,' అన్నది భయపడుతూ.

"భయం లేదింక. లేచి రా"

రాయిమణి చీర సవరించుకుంటూ లేచివచ్చి నిరంజనుడి ప్రక్కన నుంచుంది.

"నువ్వు యిక్కడ కూర్చో, ఇంకభయంలేదు. ప్రమాద పరిస్థితి దాటిపోయింది. నిద్రపోతున్నాడు. నేను వెడతా నింక. రేపు పొద్దున వస్తాను" అని నిరంజనుడు గుమ్మం వైపుకు తిరిగాడు.

"నాకు ఒక్క తెనెకూర్చునిఉండటానికి భయంవేస్తుంది"

"ఏం భయంలేదు. ఇప్పుడు రెండు గంటలయిఉంటుం దనుకుంటా. మెదలకుండా కూర్చో. భయ మేముంది?"

భయానికికారణాలు చాలాఉన్నాయి. కాని రాయిమణి అవన్నీ విప్పి చెప్పలేదు. "ఊహూఁ, నాకు భయంవేస్తుంది" అనిమాత్రం అన్నది ముక్తసరిగా.

నిరంజనుడు బయలుదేరి పోతున్నవాడు ఈమాట విని వెనక్కి తిరిగి చూశాడు. నిజంగా రాయిమణి ముఖంలో భయలక్షణాలు కన్పిస్తున్నాయి. కాస్సేపు మెదలకుండా ఊరుకుని "సరే, నువ్వు ఇక్కడకూర్చో. నేను వసారాలోకి వెడతాను"అని గబగబా గదిలోంచి బయటికివచ్చాడు.

గదిలో ఇంత చోటుండగా నిరంజనుడు అపరిశుభ్రంగా ఉన్న ఆ వసారాలో విశ్రాంతి ఎందుకు తీసుకోవాలని అనుకున్నాడో రాయిమణి బుద్ధి కది అగమ్యంగా ఉంది. ఆమె అందుకు అభ్యంతరం చెబుదామని ఒకసారి అనుకుంది. కాని చెప్పలేకపోయింది. కొంచెం సేపాగి, అడుగులుచప్పుడు కాకుండా నెమ్మదిగా వెళ్ళి తలుపుసందుల్లోంచి చూసింది. నిరంజనుడు ఒకచాప పరచుకుని కూర్చుని ఉన్నాడు. అతని పక్కకు అవసరమనిచెప్పి ఇంట్లోనుంచే "ఒక తలగడా—" అని అడగబోయింది.

నిరంజనుడు చటుక్కున "ఉహూఁ, ఏమీ అక్కర్లేదు. నువ్వు మేలుకుని ఉండు. అంత మరీ అవసరమని తోచినపుడు నన్నుపిలు. నాకుఏమీ అక్కర్లేదు" అన్నాడు.

రాయిమణి తండ్రిప్రమంచందగ్గరకువచ్చి కూర్చుంది. కాని నిరంజనుడికి అసౌకర్యంగా ఉందేమోఅని ఆమెకు పదే పదే అనిపించసాగింది. ఆ ఆలోచనతో ఇంక మరేమీతోచని స్థితికి వచ్చేసరికి ఆమె మళ్ళీ లేచివచ్చి తలుపు కొంచెంతీసి చూసింది. నిరంజనుడు చాపమీద నిద్రోతున్నాడు. నిజంగా నిద్రోతున్నాడో లేదో పరీక్షించటానికి తలుపు కొంచెం చప్పుడుచేసింది, అప్పటికీ అతడికి మెలుకువ రాకపోయేసరికి ఒక తలగడా తీసుకునివచ్చి నిలబడింది. నిద్రోతున్న ఈ అతిథిని స్పృశించేందుకు సాహసం చాలక మొద్దుబారినట్లు కాస్సేపు అలాగే నిలబడింది. తర్వాత ఎలాగో ధైర్యంచేసి మెల్లిగా

నిరంజనుడి తలయెత్తి తలగడా అమర్చి గబగబా లోపలికి వచ్చేసింది



నిరంజనుడికి మెళుకువచ్చేసరికి కొంచెం పొద్దెక్కింది. రాయిమణి వాకిట్లో కల్లాపిచల్లుతోంది. "ఇంతపొద్దెక్కితే నన్నెందుకు లేపావుకావు?" అన్నాడామెను ఉద్దేశించి పమిట చెంగు పళ్ళతో కొరుక్కుంటూ చిరునవ్వు ఆపుకుంది రాయిమణి. జవాబేమీ చెప్పలేదు. తెల్లవారుఝామునే వెళ్ళిపోతానన్న వ్యక్తిని ఇప్పటివరకూ ఆపగలిగినందుకు రాయిమణి లోపల్లోపల సంతోషిస్తోంది. ఇంతకుముందే భిల్లుక్ వచ్చాడు. రాత్రి జరిగినసంగతి యావత్తు రాయిమణి చెప్పగావిని అతడు భాయిజీ ఆర్ద్రహృదయానికి ముగ్ధుడై వెళ్ళిపోయాడు. అతడి విశ్రాంతికి భంగం కలిగించటానికి అతడికి మనస్కరించలేదు.

రాయిమణి జవాబుచెప్పకపోవటంచూసి నిరంజనుడు మళ్ళీ నన్నెందుకు పిలవలేదు మణీ? ఎలా ఉన్నాడు చంద్రనాథ్?" అని అడిగాడు

రాయిమణి ఆ ప్రశ్నలో చివరిభాగానికి జవాబు చెప్పింది. "కులాసాగానే ఉన్నాడు ఇప్పుడే నిద్రలేచాడు" చంద్రనాథుడు నిద్రలేచాడని విని నిరంజనుడు లోపలికివెళ్ళాడు. చంద్రనాథుడు రాయిమణిద్వారా అంతా తెలుసుకున్నాడు. నిరంజనుని చూడగానే వృద్ధుడు కృతజ్ఞతతో కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు. నిరంజనుడు అతణ్ణి ఎలాగో ఊరడించి "ఇప్పుడెలా ఉంది చంద్రనాథ్?" అని అడిగాడు.

"నీ పాదధూళి కాస్త నాతలమీద పడనియ్ బాబూ! నువ్వు కేవలం నాపాలిటి భగవంతుడివి"

చంద్రినాథుడి భక్తిని నిరంజనుడు లెఖ్ఖచెయ్యకుండా "ఆకలేస్తోందా? ఏమయినా తినాలని అనిపిస్తోందా?" అని అడిగాడు.

చంద్రినాథుడు అతడు అడిగిందే తడవుగా తన కిష్ట మైన అపథ్యపు వస్తువేదో తినాలని ఉన్నట్లు సూచించాడు.

నిరంజనుడు నవ్వాడు. యమద్వారాన్నుంచి అప్పుడే వెనక్కి తిరిగివచ్చిన అతడికి కోరినవస్తువు విషతుల్యం అయినా ఆమాటమాత్రం చెప్పకుండా 'ఊహుఁ, ఇవాళకు బార్లీయే' అని రాయిమణిని పిలిచాడు. రాయిమణి రాగానే అతడి పథ్యం విషయమై చెప్పవలసిందేదో చెప్పి "నేను వెళుతున్నాను. ఇంక ఇప్పుడు మందు అఖ్ఖర్లేదు. కాని పథ్యం విషయంలో మాత్రం జాగ్రత్తగా ఉండాలి" అని చెప్పాడు.

తర్వాత ఆమె మరీ బ్రతిమాలటంవల్ల సాయంకాలం వస్తానని మాట ఇచ్చి నిరంజనుడు వెళ్ళిపోయాడు.

౯

స్నానమూ, ఆహ్నికమూ పూర్తిచేసుకుని నిరంజనుడు తోటలు పర్యవేక్షణచేస్తూ తిరుగుతున్నాడు పెద్దతోటమాలికి రెండు సలహా లేవో యిచ్చి ఈ తోటలవిషయమై ఏదో రావు సాహెబ్‌గారితో మాట్లాడటానికి డ్రా యి ం గ్ రూ ములోకి వెళ్ళాడు. వెడుతూండగా లలిత ఎదురుపడింది. ఆమెకు నమ

స్కారం చెయ్యగానే ఆమె ప్రతినమస్కారం చేస్తూ "ఊఁ' మీ 'పేషెంట్' ఎలాఉన్నాడు?" అని అడిగింది.

నిరంజనుడు ఆశ్చర్యపోయాడు. ఆరోగికి తాను పరిచర్య చేయటం సంగతి లలితకు ఎలా తెలిసింది? నిరంజనుడి ముఖభంగిమచూసి, లలిత తమాషాగా "చూశారా? నాకు జోస్యం తెలుసు! నిన్న మీరెక్కడున్నదీ మీ ముఖంచూడగానే చెప్పేశాను" అన్నది.

ఇలాంటి చమత్కారాలు నిరంజనుడి కెప్పుడూ అలవాటులేదు- ప్రత్యేకించి ఆడవాళ్ళతో అసలు అలవాటులేదు. అయినప్పటికీ చటుక్కున "అదికూడా జోస్యం చెప్పండి" అని, కొంచెం సీరియస్‌గా "కొంచెం కులాసాగానే ఉన్నాడు కాని మీకెలా తెలిసింది?" అని అడిగాడు. లలిత సుస్మితంగానవ్వి "మీ భిల్లుక్ ద్వారా తెలుసుకున్నాను. అతడు పొద్దున్నే వచ్చి మీకు నిద్దరోతున్నారని లేపలేదని చెప్పాడు. పోనిండి మంచిపని చేశారు" అని దయావిషయకమైన ఆంగ్లకవి సూక్తులు ఒకటిరెండు వినిపించి ఆ ప్రసంగాన్ని అంతటితో పూర్తిచేసింది ఆమెకు సమాధానంగా నిరంజనుడికి చెప్పవలసిన సంగతులున్నాయి. కాని కొంచెం దూరంలోఉన్న దత్తుగారినిచూసి అతడు ఆగిపోయాడు. రెండుమాటల్లో లలితకు కృతజ్ఞత వెలిబుచ్చి, అతడు పక్కనుంచి తప్పుకుని డ్రాయింగ్‌రూంలోకి వెళ్ళిపోయాడు.

కొంచెంసేపటికల్లా దత్తుగారు వచ్చాడు. నిరంజనుడూ లలితా చమత్కారంగా మాట్లాడుకోవటం అతడు దూరం నుంచే కనిపెట్టాడు. బైటవాళ్ళతో ఎవరితోనూ- ముఖ్యంగా

నిరంజనుడితో లలిత అంతచనువుగా ఉండటం అతడికి మొదటి నుంచీ ఇష్టంలేదు. అతడు రాగానే ముందుగానే "ఏమిటి మాట్లాడుతున్నారు?" అని అడిగాడు.

దత్తుగారి గంభీరముఖాన్ని చూసి లలిత అతడి అభిప్రాయం గ్రహించింది. నిరంజనుడంటే దత్తుగారి అభిప్రాయం ఎలా ఉండేదీ ఆమె కిదివరకే తెలుసు, మెల్లగా "ఎవరిసంగతి మీరడిగేది?" అని అడిగింది.

"గంగూలీతో ఏమిటి మాట్లాడుతున్నారు?"

దత్తుగారి ఈ అనుచితమైన కుతూహలానికి లలితకు మనస్సులో మహా కోపంవచ్చింది. కాని పైకి ఏమీ అనలేదు. అతడడిగినవిషయమై మెదలకుండా ఊరుకుంది. ఎందుకంటే నిజంచెబితే నిరంజనుడికి మళ్ళీ చీవాట్లరాత తప్పదని ఆమెకు బాగా తెలుసు.

లలిత జవాబు చెప్పకపోయేసరికి దత్తుగారికి ఛర్రుమంది. కాని కంఠస్వరాన్ని వీలైనంత మెత్తగామార్చి "చూడు లలితా! నీకో సంగతిమాత్రం చెబుతున్నాను. నువ్వు ఏమైనా చెయ్యి. కాని నీ 'ప్రెస్టేజీ' ని మాత్రం నిలబెట్టుకుంటూ ఉండాలి' అన్నాడు.

"ప్రస్టేజి నిలబెట్టుకోవాలి సరే; మీరు చెప్పతలచుకుందేమిటి" మిష్టర్‌దత్తు స్పష్టంగానే చెప్పేశాడు. "నిన్ను నువ్వు తెలుసుకోమంటున్నాను. గంగూలీ—నువ్వు ఎవ్వరితో అంత చనువుగా మాట్లాడుతున్నావో అతడు కేవలం నీ నౌకరు. అతడితో అంత సమానస్థాయీగా మాట్లాడటం నా దృష్టికి

అంతగా బావుండదు ఆ యింగితంవుంటే నీవూ గ్రహించగల వా సంగతి"

దత్తుగారి ఉపదేశాల నెన్నిటినో ఆమె ఎదురు చెప్పకుండా స్వీకరించిం దిదివరలో. కాని ఇవాళ ఈ సలహా స్వీకరించలేకపోయింది. "నౌకరీ ఎంతచిన్నదయినా—ఆ నౌకరీచేసే వ్యక్తి పెద్దమనిషయితే—అలాంటివారితో మాట్లాడటం యజమాని మర్యాదకు భంగం అనేమాట నేను ఒప్పుకోను" అని ఆమె అక్కడినుంచి బయులుదేరబోయింది. లలితను రెచ్చకొట్టటం దత్తుగారి అభిప్రాయంకాదు. ఆమె హృదయాన్ని జయించాలనే చాలాకాలంనుంచి అతడి అభిలాష. చటుక్కున లలిత కోపం తెచ్చుకోవటం చూచి, దత్తు మనస్సులో భయపడ్డాడు. అశోభనకరమైన ఈ వాద ప్రతివాదాల విషయం మళ్ళీ జ్ఞాపకంరాకుండా చెయ్యటానికి ఆమెను పిలిచి "తర్వాత సంగతి విను లలితా" అన్నాడు ఆ పిలుపు విని లలిత వెనక్కి వచ్చింది. "తర్వాత- నువ్వురాసిన ఆ కవిత్వం ఏపత్రికకు పంపావ్?" అని అడిగాడు.

క్షణంక్రిందటి సంగతి లలిత వెంటనే మరిచిపోయింది. "మీరెక్కడికి పంపుతుంటారు? 'ఏషియన్'కా 'స్టార్'కా?" అని అడిగింది.

"ఉహూఁ, విదేశీ పత్రికలకు పంపాలని నా ఉద్దేశ్యం. అంత గొప్పకవిత్వం—దేశవాళీ పత్రికలవాళ్ళకి దాని విలువేం తెలుస్తుంది?"

లలిత ఆ మాటలకు ఉబ్బిపోయి—"అయితే మీరే ఏదో పత్రికకు పంపే ప్రయత్నం చెయ్యండి. ఎక్కడికయినా

సరే మీ యిష్టం. ఇవాళే పంపండి. రేపు 'ఎయిర్ మెయిల్'లో వెడుతుంది" అన్నది.

లలితను ఇంకా కాసేపు ఆపాలనే ఉద్దేశంతో "కొత్తగా ఏమయినా రాశావా!" అని అడిగాడు.

లలిత నవ్వుతూ "ఉహూం, అదేమంత చెప్పతగింది కాదు" అన్నది.

దత్తు ఎంతో ఆసక్తితో "చూపించలేదేం!" అన్నాడు.

"చెప్పానుగా—అదేమంత చూడతగిందికాదని!"

"అయినా చూడనీ. అదికూడా దీంతోపాటు పంపించేస్తాను" అంటూ లలితను వెంటపెట్టుకుని దత్తు ఆమె రీడింగ్ రూమ్‌లోకి వెళ్ళాడు,



భిల్లుక్‌ను వెంటతీసుకుని సాయంకాలానికి ముందే నిరంజనుడు షికారెళ్ళాడు. దారిలో "నువ్వు పొద్దున్నే వచ్చావుకాని రాత్రెందుకు రాలేదు!" అని గద్దించి అడిగాడు నిరంజనుడు భిల్లుక్‌ని.

"ఆ గుర్రంసంగతి మీకు తెలియదు భాయీ! బాబుగారి కోచ్ గుర్రం. కాస్త నీళ్ళలో తడిసినా దానికిజబ్బుచేస్తుంది. ఎన్ని ఇబ్బందులనీ!" నిరంజనుడు పరధ్యానంగా ఉన్నాడు. భిల్లుక్ చెప్పే మాటలు వినీవినిపించుకోకుండా ఉన్నాడు. "తర్వాతవచ్చిరాత్రి నేనుయింట్లోలేననిఅందరితో నాటుమటమూ వేశావా!" అన్నాడు. ఇది అన్యాయమైన టమటమా అని భిల్లుక్ అనుకోనలేదు. తలవనితలంపుగా వచ్చిన ఈ చీవాట్లకు అతడు కొంచెం అణిగిపడిఉన్నాడు. తర్వాత తన నేరాన్ని పోగొట్టుకోటానికి

"అది అన్యాయమూ భాయిజీ, నీకెంత ప్రతిష్ఠ! అమ్మాయి గారు వింటే-"

నిరంజనుడు చటుక్కున సీరియస్‌గా భిల్లుక్ అసమాప్త వాక్యాన్ని పట్టుకుని "ఊఁ, వింటే ఏమిటోయ్" అని అడిగాడు.

"నిజం చెబుతున్నాను భాయిజీ! నీసంగతి చెప్పగానే అమ్మాయిగారికి అశ్రువులు తొణికిసలాడాయి. 'చూడు భిల్లుక్! ఇది మానవధర్మం. అవసరమయితే నాతో చెప్పు, నేనుకూడా వెళ్ళి చూసివస్తాను' అన్నది నాతో."

ఇన్నిమాటలు లలిత చెప్పలేదు. ఆ సంగతులన్నీ విని సంతోషాన్ని మాత్రం ప్రకటించింది. భాయిజీ ప్రశంస వినే సరికి భిల్లుక్ ఆనందంతో పొంగిపోయాడు. ఆ ఆనందోత్సాహంలో ఈ అతిశయోక్తులు పలికాడు.

చంద్రనాథుడింటిదగ్గిర గందరగోళంగా ఉంది అప్పుడు నిరంజనుడు అది దూరంనుంచే విని అశుభ మేమయినా జరిగిందా అన్న భయంతో ఆగిపోయాడు. కాస్సేపు చెవిఒగ్గి విన్నాడు. కాని ఒక్కమాటకూడా స్పష్టంగా వినిపించలేదు. అప్పు డిహ మెల్లిగా చంద్రనాథుడియింటి మెల్లాలోకి వచ్చాడు. రాయిమణి నిరంజనుణ్ణి చూసి నాలిక కొరుక్కుని, ఇంట్లోకిపోయి దాక్కుంది. కాని చంద్రనాథుడు అప్పటికీ ఆ వచ్చిన వ్యక్తిని చూడలేదు. "పెట్టవా అమ్మాయ్! పెట్టకపోయావంటే ఇవాళ చట్టి పగులకొడతా. చూడు నువ్వు— ఓ! బాబుగారా! నమస్కారం!" అంటూ చంద్రనాథుడు చేతులుజోడించి నిరంజనుడికి నమస్కారం చేశాడు.

నిరంజనుడు నవ్వుతూ చట్టిపగలకొట్టి ఏం తింటావ్ చంద్రనాథ్?" అని అడిగాడు.

చంద్రనాథుడు నీళ్లు నములుతూ "ఏదో యింత సగ్గు జావ— అంతకన్న ఏం తాగుతాను బాబూ! రోగిష్టివాణ్ని ఇంకేం తింటాను?" అన్నాడు ఈ గందరగోళాని కంతకీ సగ్గు జావ కారణంకాదని నిరంజనుడు గ్రహించి "అపథ్యం చెయ్యకు చంద్రనాథ్! ముసిలివాడివి, ఈ వయస్సులో అపథ్యంచేస్తే చాలాకష్టం" అన్నాడు.

'బాబూ! ఇంకా ఈ స్థితిలో అపథ్యమా? అయిదేళ్ళ క్రితం బాబుగారు రెండుపళ్యాలన్నం, గిన్నెడు చేపలకూర తిన మని బలవంతంచేశారు అయ్యగారింటికి ప్రసాదంకోసమని వెళ్ళాను. అమ్మగారు ఎదురుగా కూర్చుని చంద్రనాథుడికి భోజనం పెట్టింది. అది తినమనీ, ఇదితినమనీ– ఒకటే బలవంతం. ఆహా! ఆ ఐశ్వర్యం, ఆ మన్నన ఏం చెప్పను బాబూ!"

దొరగారింట్లోని భోజన స్మృతి చంద్రనాథుని లొట్టలు వేసేట్లు చేసింది. అందుకనే ఆ వర్ణన. ఇంక అంతకన్న దూరం పోలేదు.

"అదృష్టముంటే మళ్ళీ చెయ్యొచ్చులే" అన్నాడు. నిరంజనుడు.

"అదృష్టమా! ఇంక లేదు బాబూ! ఆ దొరగారితో పాటే ఆ సుఖమూ పోయింది.

"ఇప్పుడున్నది చంద్రనాథుని దొరగారి పుత్రుడని నిరంజనుడికి తెలుసు. "మీ దొరగారు ఎందుకు పిలువ లేదు?" అని అడిగాడు.

"రెండుసార్లు పిలిచాను. మళ్ళీపిలవలేను" ఈ మాటల్లో ఏదో తీవ్రత ఉన్నట్లు నిరంజనుడికి తోచి "ఎందుకని?" అని అడిగాడు.

"దానికంతా చాలా గొడవ ఉంది బాబూ! బీదవాళ్ళ సంగతి ఎవరు వింటారు? మా దుఃఖాన్ని ఎవరు గ్రహిస్తారు? సానుభూతి చూపేవారు ఎవరూ లేరు." అంటూ చంద్రనాథుడు తల యెత్తి ఎదురుగా ఉన్న వ్యక్తిని చూసి ఆగిపోయాడు. నిరంజనుడూ తలయెత్తి చూశాడు. ద్వారబంధం పట్టుకుని రాయిమణి నిలబడిఉంది. ఆమె కళ్లు నిప్పులు కురుస్తున్నాయి.

"అదేమిటి మణీ! నీకేమయినా అస్వస్థతగా ఉందా? వణుకుతున్నావేం!" అని అడిగాడు నిరంజనుడు.

నిరంజనుడి ప్రశ్నకు రాయిమణి జవాబేమీ చెప్పలేదు. పైటచెంగు ముఖానికి అడ్డంచేసుకుని మెల్లాదాటి వీధివైపుకు వెళ్ళింది

నిరంజనుడు విస్మితుడై చంద్రనాథునికేసి చూశాడు. 'అది చాలా లజ్జాకరమైన సంగతి బాబుగారూ! ఆ సంగతి ముందుగా తెలిసిఉంటే పిల్లదాన్ని అసలు అక్కడికి పంపేవాడినా!" అన్నాడు చంద్రనాథుడు.

నిరంజనుడు వణికిపోయాడు. "ఆగు, ఆగు చంద్రనాథ్! ఇంక నాకు వినిపించవద్దు" అన్నాడు.

"కాదుబాబూ! వినండి. నేనూ కట్టెరోజులు బ్రతకనుయింక. మీకుతప్ప నామనస్సులోని బాధ ఇంకెవరికిచెప్పుకోను? విని ఎప్పటికయినా వీలయితే దానికి ఉచితమని తోచినట్లు

చెయ్యండి అమ్మాయి వెళ్ళిపోయిందిలెండి. అమ్మగారు పిల్ల దాన్ని ఎంతో అపేక్షగా చూసేది. తన కూతురికిలాగా దీనికి కూడా చదువూ అదీ నేర్పించింది. నేనేమీ అభ్యంతరం చెప్ప లేదు. ఒకరోజున సాయంకాలం అమ్మగారు నెల్లాళ్ళక్రితం బృందావనం వెళ్ళిందని విన్నాను. మనస్సుకేదో సందేహం తోచింది. తలపాగా చుట్టుకుని చేతికర్ర తీసుకుని అప్పుడే బైటికి వచ్చాను. దొరవారి యిల్లు మూసుకోనుంది. రాత్రి జాముప్రొద్దు పోయేసరికి వెళ్ళాను. బాబుగారు చేపల వేటకు వెళ్ళారని విన్నాను. వదనపూర్ కేసి పరుగెత్తాను అక్కడ దొరగారికి తోటా బంగళా, ఉన్నాయి. రాత్రి రెండు ఝాములప్పుడు బంగళాలోకి వెళ్ళగానే ఒక దాసీది ఎదురుగా వచ్చి నిలబడింది. దానినెత్తిన కర్రతో ఒక్కపెట్టుపెట్టి బంగళా వైపుకు పరుగెత్తాను.

నిరంజనుడు ఊపిరి బిగబట్టి "ఊ, తర్వాత?" అని అడిగాడు.

"తర్వాతనా బాబూ? మెల్లాలోనికి వచ్చేసరికి ఒక అమ్మాయి పరుగెత్తుకుంటూ రావటం దాని వెనకాల ఒకరు వెంటపడి రావటం కన్పించింది. చూడగానే గుర్తుపట్టాను. పిల్లదాన్ని గుండెకు హత్తుకుని దొరగారిమీద కర్ర ఎత్తాను. కాని కొట్టలేకపోయాను బాబూ! అమ్మగారు గుర్తుకొచ్చారు. పిల్లదాన్ని తీసికొని ఇంటికి తిరిగివచ్చేశాను. అంతావిన్నాను. తక్కువజాతిపిల్ల— పేదఇంటిపిల్ల— అయినా దాని మానాన్ని కాపాడి, డబ్బూవస్త్రం బంగారం అన్నీ కాలదన్నిపారేసి

తీసుకుని వచ్చాను. కాని నేనేకనుక వెళ్ళిపోయినట్లయితే ఏమయేది?"

నిరంజనుడు అతి ప్రశాంతంగా నిట్టూర్చాడు. చంద్రనాథుడి ప్రశ్న వినిపించుకోలేదు. 'మణీ!' అని బిగ్గరగా కేకేశాడు.

"అది ఇంకా మీ ఎదుటికి వస్తుందా బాబూ? ఇంటికి వచ్చాక జ్వరమూ, వికారమూ ప్రారంభమైనాయి. రాత్రింతా 'నా ఒంటిమీద చెయ్యేస్తున్నారు. నా ఒళ్ళు మంటలుపుడుతున్నాయి.' అని ఒకటే కేకలు. ఆ కేకలువింటే, బాబూ! మీకు తలతిరిగిపోయేది. దానికి కొంచెం కులాసాచిక్కి లేచి తిరగటం మొదలెట్టాక సిగ్గుతో మొవరితోనూ తలయెత్తి మాట్లాడేదికాదు. తర్వాత ఎంతనచ్చచెప్పి దాని మనస్సును మరల్చాననుకున్నారు.!"

నిరంజనుడు ఇంకేదో ఆలోచిస్తున్నాడు. అతడు మనస్సులో మరొక స్త్రీతో పోల్చి చూసుకుంటున్నాడు. నిరంజనుడికి మాటి మాటికి అశ్రువులు దొరలసాగాయి. అతడు వాటిని అణచుకోలేక చటుక్కున అక్కడనుంచి లేచాడు. "నేను వెడుతున్నాను చంద్రనాథ్! మణిని ఆశీర్వదించి వెడుతున్నానని చెప్పు." అని మళ్ళీ చంద్రనాథునికి మాట్లాడేందుకు ఏమీ అవకాశం ఇవ్వకుండా గబగబా బైటికి వచ్చేశాడు.

రాయిమణి బయట జామచెట్టుక్రిందనుంచునిఏడుస్తోంది. బోళావాడైన చంద్రనాథుడు ఆమె గతజీవితాన్ని నిరంజనుడి ముందు ఏమీ దాచకుండా చెప్పిఉంటాడని ఆమె గ్రహించింది.

సిగ్గుచే ఆమె శరీరమంతా కుంచుకుపోతోంది. దాంతో పాటే నిరంజనుడు చంద్రనాథుడు చెప్పిన మాటలు ఒకవేళ విశ్వసించకపోతే...! అన్న అనుమానంకూడా కలుగుతూంది మరింత సందేహిస్తే...! అలా అయితే... అలా అయితే ఏమవుతుంది? ఈ సందేహంరాగానే భయంతో ఆమె కొయ్యబారిపోయింది. సరిగ్గా ఈస్థితిలో వెనకాల అడుగుల చప్పుడు విని ఆమె ఉలిక్కిపడింది. నిరంజనుడు అని గ్రహించింది. వెనక్కి తిరిగితేముఖాముఖి ఎదురుపడాల్సివస్తుందన్న భయంతో ఇటుచూడనేలేదు!

రాయిమణి అక్కడ ఎందుకునుంచుందో తెలుసుకోటానికి నిరంజనుడికి ఎంతోసేపు పట్టలేదు. మణీ! అనిపిలిచాడు. అతడి మనస్సులోని ఆప్యాయత — ఆదరణ ఈ రెండుఅక్షరాల్లోంచి బైటికివచ్చింది. ఆ సంబోధన విని రాయిమణి వణికిపోయింది. కాని జవాబు చెప్పలేకపోయింది. నిరంజనుడు ఆమెకు దగ్గరగా జరిగి, రాయిమణితో "దుఃఖపడకుమణీ! బహుమతి పొందగలుగుతావు దీనికి బహుమతి లభించకపోతే భగవంతుడే లేడన్నమాట!" అని ఆమెతలమీద చెయ్యిపెట్టి ఆశీర్వదించబోయి మళ్ళీ చెయ్యివెనక్కితీసుకున్నాడు. తర్వాత అస్ఫుటంగా ఏదో ఆశీస్సుపలికి వెళ్ళిపోయాడు.

ఈసారి రాయిమణి వెనక్కితిరిగింది. పైటచెంగుతో కన్నీళ్ళు తుడుచుకుని వెళ్ళిపోతున్న నిరంజనుడికేసి చూస్తూ నుంచుంది. ఆమె భయమంతా నిరంజనుడి రెండుమాటలతో తొలగిపోయింది మనస్సులో లవలేశమైనా లజ్జకాని, క్షోభకాని ఏమీలేవు. నిరంజనుడు కనుచూపుమేరలోంచి దాటి

వెళ్ళిపోగానే మెల్లిగా రాయిమణి మెల్లోకివచ్చి, వెనక నుంచి చంద్రనాథుని శరీరం నిమురుతూ "ఏదీ! జ్వరం లేదే ఇప్పుడు" అన్నది.

చంద్రనాథుడు వెనక్కితిరిగి రాయిమణిలోని పరివర్తన గమనించి విస్మితుడై "ఇప్పటిదాకా ఎక్కడున్నావ్ మణీ!" అని అడిగాడు.

"అదిగో అక్కడ!" అని వేలితో ఆకాశంకేసి చూపుతూ నవ్వుతూ దీపం తీసుకురావటానికి ఇంట్లోకి వెళ్ళింది.

నిరంజనుడు సందేహించలేదు. ఆప్యాయంగా పల్కరించాడు- ఆశీర్వదించాడు. ఈఆనందంతో రాయిమణిమనస్సు నిండిపోయింది. ఆమెమాటల్లో- చేతల్లో ఈ ఆనందం వ్యక్తమవుతూనేఉంది. చంద్రనాథుడు ఈ ఆనందానికి కారణం ఏమిటో గ్రహించలేకపోయాడు. కాని మనస్సులో చాలా ధైర్యంతెచ్చుకుని అతడు మెల్లిగా— "అయితే మణీ! రాత్రికి వేడి వేడి మెతుకులు రెండు—"

రాయిమణి బిగ్గరగా నవ్వుతూ "అసలుసంగతి మరిపిస్తున్నావా నాన్నా? రెండుమెతుకులు తిందువుగానిలే. కాని నెయ్యివెయ్యమంటే మాత్రం వెయ్యను, చెబుతున్నా" అన్నది.

చంద్రనాథుడు వెంటనే "ఉహూ. నెయ్యివేసుకుంటే మళ్ళీ జ్వరంవస్తుంది. అయినా ఒక్కబొట్టుమాత్రం వెయ్యి అమ్మా!" అన్నాడు.

రాయిమణి నవ్వుతూ తల ఊగించింది.

# ౧౦

నిరంజనుడు రాత్రి బంగళాకు తిరిగివచ్చేసరికి ఝాము పొద్దుపోయింది. ఇంత ఆలస్యం అవటానికి కారణం ఉంది. దాదాపు రెండుగంటలనుంచి అతడు నదిఒడ్డున రాయిమీద విగతజీవితాన్ని గురించి ఆలోచిస్తూ కూర్చున్నాడు. దానితో పాటు సుధవిషయంకూడా జ్ఞాపకం వచ్చింది. చాలా సేపు ఆలోచించి, చాలా కన్నీరు కార్చి- అతడు తిరిగివచ్చాడు. గేటు దగ్గిర భిల్లుక్ తన భాయిజీ కోసమనే ఎదురుచూస్తూ నుంచుని ఉన్నాడు. నిరంజనుణ్ణి చూడగానే "ఏం భాయిజీ! ఇంతఆల స్యం అయిందేం?" అని అడిగాడు. "అక్కడ అవతలఒడ్డున ఉన్నాను." అని ముక్తసరిగా చెప్పాడు నిరంజనుడు. "చంద్రి నాథుడి కబుర్లవలలో చిక్కుకున్నావల్లే ఉందే. ఎలాఉన్నాడు ముసిలాడు?" అని అడిగాడు భిల్లుక్. "బాగానే ఉన్నాడు" అని చెప్పి తనగదివైపుకు నడిచాడు. భిల్లుక్ భయపడుతూ "అటు వెళ్ళకు భాయిజీ, సాయంకాలం అక్కడ ఒకపాము కన్పిం చింది. త్రాచుపాము. కాస్త దీపం తీసుకురానియ్" అన్నాడు. "దీపమేమీ అక్కర్లేదులే భిల్లుక్! నువ్వు వెళ్ళు" అన్నాడు నిరంజనుడు. "సరే, అయితే పద. నీతో కూడ నేనూవస్తున్నా" అంటూ భిల్లుక్ నిరంజనుడివెంట నడిచాడు.

నిరంజనుడు ఏకాంతంగా కూర్చుని ఆలోచించుకోవా లని అనుకుంటున్నాడు. గదిలోకి రాగానే భిల్లుక్‌ను పంపించేసి అతడు మంచంమీద పడుకున్నాడు. సుధ లేచిపోవటం విష

యమై తాను ఏదైతే విన్నాడో అది బహుశా నిజంకాక పోయినా కావొచ్చునని ఇవాళనే మొదటగా అనిపించింది అతడికి. చాలావిధాల ఆలోచించి నిరంజనుడు ఏ నిశ్చయానికి రాలేకపోయాడు. ఆలోచించి ఆలోచించి అలసిపోయి నిరంజనుడు నిద్రపోయాడు.



ఆరోజున ఆదివారం. మామూలుగా మొదటినుంచీ ఉన్న అలవాటునుబట్టి రావుసాహెబ్ గారింటికి పసుచు వారి ష్లరు అతిథులుగా వచ్చారు. నిరంజనుడూ భిల్లుక్ ఇద్దరూ చీకటితోనే గాలాలు చేతపట్టుకుని చేపలు పట్టటానికని బయలు దేరిపోయారు. భిల్లుక్ చేపల్నిపట్టే ప్రయత్నంలో ఉన్నాడు. నిరంజనుడు మధ్యాహ్నం ఫలహారం తయారుచేసుకునే ప్రయత్నంలో ఉన్నాడు.

ఈలోపుగా భిల్లుక్ ఒక్కదమ్ము హుక్కా పీల్చాలనే ఆశతో చంద్రనాథ్ యింటికి వెళ్ళాడు. అక్కడినుంచి "ఒక్క మాట భాయిజీ" అన్నాడు

"చెప్పు"

"చంద్రనాథ్ చెప్పాడు—వాళ్ళమెల్లాంగో ప్రత్యేకం కుంపటిమీద ఏమయినా చేసుకుంటే చేసుకోవచ్చు"

"నీకు చంద్రనాథ్ కన్పించాడా?"

"అక్కడినుంచే వస్తున్నా యిప్పుడు."

"అత డెలా ఉన్నాడు?"

"నిన్నరాత్రి భోజనం చేసిందగ్గిర్నుంచీ ఆ తలనొప్పి రావటం తగ్గిందని చెప్పాడు"

"మంచిది."

భిల్లుక్ ఇంక ఉండపట్టలేక "తర్వాత చంద్రనాథ్ ఏమని చెప్పాడంటే—"

"అవసరంలేదు భిల్లుక్! అనవసరంగా ఒక్టి హంగామా" రోజల్లా ఏదో చిరుతిండి తని ఉండటం భిల్లుక్‌కు యిష్టంలేదు. పైగా తగిన ఏర్పాట్లన్నీ ఉన్నాయి. "హంగామా ఏంలేదు భాయీ! చటుక్కున నువ్వు కుంపటిమీద రెండు మెతుకులు వండేస్తే-"

"పాపం! ఒక్టి బీదవాడు. మనమూలంగా ఓపావలా బియ్యం - అవీ వృధాగా ఖర్చుఅవుతాయి భిల్లుక్."

"ఖర్చేమీ లేదు, భాయిజీ! బియ్యం, ఉప్పూ, పప్పూ అన్నీ ఉన్నాయి. ఒక్క కానికూడా ఖర్చవదు!"

నిరంజనుడు పరధ్యానంగా 'మంచిది' అన్నాడు.

ఆమాటవిని భిల్లుక్ సంతోషంతో "మంజూ రయి నట్లేనా!" అన్నాడు.

వెనకాల మూడోవ్యక్తి ఉన్నట్లు నిరంజనుడు గ్రహించాడు. రాయిమణి మామిడిచెట్టుప్రక్కనుంచి నవ్వుతూ వెళ్ళిపోతూఉండటం చూశాడు. ఆమె భిల్లుక్‌ద్వారా తన ప్రార్థనను తెలియచేసి, జవాబుకోసం ఇప్పటిదాకా ఎదురు చూచి వెడుతున్నదని నిరంజనుడు గ్రహించాడు. భిల్లుక్‌కేసి చూసి, "నువ్వు ఇదంతా చేస్తున్నావు.అనవసరంగా ఆ అమ్మాయికి శ్రమయిస్తున్నావ్?" అన్నాడు.

"కష్టమా? నువ్వుకాదంటే ఆమెకు నిజంగా చాలా కష్టమే కలుగుతుంది. నువ్వు భోజనం చెయ్యకుండా వచ్చా

వని వినగానే ఆమె నా చెయ్యిపుచ్చుకుని 'మాయింట్లో వంట చేసుకోవచ్చు' అన్నది. నేను భాయిజీకి చెప్పిచూస్తానన్నాను. 'వద్దు అనేట్లయితే నేను ఈ రోజల్లా ఉపోషముంటా' నన్నది. తెలుసా? ఆ పిల్లదాని చేత ఉపోషం చేయించటం మంచిదా భాయిజీ?"

"కానీ, నువ్వు కేవలం భోజనప్రియుడివని తెలుసుకున్నాను" అన్నాడు నిరంజనుడు.

భిల్లుక్ నవ్వుకున్నాడు.

నిరంజనుడు గాలంవేసి, ఆకాశంకేసి చూస్తూ "ఇవాళ చేపలుతిందాం భిల్లుక్‌దా! నువ్వు దుకాణానికిపోయి, కావలసిన సామానులన్నీ తీసుకురా" అన్నాడు.

భిల్లుక్ వెళ్ళిపోయాడు.

రావుసాహెబ్ గారి అతిథివర్గం పక్షులను వేటాడటానికి బయలుదేరింది. తుపాకి ధ్వనులకు పక్షులన్నీ భయపడి చేసే ఆర్తనాదంతో రోదసిఅంతా మారుమోగుతోంది. ప్రశాంత మనోహరమైన ఈ శరత్కాలపు ప్రభాతవేళ, నిర్మేఘంగా ఉన్న ఆకాశం- అవిరళమైన ఈ నదీ తరంగధ్వనుల అవ్యక్త మధుర సంగీతంతో మరణభీతితో పక్షులుచేస్తున్న ఆర్తనాదంకు ఏమాత్రం సామంజస్యం కుదరకుండా ఉంది. నిరంజనుడికి లోపల్లోపల చికాకుగానేఉంది.

ఇలాంటి సమయంలో మళ్ళీ ఎక్కడో తుపాకిమోత వినిపించింది. దానితోపాటే దూరంగా ఏదో ఆర్తనాదంలా కూడా వినిపించింది నిరంజనుడు అక్కడినుంచి లేవబోతున్నాడు. లేచి ఒక్కఅడుగు ముందుకు వేశాడోలేదో ఎవరో

గబగబా వస్తున్నట్లు అడుగుల చప్పుడు వినిపించింది. చూసే సరికి రాయిమణి పరుగెత్తుకుని వస్తూంది. భయంతో ఆమె ముఖం వెలవెలపోతోంది. పైట తొలగిపోయింది. క్రిందకుజారి పోతున్న చీరెచెంగు ఎడంచేత పట్టుకుని పరుగెత్తుకువస్తోంది. నిరంజనుడు "మణీ! మణీ! ఏంజరిగింది?" అని ఆదుర్దాగా ప్రశ్నించాడు. రాయిమణి పెదవులురెండూ కదిలాయి. కాని ఆమె ఏమిచెబుతున్నదీ వినబడలేదు. నిరంజనుడు కూడా పరుగెత్తుకువస్తున్నాడు. అతడు రెండోసారి ప్రశ్నించే లోపుగానే రాయిమణి పరుగెత్తుకువచ్చి అతణ్ణి కావిలించు కుంది. ఆమె శరీరమంతా వణుకుతున్నది. చెమటలు కారుతు న్నాయి. చీరె అంతా బురదఅయింది అంచు చిరిగిపోయింది.

"ఏమిజరిగింది మణీ?" అని నిరంజనుడు మళ్ళీ అడి గాడు. రాయిమణి అప్పటికే వణకిపోతోంది. మాట్లాడలేక పోయింది. చటుక్కున క్రింద రక్తంచూసి, నిరంజనుడు కాలి కేసి చూశాడు. కాలి మడమలోంచి రక్తం స్రవిస్తూఉంది. ఆదెబ్బ తగిలినచోట చెయ్యిపెట్టగానే 'అబ్బా!' అంది రాయిమణి. కాలు వెనక్కిలాక్కుని దభీమని చటుక్కున క్రింద చతికిల పడింది.

భయపడుతున్న నిరంజనుడు మళ్ళీ "ఇలా అయింది ఎంచేత మణీ! ఏంజరిగింది? ఈరక్తమేమిటి!" అని అడిగాడు.

రాయిమణి సంక్షిప్తంగా తుపాకి' అన్నది. ఆమాటవిని నిరంజనుడు భయపడి రాయిమణికాళ్ళదగ్గిర మోకాలు క్రింద ఆనించి కూర్చుని "ఏదీ? చూడనీ" అన్నాడు. రాయిమణి

క్రిందిపెదిమ పంటితో బిగబట్టి, మళ్లీ కాలు వెనక్కి లాక్కొని "వద్దు" అన్నది.

నిరంజనుడికి కోపంవచ్చింది. "ఏమిటీ కుర్రతనం? కాలు చూడకపోతే ఎలా తెలుస్తుంది?" అని రాయిమణి ముఖంకేసి చూసేసరికి ఆమెకళ్ళు మూతలుపడిఉన్నాయి. అది అలసటతోవచ్చిన మూర్ఛఅని అతడు గ్రహించాడు. అప్పుడతడు దెబ్బతగిలినచోటు సరిగ్గా చూశాడు. ఒక తుపాకి గుండు ఆమె మడమలోంచి దూసుకుపోయింది. ప్రమాద కరమైన గాయంమాత్రం కాదు జేబురుమాలు ఆ గాయం మీదకట్టి, దాన్ని నీళ్ళతోతడిపి, తనచొక్కావిప్పి ఆమెకు తలక్రింద మెత్తుగాపెట్టి నుదుటిమీద నీళ్ళుకొట్టాడు.

ఈస్థితిలో రావుసాహెబ్ గారి అతిథి కొత్తబారిష్టరు మిష్టర్ సేన్ గబగబా వచ్చాడక్కడికి. అతడు నిరంజనుణ్ని ఎరుగు. "చూడండి, ఓపెద్ద 'యాక్సిడెంట్' జరిగింది. ఈ అమ్మాయి—"

నిరంజనుడు ఆమాటకు అడ్డునచ్చి "మరేం దిగులు పడకండి. పెద్దదెబ్బ తగల్లేదు. గుండు దూసుకుపోయింది అంతే—" అన్నాడు.

'మీరు ఈమెను ఎరుగుదురా?"

"బాగా ఎరుగుదును... భయమేమీలేదు."

"చూడండీ, నాకు చాలా విచారంగా ఉంది. నాజీవితంలో ఇలా యెన్నడూ జరగలేదు. ఏదైనా 'మెడికల్ఎయిడ్' అవసరమైతే చెప్పండి. నేను ఆవైపుకువెళ్ళి పంపిస్తాను" నిరంజనుడు ఆయన్నికొంచెం అనునయించి "ఏం అవసరంలేదు.

మీరు వెళ్ళండి. అవసరమయితే బంగళాకు కబురుచేస్తాను" అన్నాడు. అప్పటికి మిష్టర్ సేన్ ఇంకా అలాగే నించుని ఉన్నాడు. అస్తవ్యస్తంగా చీరెకట్టుకుని పడిపోయిఉన్న రాయి మణి ఎదుట అలా ఒక అపరిచితవ్యక్తి నిలబడి ఉండటం ఆమె మర్యాదకు భంగకరమని తోచింది నిరంజనుడికి. "వెళ్ళండి మీరు. హఠాత్తుగా లేచి మిమ్మల్ని చూడిందంటే భయపడు తుంది" అన్నాడు నిరంజనుడు మళ్ళీ. 'సరే' అంటూ సేన్ వెన క్కితిరిగాడు కాని కాస్తదూరం ముందుకువెళ్ళి మళ్ళీతిరిగివచ్చి, "నాకు చాలా బెంగగా ఉంటుంది. ఎలాఉన్నదీ మళ్ళీవెంటనే తెలియచేస్తారుగదూ!" అన్నాడు.

"అలాగే" అంటూ నిరంజనుడు నీళ్ళు తీసుకురానటా నికి లేచాడు.

దూరంగా పూపొదరింటే చాటునుంచి ఒకవ్యక్తి ఈ వ్యవహారమంతా చూశాడు. ఆయన మిష్టర్ దత్తు. ఏదైనా కేసుపెట్టినా పెడతారేమో! ఇదీ అతడి భయం. మిష్టర్ సేన్ వెంటఉంటే తాను సాక్ష్యం ఇవ్వాల్సివస్తుందేమో అన్న భయంతో అతడు దాక్కుని చూచాడు. నిరంజనుడ్ని మరో దెబ్బకొట్టటానికి ఏదో ఉపాయం ఒకటి మనస్సులో నిశ్చ యించుకుని తనలోతాను నవ్వుకున్నాడు. దెబ్బతిన్న స్త్రీ విషయం ఆతడికి జ్ఞాపకంరాలేదు.

కొంతసేపు ముఖాన నీళ్ళుకొట్టినా రాయిమణికి స్పృహ రాకపోయేసరికి, నిరంజనుడు ప్రమాదంగా భావిం చాడు. ఆ ఉత్తేజన అణగిపోయాక మనస్సు మామూలు స్థితి లోకి వచ్చాక రాయిమణిదగ్గిర ఒంటరిగా ఉండటం అతడికి

ప్రశాంతంగా లేదు. భిల్లుక్ కోసము ఒకసారి నాలుగువైపు లా చూశాడు. ఆ రేవుకు సాధారణంగా ఎవరూ రారు. అక్కడికి రావటం అలవాటున్నవాళ్లు ఏ ఒకరో యిద్దరో ఉంటే వాళ్ళుకూడా ఆదివారం వచ్చిందంటే—రావుసాహెబ్ గారి అతిథులు రావటం అలవాటుంది కనుక — వాళ్ళుకూడా సూర్యోదయం కాకమునుపే స్నానం అవీ పూర్తిచేసుకుని వెళ్ళిపోతారు. కనుక మూర్ఛితురాలైన రాయిమణిని ఎవరికైనా అప్పగించి తానుపోయి చంద్రనాథ్‌తో చెప్పివద్దామని అనుకోటానికైనా అవకాశం లేకుండాఉంది. అదీగాక అతడు రాయిమణి ముఖాన కొట్టిననీళ్ళు ప్రవాహంలా అయినాయి. ఆమెజుట్టు అంతా బురదలోపడిఉంది. నిరంజనుడు ఒక్కక్షణం ఆలోచించాడు. రాయిమణి తల చేత్తో ఎత్తిపట్టుకుని అటుకేసి తిరిగి కళ్లుమూసుకుని ఆలోచనలోపడ్డాడు.

ఈ స్థితిలో భిల్లుక్ వచ్చి కొయ్యబారినట్లు నిలబడిపోయాడు. తరువాత భయపడుతూ 'భాయిజీ! ఏం జరిగింది?' అని అడిగాడు.

నిరంజనుడు కళ్ళుతెరచి భిల్లుక్‌ను చూచి బ్రతికిపోయాడు. "ఇదుగో, నువ్వు కాస్త తల ఇలా ఎత్తిపట్టుకుని కూర్చో భిల్లుక్ దా!" అన్నాడు.

రాయిమణికి అప్పుడే కొంచెం తెలివి వచ్చింది. ఈ మాట చెవినిపడి ఆమె హఠాత్తుగా కొంచెం తలయెత్తి "ఉహూం. ఎవరూ ఎత్తిపట్టుకో నక్కర్లేదు. నడిచి రాగలను" అన్నది. ఆమె కంఠస్వరంలో కొంచెం కఠినత్వం ఉంది. కాని

నిరంజనుడు అది గ్రహించలేదు. "ఉహూం. రాలేవు. భిల్లుక్ బుజాలమీద భారంమోపి లే" అన్నాడు నిరంజనుడు.

లేవబోతుండగా రాయిమణిదృష్టి కాలికి కట్టిన కట్టుమీదపడింది. కళ్ళనిండా నీళ్ళు తెచ్చుకుని ఆమె నిరంజనుడి ముఖంకేసిచూసింది. అతడికాళ్ళకోసం చేత్తో తడిమింది. నిరంజనుడు ఆమె ఉద్దేశం గ్రహించి కాళ్ళు వెనక్కిలాక్కున్నాడు. ఇంక రాయిమణికి ఏడుపు ఆగలేదు ఆమె నోటికి గుడ్డ అడ్డంపెట్టుకుని వెక్కి వెక్కి ఏడ్చింది. ఇంక తప్పనిసరి అయి నిరంజనుడు 'ఊం తీసుకో. నీకు కావలసినంత పాదధూళి తీసుకో—"అని అంటూఉండగానే రాయిమణి గళవస్త్రయై అతడి పాదాలమీద శిరస్సు మోకరించింది. అతడి పాదధూళి యావత్తు తన శిరస్సున రాచుకుని, భిల్లుక్ చెయ్యి పట్టుకుని లేచి నుంచుంది.

రాయిమణిని ఇంటికి తీసుకునివచ్చి, ఏడుస్తున్న చంద్రనాథుని అభయవాక్యాలతో ఓదార్చి "నే నివ్వాళ వెడుతున్నాను చంద్రనాథ్! సాయంకాలం మందు పంపుతాను. ఆ మందువేసి కట్టు కట్టు. రెండురోజులలో నయమైపోతుంది" అన్నాడు నిరంజనుడు. ఇంతలో రాయిమణి చంద్రనాథుని లోపలకు పిలిచింది. చంద్రనాథ్ లోపలకువెళ్ళి మళ్ళీ బైటకు వచ్చి, బయలుదేరబోతున్న నిరంజనుడిపెరటికి వచ్చి, చేతులు జోడించి "బాబుగారూ! చెప్పటానికి సాహసించలేకపోతున్నాను. అయినా ఇప్పట్టే వేళ మించగలేదు కావలసిన సామగ్రి అంతా ఉంది. కుంపటి వెలిగించటం ఎంతో సేపు పట్టదు' అని అంటున్నది అమ్మాయి" అన్నాడు.

ఈ ఆకస్మిక దుస్సంఘటనలో నిరంజనుడి ఆకలి ఎగిరి చక్కాపోయింది. "అది మరో రోజున చూచుకోవచ్చులే చంద్రనాథ్! ఇవాళ ఇంక ఊరికే హంగామా పెంచకు" అన్నాడు.

"గొల్లవాళ్ళ ఇంటిదగ్గిరనుంచి తెచ్చిన తాజా వెన్న ఉంది. అది ఆకులోపెట్టి దానిమీద గుడ్డబిగించి ఒళ్ళోపెట్టుకుని రావటంవల్ల దానికేమీ బురద అంటలేదని చెపుతోంది అమ్మాయి—"

ఈ అతిథికి ఆ గొల్లయింటినుంచి వెన్న తీసుకువద్దామని వెళ్ళటంవల్లనే ఆమెకీ దుర్గతి సంభవించిందని నిరంజనుడు ఒక్క నిమిషంలో గ్రహించాడు. నిరంజనుడు సాభిప్రాయంగా భిల్లుక్ కేసి చూశాడు. భిల్లుక్ అదిగ్రహించి తెల్లబోయాడు. మాట్లాడలేదు

"నీకు తెలియదు చంద్రనాథ్! అనవసరంగా ఆమెకు పని అధికమవుతుంది. ఊరికే అటూ యిటూ తిరిగితే బాధ ఎక్కువవుతుంది. చివరకు ప్రమాదం" అన్నాడు నిరంజనుడు.

ఆ అమ్మాయి ప్రార్థన అతడి చెవిని పడేయటంతప్ప చంద్రనాథుడికి వేరే ఆవేదన ఏమీలేదు. అతడు మెదలకుండా ఊరుకున్నాడింక.

ఇంతలో "నాన్నా!" అని పిలిచింది రాయిమణి.

చంద్రనాథ్ వెనక్కితిరిగాడు. నిరంజనుడుకూడా అటుకేసి తిరిగిచూచాడు. రాయిమణి బైటికివచ్చి ద్వారబంధం పట్టుకుని నిలబడివుంది. అశ్రుపూరితాలైన ఆమె నేత్రాలు ఏదో ప్రార్థనను తెలియచేస్తున్నాయి.

నిరంజనుడు ఆ మూగనివేదనను అర్థంచేసుకున్నాడు. కాస్సేపు నిశ్శబ్దంగా ఊరుకుని "నువ్వు అన్నీ సిద్ధంచేయి భిల్లుక్ దా! నేను కుంపటి వెలిగిస్తాను" అనిచెప్పి గాలంతీసుకు రావటానికి రేవులోకి వెళ్ళాడు.

రాయిమణి కళ్ళుతుడుచుకుని, ప్రసన్నంగాఉన్న భిల్లుక్ కేసిచూసి నవ్వింది—అది సగర్వంగా నవ్విననవ్వు.

౧౧

నిరంజనుడు తిరిగివచ్చేటప్పటికి చీకటిపడుతూ పడుతూ ఉంది. గేటులోకి రాగానే రావుసాహెబ్‌గారు తన కోసం అప్పుడే మూడుసార్లు వెతుక్కున్నారని తెలిసింది. ఆమాటవిని బురదగావున్న చొక్కావిప్పి చిలక్కొయ్యనున్న చొక్కాతొడుక్కుని సరాసరి డ్రాయింగ్‌రూంకేసి వెళ్ళాడు.

ఆదివారంనాడు మామూలుగా కలకలలాడుతూ ఉన్నట్లుగా ఆనాడు డ్రాయింగ్‌రూం కలకల్లాడటంలేదు. మిష్టర్ సేన్ ఏదో అపరాధంచేసినవాడిలాగా ఒకమూల కూర్చుని ఉన్నాడు. అతడిప్రక్కనే రావుసాహెబ్‌గారు ఏదో తాపీగా మాట్లాడుతూ కూర్చుని ఉన్నాడు. మిష్టర్ దత్తు లలితప్రక్కన కూర్చుని మిష్టర్ సేన్ రాయిమణిని చూడటానికి వెళ్ళి ఎంత అవివేకాన్ని వ్యక్తంచేశాడో ఆమెకు వివరిస్తున్నాడు. ఆ ప్రక్కనవున్న మూడుకుర్చీలూ దగ్గిరగా లాక్కుని ముగ్గురు అతిథులు కూర్చుని,ఇవాళ జరిగినసంఘటన 'పీనల్‌కోడ్'' జర్మన్

యాక్టులలో ఏ 'శెక్షన్'క్రిందికి వస్తుందో అన్నది లా పుస్త కాల్లో తిరగేస్తున్నారు.

ఈస్థితిలో నిరంజనుడు గదిలోకివచ్చాడు. సేన్ ఉత్సాహంతో 'అదిగో వచ్చారు!" అన్నాడు. నిరంజనుడు ఆమాట వినిపించుకోకుండా రావుసాహెబ్ గారిదగ్గిరకువచ్చి "నన్ను పిలిచారా?" అని అడిగాడు.

"ఆఁ, నీకు తెలుసా ఇవాళజరిగిన సంగతి?"

"చిత్తం, తెలుసు నే నక్కడే ఉన్నాను."

"ఆ అమ్మాయి ఎలాఉందీ ఇప్పుడు?"

ఆ ప్రశ్నకు సమాధానం ఏంచెబుతాడో అని అందరు చెవులు రిక్కించుకుని చూస్తున్నారు. "కొంచెం నింపాదిగానే ఉన్నట్లు కనిపించింది." అన్నాడు నిరంజనుడు.

"నువ్వు వచ్చి ఎంతసేపయింది?"

"ఇదే రావటం. సరాసరి అక్కడినుంచే వస్తున్నాను."

"ఈ వ్యవహారం కోర్టుదాకా పోకుండాచూడు కాస్త"

"చిత్తం. అంతవరకూ పోదు"

"అయినా కనిపెట్టిఉండు. ఆవైపున ఉన్నవాళ్ళు అంత సరియైనవాళ్ళుకారు. నీకు కుర్రతనం, తెలియదు. పోలీసుల వరకూ పోలేదుకదా?'

"ఉహుఁ. ఇతడు వారిలోవాడే, ఇతడికి తెలియకుండా వాళ్ళు కేసుపెట్టరు" అన్నాడు దత్తు.

ఆ మాటలో ఉన్న శ్లేష నిరంజనుడు గ్రహించాడు.

"నిజమే. వాళ్ళంతా నీ మనుష్యులే. అంచేత భయమేమీలేదు. అయినా ప్రొద్దున్నే ఒకసారి వెళ్ళిరా. అన్ని

సంగతులూ విశదంగా తెలుసుకువచ్చి చెప్పు. చికిత్సకోసం కాని, మరింకా ఏదైనా డబ్బు అవసరంఅయితే అందుకుకాని దిగులుపడనక్కరలేదు"

నిరంజనుడు కొంచెం తొట్రుపడుతూ "నేను వెళ్ళటం అవసరమంటారా? వాళ్ళు అలాంటివాళ్ళుకారు— కేసూ అదీ హడావుడి ఏమీ చెయ్యరు. అయినా మీరు —" అన్నాడు.

రావుసాహెబ్ ఆమాటకు అడ్డువచ్చి, "ఊహూఁ. వెళ్ళాల్సిందే ఆ వైపునఉన్న పల్లెవాళ్ళందరికీ ఒక సంఘం ఉంది. నేనంటే వాళ్లు అంత యిష్టంగాకూడఉండరు. నీ దగ్గర ఒకమాట చెప్పి పంపి, రాత్రి వాళ్లంతా కూర్చుని ఆ ఉద్దేశం మార్చుకొని ఉండొచ్చు. నువ్వు వెళ్ళాలిందే" అన్నాడు.

"చిత్తం, అలాగే' అని నిరంజనుడు వెళ్ళిపోయాడు. తర్వాత రాయిమణిగాయానికి ఏదో మందు భిల్లుక్ చేతికిచ్చి పంపి, తనగదిలోకివచ్చి కూర్చున్నాడు.

రాత్రి నిరంజనుడికి సరీగ్గా నిద్రపట్టలేదు. ఆరోజున జరిగిన సంఘటన యావత్తూ మనస్సును కల్లోలపరచసాగింది. పగలంతా పనిలో మునిగి తేలుతూ ఉండటంచే అప్పుడతణ్ని ఆ సంఘటన అంతగా చలింపనీయలేదు. రాత్రి విశ్రాంతిగా ఒంటరిగా కూర్చుని ఉండేసరికి అదే మనస్సును అన్నివైపుల నుంచీ పీడించసాగింది. రాయిమణి పతివ్రతన- కల్లాకపటం ఎరగని ఆ స్వభావం- ఆప్యాయంగా మాట్లాడే ఆ తీరు- ఆ స్నిగ్ధకరుణదృష్టి-అతడి హృదయాన్నంతసీ ఆవరించాయి. అది తలుచుకున్నకొద్దీ నిరంజనుడికి ఆశ్చర్యంవేయసాగింది.

నిరంజనుడు రాయిమణిని మామూలు దృష్టితోనే చూశాడు. కాని ఏ సందర్భంలో ఆమె శారీరకశోభ నిరంజనుడి మనస్సును వశంచేసుకుందో- అది అతడు తెలుసుకోలేక పోయాడు. తన దౌర్బల్యానికి తనలోతానే భయపడ్డాడు. అనేకవిధాల అతడు మనస్సును నిగ్రహించుకోటానికి ప్రయత్నించాడు. అతడికి మెళుకువ వచ్చేసరికి తూర్పు తెలతెల వారుతోంది.

క్రితంరాత్రి యజమానియిచ్చిన ఆదేశం గుర్తుకువచ్చి అతడు బైటికివచ్చాడు. ఒంటరిగా వెళ్ళతలచుకోక భిల్లుక్ కోసం వెళ్ళాడు. అతడప్పటికింకా నిద్రపోతూనే ఉన్నాడు. రాత్రి భిల్లుక్ ఏమూడింటికోవచ్చి పడుకున్నాడని విని, అతడికి నిద్రాభంగం కలిగించకుండా ఒంటరిగానే వెళ్ళిపోయాడు. వెళ్ళేప్పుడు ఏదో అవసరమైనపనిఉండి అవతలిబడ్డుకు వెడుతున్నాననీ, యజమానికనుక అడిగితే ఈసంగతి చెప్పమనీ దర్వాన్‌తో చెప్పి వెళ్ళాడు

మెల్లాలోకి వచ్చి 'చంద్రనాథ్!' అని కేకేశాడు నిరంజనుడు. ఎవ్వరూ పలకలేదు. అతడు నిద్రపోతున్నాడు కాబోలు ననుకుని "మణీ!" అని కేకేశాడు మళ్ళీ. ఈసారీ జవాబు రాలేదు. అప్పుడే సూర్యోదయం అవుతోంది. అప్పటి వరకూ నిద్రపోవటం తండ్రీ కూతురు—ఇద్దరికీ అలవాటులేదని నిరంజనుడికి తెలుసు. కాస్సేపు ఆగి మళ్ళీ వసారలోకివచ్చి చంద్రనాథ్‌ను పిలిచాడు. సమాధానం రాలేదు; కాని ఏదో ధ్వని వినిపించి ఉలిక్కిపడ్డాడు. ఇంట్లో యెవరో ఏడుస్తున్నట్లున్నారు. అతడు కాస్సేపు వెనకాముందాడి ఇంట్లోకి వెళ్లాడు.

రాయిమణి పక్కమీద ఏడుస్తూ కూర్చునిఉండటం చూసి నిరంజనుడు తెల్లబోయాడు. "మణీ!" అని పిలిచాడు. రాయిమణి ముఖం పైకెత్తింది ఆమె కళ్లు ఎర్రగా ఉన్నాయి. చూపు అస్వాభావికంగా ఉంది. నిరంజనుడికి ఆ విషయం ఏమిటో బోధపడలేదు. దగ్గరకువచ్చి ఆమెనుదుటిమీదచెయ్యివేసిచూశాడు. జ్వరం తీవ్రంగాఉంది. నిరంజనుడు ఆమెను బలవంతానపడుకోపెట్టి తడిగుడ్డతో ముఖం తుడువసాగాడు. కొంతసేపటికి ఆ కళ్ళలోని ఎరుపు కొంచెం తగ్గింది. రాయిమణి కళ్ళు మూసుకుని మూలుగుతోంది.

రోగిని ఒంటరిగా విడిచివెళ్ళటం అసంభవం. కాని ఆమెదగ్గర ఒంటరిగాకూర్చుని ఉండటానికికూడా అతడికి ధైర్యం చాలటంలేదు. నిరంజనుడు చంద్రనాథునిజాడ తెలుసుకోవటానికి బయటికివచ్చాడు. జామచెట్టుక్రిందికి వచ్చి నాలుగు వైపులా చూశాడు. ఎక్కడా చంద్రనాథుడి జాడేచప్పుడూ లేదు. అప్పుడిహ లోపలికివచ్చి రాయిమణి తలాపిదిక్కున ఒక పెట్టెమీద కూర్చుని ఆమెకు విసరటం మొదలెట్టాడు.

చటుక్కున రాయిమణి లేచికూర్చుని "ఛీ! ఛీ! నాకాళ్ళమీద చెయ్యి వెయ్యకండి" అని అరిచింది.

నిరంజనుడి గుండె హడలిపోయింది. నిన్నటి ఆ అవ్యక్త ఆవేదనే. కాని ఆసంగతులన్నీ ఆలోచించేందుకు అవకాశంలేదు. జ్వరం సామాన్యమయిందికాదు— ప్లీహావ్యాధికూడా ప్రారంభమయ్యేట్లుగా ఉంది. ఈమాటనువట్టిచూస్తే... గాలిదూరని ఆ యింట్లో ఈమెను ఉంచితే ఈ వ్యాధిని నయంచేయటం కూడా కష్టమే. బైటవసారాలో చాపవేసి రాయిమణిని

ఎత్తుకునివచ్చి అక్కడ పడుకోపెట్టి కొంతసేపు చికిత్సచేసిన పిమ్మట జ్వరం కొంచెం తగ్గుముఖంలోకి వచ్చింది. అప్పుడిహా అతడు రోగికి ఉపచారంచూసి ఒకచిన్నబల్ల తీసుకువచ్చి వంట యింటి వసారాలో వేసుకుని కూర్చున్నాడు.

నిరంజనుడు ఎలాగో కాస్త విశ్రాంతిని కల్పించుకు న్నాడు కాని, అతడిమనస్సు అంతా ఆ వసారాలో పడుకుని ఉన్నరోగిమీదనే ఉంది. మనస్సులో అనేకవిధాల యుద్ధంచేసి నిరంజనుడు కంగారుగా మళ్ళీ వచ్చి రోగిని పరీక్షించాడు. ఆమె నిద్రపోతోంది. అతడు మనస్సుకుదుటపరచుకుని జామచెట్టుక్రిందికివచ్చినుంచున్నాడు. ఇంతలో భిల్లుక్ను వెంటబెట్టుకుని చంద్రనాథుడు వచ్చా డక్కడికి. నిరంజనుడ్నిచూసి 'ఇదేమిటి! ఇక్కడున్నారా మీరు!" అన్నారు ఇద్దరూ ఒక్కసారిగా. అతడు దానికేమీ జవాబు చెప్పలేదు. నిరంజనుడి కోపమంతా చంద్రనాథుడి మీద పడింది. "ఏమిటి చంద్రనాథ్!" ఆమెను ఒంట రిగా విడిచిపెట్టి నువ్వెక్కడికో పోయావా!" అన్నాడు. చంద్రనాథ్ నీళ్లు నములుతూ "మీకోసమే వెళ్ళాను బాబూ! ఏం చెయ్యనుమరి! దానికి రాత్రినుంచీ విపరీతమైన జ్వరం. ఆ జ్వరంలో మిమ్మల్ని ఒకటే కలవరించటం; నాకు భయం వేసింది" అన్నాడు.

ఆమాట వినేసరికి నిరంజనుడికి శరీరం కంపించింది. అస్ఫుటంగా తనలో ఏవో గొణుక్కున్నాడు. మరుక్షణంలోనే భిల్లుక్ కేసి చూస్తూ "నువ్వు యిక్కడ కూర్చో భిల్లుక్దా! కళ్లుమెరిస్తే ముఖం చన్నీళ్ళతో కొంచెం తడుపుతూ

ఉండు. నేను అవతలిబడ్డుకువెళ్ళి డాక్టర్ని పంపిస్తాను. మరేం భయంలేదు చంద్రినాథ్!" అన్నాడు.

ఇంటికివచ్చి రావుసాహెబ్‌గారికి ఈ సంగతి అంతా చెప్పి నిరంజనుడు తన గదిలోకివెళ్ళి అలసటతో కాస్సేపు పడుకున్నాడు. రావుసాహెబ్‌గారు తమఇంటి డాక్టర్ని పిలిపించి చంద్రినాథుని యింటికి పంపించారు.

ఆదివారంనాటి అతిధులు నిశ్చింతగా శెలవుతీసుకుని వెళ్ళిపోయారు.

అపరాహ్ణానికి రాయిమణి జ్వరం తగ్గింది. దుప్పటి కప్పుకుని పక్కమీద కూర్చుని "బాగా ఆకలేస్తోంది నాన్నా!" అన్నది రాయిమణి.

"అయితే ఏం తింటావ్? డాక్టరుగారు ఆహారంఏమీ ఇవ్వవద్దని చెప్పాడుకదూ భిల్లుక్!" అన్నాడు చంద్రినాథుడు.

ఇప్పటివరకు రాయిమణి భిల్లుక్‌ను చూడలేదు. అతడి పేరు వినేసరికి, మరొకవ్యక్తికూడా ఉన్నాడేమో అని ఆమెకళ్ళు ఆ పరిసరాలన్నీ వెతికాయి. ఎవ్వరూ కనిపించలేదు. కాసేపాగి 'ఏమన్నా ఉంటే పెట్టు నాన్నా!' అన్నది. 'ఏం పెట్టను? అన్నం పెట్టటానికి వీల్లేదు. ఏమంటావ్ భిల్లుక్?'

అమ్మో! ఇన్నమే! భాయిజీ విన్నాడంటే—పొద్దున జరిగిన సంగతి జ్ఞాపకంలేదూ చందర్‌దా?' అన్నాడు భిల్లుక్.

సంతోషంతో రాయిమణి మనస్సు ఒక్కక్షణం గిలిగింతలు పెట్టినట్లయింది. భిల్లుక్‌కు తండ్రి ఏం జవాబు చెపుతాడో విందామనే ఆశతో చూస్తోంది. వాళ్ళ మాటల్ని పట్టి నిరంజనుడు ప్రొద్దునవచ్చి వెళ్ళాడని తెలుసుకుంది. ఆ తర్వాత

డాక్టర్నికూడా పంపాడట! నిరంజనుడి దయ, మంచితనం, తెలివి తేటలు వీటన్నిటిమీదా వ్యాఖ్యానం అయిపోయి వాళ్ళు ఉభయులూ మరో ప్రసంగంలోకి దిగేసరికి రాయిమణికి మళ్ళీ ఆకలి గుర్తుకొచ్చింది. 'చాలా ఆకలేస్తోంది నాన్నా!'అంది. 'అలాగా! అన్నట్టు మరిచిపోయాను. సరేకాని, కాసిని మరమరాలు ఏమయినా పెట్టనా భిల్లుక్?' అని అడిగాడు చంద్రనాథ్.

'ఆ మాట నన్నడగవద్దు చందర్‌దా! ఏదో ఒకటిచెప్పి ఆఖరికి నేను నెత్తిమీదికి తెచ్చుకోలేను. గుర్రానికి జబ్బు చేస్తే నాకు దాని కేం పెట్టాలో తెలుసు...కాని నీ కూతురికి జ్వరంవస్తే ఏం పెట్టవచ్చునో కూడదో అది నేను నిర్ణయించ లేను.'

ఉభయులూ అరగంటసేపు మథనపడ్డారు కాని ఏమీ తేల్చుకోలేకపోయారు, రాయిమణికి కోపం వచ్చి 'ఏదో ఒకటి పెట్టనియ్ కాక్కాయ్! నేనేం చావనులే. ఆ భయం అక్కర్లేదు' అంది.

'అదే ఆలోచిస్తున్నా. ఈ పక్కనే వైద్యుడున్నాడుగా! ఆయన్ని అడిగివస్తానుండు.' అంటూ భిల్లుక్ ఆ పక్కనున్న వైద్యుడింటికి వెళ్ళాడు. ఒక అరగంటకు బార్లీనీళ్ళు తీసుకుని అతడు తిరిగి వచ్చేసరికి రాయిమణి కొబ్బరి, మరమరాలు నములుతూ కూర్చుని ఉంది.

## ౧౨

తన మనోదౌర్బల్యం తనకే భయం కలిగించింది. ఒక స్త్రీ తన మనస్సునూ, ఆలోచనలనూ ఆక్రమించుకుని ఉంటుందని నిరంజనుడు ఎన్నడూ ఊహించుకోలేదు. అతడు చంద్రనాథుడిఇంటికి వెళ్ళటం మానేశాడు. ఫిల్లిక్ ద్వారా రాయిమణి సంగతులు తెలుసుకుంటూ అతడు రావుసాహెబ్ గారికి తెలియచేస్తున్నాడు. కాని ఇంత జాగ్రత్తగా ఉంటున్నా రాయిమణిని గురించిన ఆలోచన అతడి మనస్సులోంచి పోలేదు. మనస్సును పూర్తిగా లొంగతీసుకోటానికి అతడొక కొత్త ఉపాయం ఆలోచించుకున్నాడు.

లలితతో సన్నిహిత పరిచయం కలిగించుకోవాలనే ఉద్దేశం అతడికెన్నడూ లేదు. దానికి ప్రధానమైన అభ్యంతరం దత్తుగారు. ఇప్పుడు తనను తాను రక్షించుకోవాల్సిన అవసరం వచ్చింది. కనుక ఇలాంటి అభ్యంతరాలను పెట్టుకు కూర్చుంటే వీల్లేదు. ఎలాగో అలా లలితతో పరిచయం ఎక్కువ చేసుకుంటేనేకాని రాయిమణిని గురించిన ఆలోచన మనస్సులోంచి పోదు అనే ఊహతో లలితతో సన్నిహితపరిచయం కలిగించుకోటానికి ప్రయత్నించ సాగాడు. రెండురోజులు ఊరికేనే గడిచిపోయాయి. మూడోనాడు చక్కని అవకాశం లభించింది. దత్తుగారు ఊళ్ళోలేడు లలిత తోటలో ఈజీఛైర్‌లో కూర్చుని ఇంగ్లీషుకావ్యం ఏదో చదువుకుంటోంది. నిరంజనుడా సమయంలో వచ్చి 'ఏమిటి చదువుతున్నారు?' అని అడిగాడు.

లలిత ముఖం పైకిఎత్తింది. చిరునవ్వు నవ్వుతూ ఆ పుస్తకం అతడి చేతికిచ్చింది. అతడు పైన అట్టమీద పేరు చూచి, 'చదవండి వింటాను' అన్నాడు. లలిత విస్మితురాలై "అర్థమవుతుందా?" అని అడిగింది.

నిరంజనుడు కొంచెం కంగారుపడి, "ఓహో! అదా! మీరు చదివి కథ చెపితే వింటాను" అన్నాడు.

లలిత ఆ పుస్తకం మూసి కథ చెప్పింది. కథంతా విని నిరంజనుడు 'బాగుంది' అన్నాడు. అని అతడు అక్కడనుంచి లేవబోయాడు. 'లేస్తున్నారేం?' అన్నది లలిత.

"ఊఁ. వెడతా. టైం అయింది."

"కూర్చోండి. ఇంకా పదికూడా కాలేదు. చేపల్ని పట్టటాన్ని గురించిన కథ ఏమయినా చెప్పండి"

నిరంజనుణ్ణి ఏదైనా కథ చెప్పమని అడగాలని ఆమె చాలారోజులనుంచి అనుకుంటోంది. కాని అవకాశం చిక్కింది కాదు ఆ దుస్సంఘటనను గురించి మిస్టర్ సేన్ చెప్పగా ఆమె పూర్తిగా విన్నది. ఆ తర్వాత దత్తుగారు ఆ సంఘటనకు మరొక కొత్తపూత పూసి చెప్పాడు. ఆ చెప్పటంలో ఆ దెబ్బ తిన్న స్త్రీకి, నిరంజనుడికీ సంబంధం ఉన్నట్టుకూడా కొద్దిగా సూచించాడు. ఆమె కప్పుడు ఒకవిధమైన కుతూహలం ఏర్పడింది. ఆమె గ్రంథాల్లో నిత్యమూ ఏం చదువుతోందో, అది ఆమెకు వాస్తవ జీవితంలో ఎక్కడా కన్పించడంలేదు. మొత్తానికీ ఆమె మనస్సు కొన్నాళ్ళనుంచీ ఏదో అశాంతిగానే ఉంటోంది. నిరంజనుడు, రాయిమణిసీ గురించి తను విన్న సంగతి భిల్లుక్‌ను అన్యాపదేశంగా అడిగి చూసింది కాని, విశేష

మేమీ తెలియలేదు. అంతకన్న సూటిగా అడగటం లజ్జాకర మైన సంగతి. ఆనాటి విషయాన్ని గురించి యథార్థం ఏమైనా తెలుస్తుందేమో అన్న భావనతో ఆమె శ్రద్ధగా వింటూ కూర్చుంది. నిరంజనుడు తన చిన్నతనంలో జరిగిన కథలు ఏవో చెపుతూంటే 'ఈమధ్య జరిగిన వేవయినా ఉంటే చెప్పండి' అని అడిగింది లలిత.

నిరంజనుడు కొత్తకథ చెప్పటం మొదలెట్టాడు. అతడు అందులో తన సంగతీ, భిల్లుక్ సంగతీ తప్ప మూడోవ్యక్తి విషయం ఏమీ చెప్పలేదు 'బాగుంది సరే, కాని ఆ అమ్మా యికి ఎలాఉంది?' అని అడిగింది.

"ఎవరిసంగతి మీరడిగేది?"

'ఆ తుపాకిదెబ్బ తగిలిందే—ఆబిడ్డునడుండే—'

ఆమె ప్రశ్న ఇంకా పూర్తికాకమునుపే నిరంజనుడు చటుక్కున "కులాసాగానేఉంది" అన్నాడు. మళ్లీ ఏమను కున్నాడో 'భిల్లుక్ చెప్పాడు కులాసాగానే ఉన్నదని.. ...' అన్నాడు.

"భిల్లుక్ చెప్పటమేం! మీరు వెళ్ళటంలేదా?"

నిరంజనుడు లలితముఖంకేసి తీక్ష్ణంగాచూసి, "నేను వెళ్ళవలసిన అవసరంలేదు. మందూ అదీ రోజూ పంపుతూనే ఉన్నాను. భిల్లుక్ రెండు పూటలా వెళ్ళి చూసివస్తున్నాడు" అన్నాడు

అంతటితో లలిత ఊరుకోక "మీరువెళ్ళటం భావ్యం. మిమ్మల్ని చూస్తే—"

నిరంజనుడి ముఖం ఎర్రబడింది. వీలైనంత శాంతంగా "నా కాసంగతి తెలుసు. కాని వెళ్ళలేను. నాకు వెళ్ళేందుకు తీరికాలేదు" అని అంటూనే అక్కడనుంచి లేచాడు.

లలిత అందుకేమీ అభ్యంతరం చెప్పకుండానే "ఆమె చాలా దురదృష్టవంతురాలుకదూ?" అని అడిగింది. లలిత ఒక్క వ్యక్తినిగురించి ఎందుకు ఇన్ని ప్రశ్నలువేస్తోందో నిరంజనుడికి అర్థంకాలేదు. "చాలా చిన్నతనంలోనే భర్త పోయాడు. తండ్రి ఒగ్గయి ఇంచు మించు మృత్యు ముఖంలో ఉన్నాడని చెప్పవచ్చు. తాను సంపాయించి తండ్రిని పోషించాలి. దురదృష్టంకాక ఏమిటి మరి?" అన్నాడు.

"ఏం చేస్తుందీ తాను? ఎవరింట్లోనయినా దాసీగా ఉంటోందా?"

"ఉహుం, చేపలుపట్టి అమ్ముతూఉంటుంది"

"అయితే ఒకపని చేయరాదూ? ఆ అమ్మాయిని నా దగ్గర ఉంచుకుంటే ఎలా ఉంటుంది?"

"అది వీలుండదు ఆమె తండ్రి అందుకు ఒప్పుకోడు. అతడు ఒక్కనిమిషం కూతురు కనుచూపుమేరలోనైనా ఉండకపోతే ఊరుకోలేడు"

రాయిమణి జీవితాన్నిగురించి తెలుసుకోటానికి లలితకు ఇప్పుడు అవకాశం దొరికింది "ఎందుకని?" అని అడిగింది. నిరంజనుడు కాస్సేపాగి "వింటావా?" అన్నాడు.

"చెప్పండి. వింటాను" అన్నది లలిత ఆత్రుతతో.

నిరంజనుడు రాయిమణి జీవితగాథ- చంద్రనాథుడు చెప్పగా తానువిన్నది- అంతా ఆమెకు చెప్పాడు. జమీందారుకొడుకుప్రవర్తనను గురించి చెబుతూంటే అతడికళ్ళు

ఎరగ్రిపడ్డాయి. లలితకుకూడా మనస్సు నిలువలేదు. స్త్రీత్వానికి అమర్యాద జరగటం విని ఆమె బాధపడి "మీరంతా అతణ్ని తన్నలేకపోయారా!" అన్నది.

"అప్పుడు నే నెక్కడున్నాను?" అన్నాడు నిరంజనుడు.

"అదినిజమే కాని మానాన్నగారు చాలారోజులనుంచి యిక్కడ ఉంటున్నారు. ఆయనతో చెపితే దీనికి ప్రతీకారం జరుగుతుంది. నేను ఆయనతో చెపుతాను"

"వద్దు. అవసరం లేదు. అదిజరిగి చాలారోజులయింది." అని నిరంజనుడు రాయిమణి దైనికజీవితాన్ని గురించికూడా చెప్పేసి ఆ గాథ పూర్తిచేశాడు.

ఆ దరిద్రురాలైన ధీవరబాలికమీద సానుభూతితో లలిత హృదయం నిండిపోయింది. అనుచితమైన కుతూహలంతోనే ఆమె ఈ కథ వినటానికి కూర్చుంది. కాని ఆమె ఆ కాంక్ష యావత్తూ ఇప్పుడు సానుభూతి ప్రవాహంలో తేలిపోయింది "ఆమెను మీరొక్కసారి ఇక్కడకు తీసుకుని రాగలరా? నేను ఆమెను చూస్తాను" అని అడిగింది లలిత.

"సరే, చెబుతాను"

"తప్పకుండా చెప్తారుగా—కాని ఇవాళే"

నిరంజనుడు అలాగేనన్నట్టు తలఊగించి అక్కడనుంచి వెళ్ళిపోయాడు.

## ౧౩

రాయిమణికి కాలం జరగటంలేదు పొద్దునవచ్చి వసారాలో కూర్చుంటుంది సాయంకాలం లోపలికివెళ్ళి పడుకుంటుంది. రోజు మొత్తంమీద ఎన్నిసార్లు జామచెట్టుకిందికి వెళ్ళి దారికేసి చూస్తూఉంటుందో అంతులేదు. ఏరోజు కారోజు ప్రొద్దున్నే లేవగానే ఇవాళ నిరంజనుడు తప్పక వస్తాడు అనుకుంటుంది. సిరాత్రి పొద్దుకూకుతూ ఉంటుంది. నిరంజనుడు ఎందుకురాలేదు అని అడగటానికి ఆమెకు సిగ్గేసేది కాని ఆదుర్దా పట్టలేక చివరకు ఒకరోజున ఆ సంగతి తండ్రిని అడిగేసింది. వృద్ధుడైన చంద్రనాథుడు నిరంజనుడు రాకపోవటానికి సరిఅయిన కారణం ఏమీ చూపించలేకపోయాడు. "నువ్వొక్కసారి ఆ ఒడ్డుకు ఆయనకోసం వెళ్ళి చూచిరా నాన్నా! ఒకవేళ ఏదయినా సుస్తీ చేసిందేమో!" అన్నది రాయిమణి. ఈ మాట అనగానే ఆమె ముఖం ఎర్రబడింది. చంద్రనాథుడు అది గమనించలేదు. "అసలే వెడతాలే" అన్నాడు.

నిరంజనుడికి సుస్తీయేమీ చెయ్యలేదన్న సంగతి అతడు భిల్లుక్‌ను అడిగి తెలుసుకున్నాడు తండ్రి వెళ్ళి అసలు సంగతేమిటో తెలుసుకుని వస్తాడని అనుకుని, నిరంజనుడికిసుస్తీచేసిందేమో అన్నభయం చూపించి, తండ్రిని అక్కడకు పంపించి ఎదురుచూస్తూ కూచుంది రాయిమణి. ఒకవేళ నిరంజనుడు కోపంవచ్చి రావటంలేదేమో అని మనస్సులోశంకిస్తూనేఉంది.

నిరంజనుణ్ణి మొట్టమొదటిరోజున కలుసుకొన్నప్పటినుంచీ జరిగిన సంఘటనలు- తనప్రవర్తన అన్నీ తరచితరచి ఆలోచించి చూసుకుంది కాని నిరంజనుడికి కోపం రావటానికి తగిన కారణం ఏమీ కనిపించలేదు. అప్పుడింక మనస్సును కొంచెం కుదుటపరచుకుని, నిరంజనుడు రాకపోవటానికి కారణం తనకు తెలియనిదేదో అయి ఉంటుందని నిశ్చయించుకుంది. ఇవాళ ఒక్కరోజునేకాదు- ఇటీవల కొన్నాళ్ళనుంచీ ఆమె నిత్యమూ మనస్సులో ఈ దాగుడుమూతలాడుతూనే ఉంది. కాని అనుకూలకారణాలు ఎన్ని ఊహించుకున్నా ఆమె మనస్సులోని అశాంతిమాత్రం పోగొట్టుకోలేకపోయింది.

ప్రతీక్షిస్తూ కూర్చుని కూర్చుని, సాయంకాలమయి ఇంట్లోకి వెడదామని అనుకుంటూండగానే చంద్రనాథుడు వచ్చి "ఆ వల తీసుకువచ్చి ఇలా వెయ్యి మణీ!" అన్నాడు.

రాయిమణి తలయెత్తి చూసింది తండ్రిప్రక్కన నిలబడి ఉన్న నిరంజనునిచూసి, నాలిక కొరుక్కుని పైటకొంగు సవరించుకుని బల్ల తీసుకురావటానికి లేచింది. "బల్ల వద్దులే,ఇక్కడ కూర్చుంటాను"అని నిరంజనుడు వంటయింటి వసారా అరుగు మీద కూర్చున్నాడు.

చంద్రనాథుడు గబగబా వచ్చి "అదేం పనిబాబూ!మీ గుడ్డలు మాసిపోతాయి" అన్నాడు.

నిరంజనుడు బిగ్గరగానవ్వి "రోజల్లా మట్టిలో పని చేస్తూంటే ఈ గుడ్డలు మాసిపోవుకాని, నీయింట్లో అరుగు మీద కూర్చునేసరికి పీటమర్యాద చెడుతుందన్నమాట" అన్నాడు.

నిరంజనుడి మాటల్లోని అర్థం చంద్రనాధుడు సరిగ్గా తెలుసుకోలేదు. అయినా తెలుసుకున్నట్లు నటిస్తూ "మీలాంటి బాబుగార్లందరూ మర్యాదస్తులు. మీ బట్టలకుండే గౌరవం మాలాంటివాళ్లు కట్టుకునే గుడ్డల కుండదు. మీరు రా వసారా లోకి వదండి" అన్నాడు. నిరంజనుడు ఆ మాటలు విని నవ్వుకున్నాడు కాని అక్కడనుంచి కదలలేదు.

రాయిమణి అంతా గమనిస్తూనే ఉంది. నిరంజనుడు ఆ వంటయింటి అరుగుమీదనుంచి కదలకపోయేసరికి ఆమె ముఖం ఏదో భయంతో నల్లబడిపోయింది. నిరంజనుడికి తప్పకుండా తనమీద కోపం వచ్చి ఉంటుంది — అందులో ఏం సందేహం లేదు. తాను వసారాలో ఉన్నదనే అతడక్కడ కూర్చుని ఉంటాడు అనుకుని ఆమె చేతిలోపని అక్కడ వది లేసి గబగబా లోపలికి వెళ్ళిపోయింది. రాయిమణి కాలిమీద గాయం ఇంకా పూర్తిగా మూనలేదు. నిరంజనుడు ఈలోపుగా అది గ్రహించాడు. రాయిమణిని పిలిచి "నీ కాలిమీదగాయం ఇంకా మూనలేదా మణీ?" అని అడిగాడు.

రాయిమణి జవాబేమీ చెప్పలేదు. ఆ ప్రశ్నకు చంద్రనాధుడు జవాబిచ్చాడు. 'నిన్నటినుంచీ ఆ బాధ తగ్గింది బాబూ! జ్వరం కూడా రావటం లేదు."

రాయిమణి తలవంచుకుని అక్కడే కూర్చుని ఉన్నట్లు నిరంజనుడికి తలుపుసందులలోంచి అస్పష్టంగా కన్పిస్తూనే ఉంది. ఆమె కళ్ళవెంట నీళ్లు కారుతున్నట్లు నిరంజనుడు అంత దూరాన్నుంచి తెలుసుకోలేకపోయాడు. ఆమె దగ్గరనుంచి జవాబేమీ రాకపోవటం చూసి, నిరంజనుడు చటుక్కున

"అదేమిటి మణీ! మీ యింటికివస్తే నువ్వు ఒక్కమాటైనా మాట్లాడవేమిటి!" అని అడిగాడు; ఆమాటఅడిగి నిరంజనుడు త్రుళ్ళిపడి చటుక్కున లేచి నుంచుని చంద్రనాథుని పిలిచి "నేను వెడుతున్నాను చంద్రనాథ్! మధ్యమధ్య కనిపిస్తూ ఉండు—కాలికి మందు భిల్లుకిచేతికిచ్చి పంపుతానులే." అని చెప్పి అతడు మెల్లా దాటి బైటికి వెళ్ళిపోయాడు. నిరంజనుడు అడిగిన ప్రశ్న విని రాయిమణి కళ్లు తుడుచుకుని వచ్చి గుమ్మందగ్గిర నిలబడింది. అతడు ఆమెకేసి చూడనేలేదు.

రాయిమణి భయంతో వెలవెలబోయింది. ఈసారి నిరంజనుడు నిజంగా తనమీద కోపంవచ్చే వెళ్లాడనటంలో సందేహం యత్కించితూ లేదు. ఈ దిగులు ఆమె మనస్సును పీడించసాగింది. తన దోషమేమీ లేదు అన్న సంగతి నిరంజనుడికి ఎలా తెలియచెయ్యటం! ఈరవంత అపరాధంకూడా నిరంజనుడు క్షమించలేడా! అభిమానంతో పాపం ఏడవటం మొదలెట్టింది.

బైటికి రాగానే 'అమ్మయ్య! బ్రతికిపోయాను!' అనుకున్నాడు నిరంజనుడు. కాని ఈ విముక్తివల్ల కలిగిన ఉల్లాసం ఎంతోసేపు నిలవలేదు. తన ఆలోచనల్లో ఏ సందులోనుంచో రాయిమణి వచ్చి తన ఆలోచనల నన్నిటినీ స్వాయత్తం చేసుకుంది. ఆమె శాంతదృష్టి, విషణ్ణముఖం, కమనీయదేహం, అన్నీ ఒక్కసారిగా అతడి మనస్సును బాధించసాగాయి. తాను చప్పున లేచిరావటంవల్ల తన దౌర్బల్యాన్నే సూచించినట్లయింది, అని అనిపించసాగింది అతడికి. చంద్రనాథుడు తెలుసుకోలేకపోయినా, తన యీ దౌర్బల్యాన్ని రాయిమణి గమనించకుండా ఉండదు. నిరంజన్ సిగ్గుపడ్డాడు.

ఈ ఆలోచనల్లోంచి మనస్సును మరల్చుకోటానికి అతడు హిందీ భజనకీర్తనఒకటి మెల్లిగా పాడుకుంటూ నడవటం మొదలెట్టాడు. ఎవరో మరొకవ్యక్తి ఆ దారినే ఆ పల్లెవాడకేసి పోతున్నాడు. ఇతడిపాట విని "ఏంభాయిజీ! వచ్చేస్తున్నావ్? అమ్మాయిని చూసివస్తున్నావా?" అని అడిగాడు.

నిరంజనుడికి కోపం వచ్చింది. లోకంఅంతా తనమీాద కట్టుకట్టినట్లు తోచింది అతడికి. ఆ పాటను అంతటితోనే ఆపేసి "ఊఁ" అన్నాడు. ఆ అడిగింది ఎవరోకాదు భిల్లుక్. భిల్లుక్ తనతోకూడా మళ్ళీ వెనక్కి. ఎక్కడ రమ్మంటాడో అన్న భయంతో చటుక్కున "నేను వెంటనే వెళ్ళిపోవాల్సివచ్చింది భిల్లుక్‌దా! చేతినిండా బోలెడు పనులున్నాయి. అవన్నీ చేసుకోవాలి. నువ్వు కాస్త పెందరాళే రా రేపు" అని అతను అవతలి ఒడ్డుకు వెడుతున్న నావలో- ఆ పల్లెకారిని అడగకుండానే ఎక్కి కూర్చున్నాడు.



ఆ తర్వాత రెండురోజులు నిరంజనుడు బంగళావదిలి ఈవలికి రానేలేదు. మూడోరోజున రాయిమణిసంగతులు భిల్లుక్‌ను అడిగి తెలుసుకుని, అతడు మామూలుగా రావు సాహెబ్ గారికి చెప్పటానికి వెళ్ళాడు. "నువ్వు ఆ అమ్మాయిని ఒకసారి ఇక్కడికి తీసుకొస్తావని లలిత చెప్పిందే? ఎప్పుడు తీసుకొస్తావ్? ఆమెను ఒకసారి తెలుసుకోవటం అవసరం" అన్నాడు రావుసాహెబ్.

నిరంజనుడు చిక్కుల్లోపడ్డాడు. లలిత చెప్పిన సంగతి రాయిమణితో చెపుదామనే అతడు ఆరోజున వాళ్ళ ఇంటికి

వెళ్ళింది. కాని ఆ సంకల్పంమాత్రం నెరవేరలేదు. అదేదో లలిత ప్రసంగవశాత్తు అన్నమాట అనుకొని అతడు రెండోసారి మళ్ళీ ఆ ప్రయత్నం చెయ్యలేదు. లలిత తెచ్చిన ఈ సామాన్య ప్రస్తావన రావుసాహెబ్‌గారి బుర్రలో దూరటంచూసి, ఎలా పరిణమిస్తుందోఅని భయపడ్డాడు. అలాగేతీసుకునివస్తాను. ఆమెకు బాగా కులాసా చిక్కగానే వాళ్ళ నాన్నతో ఈ సంగతి చెబుతాను" అన్నాడు.

"కులాసా చిక్కటమేమిటి? కులాసాగా ఉన్నదని ఇప్పుడేగా చెప్పావ్!"

ఈ ప్రశ్నకి నిరంజనుడు తెల్లబోయాడు. యథార్థం దాచటానికి ఇంకేమీ ఉపాయం కనపడలా. "చిత్తం. భిల్లుక్ అలాఅనే చెప్పాడు" అన్నాడు.

"భిల్లుక్ ఏమిటి? వాడికేం తెలుసు? నిన్నే వెళ్ళి తీసుకునిరమ్మని చెబుతున్నా నేను. రేపయినా వెళ్ళిరా.

"సరే, వెడతాను" అని నిరంజనుడు వెళ్ళిపోయాడు.

తన గదిలోకివచ్చి నిరంజనుడు చాలాసేపు ఆలోచించు కున్నాడు. తర్వాత లలితకోసమని హోటల్‌లోకి వెళ్ళాడు. తన మనస్సును లలితవైపుకు త్రిప్పుకుంటే రామయ్యణినుంచి విముక్తి పొందవచ్చునని నిశ్చయించుకున్నాడతడు. కాని ఎంత ప్రయత్నించినా లలిత పరిచయంతో అతడికి ఎక్కువ సంతృప్తి కలగడంలేదు. ఉరిశిక్షపడ్డ వ్యక్తి చివరకు అన్ని ఆశలూ వ్యర్థితం చేసుకుని ఆఖరి అప్పీలు ఎలా చేసుకుంటాడో నిరంజనుడుకూడా అలాంటి మానసికస్థితిలోనే ఇవాళ లలిత కోసమని బయలుదేరి వెళ్ళాడు. లలిత తల వంచుకుని కావ్య

పఠనలో నిమగ్నురాలై ఉంది. ఆమె దగ్గరికి వెళ్ళి "ఇవాళ కొంచెం చదివి వినిపించండి" అని కోరాడు.

లలిత ముఖం ఎత్తి "మీకూ ఈ పిచ్చి ఉన్నదన్నమాట" అన్నది.

"చిన్నప్పుడు రామాయణ భారతాలలోని పద్యాలు చాలాసార్లు చదివాను."

లలిత సుస్మితంగా నవ్వి, "ఇది రామాయణమూ కాదు, భారతమూ కాదు. అర్థంచేసుకోవటం చాలా కష్టం" అన్నది.

నిరంజనుడు అతి శ్రద్ధగా "తర్జుమాచేసి చెపితే తెలుసుకోగలను. మీరు చదవండి" అని అడిగాడు.

లలిత చదివి తర్జుమాచేసి చెప్పటం మొదలెట్టింది. చదివి చదివి చివరకు మాతృభాషలో తర్జుమాచేసి చెప్పటానికి సిగ్గువేసేఘట్టానికి వచ్చిందామె. నిరంజనుడు అది గ్రహించి "ఆ తర్వాత చదవండి" అన్నాడు.

"ఆపైన చదివితే ఇందులోని గొప్పతనం అంతా పోతుంది."

"అయితే ఇంకేదయినా చదవండి" అని నిరంజనుడు నిస్సంకోచంగా అడిగాడు.

కాని లలితకు ఈ చమత్కారమైన కవిత్వాన్ని అంత టితో ఖూనీచెయ్యటం ఇష్టంలేకపోయింది. సంక్షిప్తంగా భావానువాదంచేసి, ఆ కవిత్వంలోని మహాత్మ్యాన్ని నిలబెట్టాలని ప్రయత్నిస్తూండగా — ఇంతలో దత్తుగారు వచ్చారు అక్కడికి. నిరంజనుడు తృణశయ్యమీద కూర్చుని ఉండటం చూసేసరికి

అతడు సహనాన్ని కోల్పోయాడు. అతి వ్యంగ్యంగా "సిద్ధ మయినావ్!" అన్నాడు దత్తుగారు.

దత్తుగారి మాటలతీరు చూసేసరికి నిరంజనుడికి ఆపాద మస్తకం మండిపోయింది. ఒకతీవ్రమైన జవాబు అతడికి నాలిక చివరిదాకా వచ్చింది. కాని చటుక్కున లలితముఖంకేసిచూసి అతడు మెదలకుండా ఊరుకున్నాడు. లలిత ముఖం అస్వాభావికంగా వికృతమైపోయింది. ఒక్కనిమిషం ఆగి నిరంజనుడు తమాయించుకొని అక్కడనుంచి వెళ్ళిపోయాడు.

నిరంజనుడు వెళ్ళిపోగానే "నువ్వు ఇతడికి చాలాచనువు యిస్తున్నావు లలితా! తర్వాత పశ్చాత్తాపపడతావ్" అన్నాడు దత్తు.

దత్తు మాతృభాష మాట్లాడేటప్పుడు ఆ మాటల్లో ఎంతఅర్థం ఉన్నదీ గమనించడు.

లలితకు ఆమాటఅనేసరికి కోపం వచ్చింది. "మిమ్మల్ని చాలారోజులనుంచి చూస్తున్నాను మిష్టర్‌దత్! మీరు నిరంజనబాబు విషయంలో సుముఖులుగా ఉండటంలేదు. ఆయన అపరాధం ఏమీలేకపోయినా మీరెందుకు ఆయన్ని దూషిస్తూ ఉంటారు?" అని అడిగింది.

దత్తు ఆశ్చర్యపోయాడు. లలిత నిరంజనుడి పక్షం మాట్లాడుతుందని అతడెన్నడూఅనుకోలేదు "నువ్వు మాట్లాడేదేమిటో నాకర్థంకావటంలేదు. నీ నౌకరు అతడు. అతడితో నువ్వు సమాన ధాయాలో మాట్లాడటం, కవిత్వంచదివి వినిపించటం - చూడటానికి ఎలా కనిపిస్తుందో తెలుసా?" అన్నాడు.

లలిత మండిపడింది. అసలు నిరపరాధియైన నిరంజనుడితో కటువుగా మాట్లాడుతున్నందుకే ఆమెకు కోపంగా ఉంది. ఇంతకుపూర్వం కూడా అతడితో అలా మాట్లాడినందుకు ఆమెకు చాలా సిగ్గుగా ఉంది. అయినా దత్తుని ఏమిఅనటానికీ ఆమెకు ధైర్యం చాల్లేదు.

ఇప్పుడు నిరంజనుని చులకనచేసి మాట్లాడటం తనను అవమానించినట్లుందామెకు ఆమె కూర్చున్నచోటునుంచి లేచి, "నాకు తెలుసు కవిత్వం వినేందుకు హక్కు అందరికీ ఎలావుందో, అలాగే నిరంజనబాబుకూ ఉంది. ఆ సంగతి తెలుసు. అక్కడితో ఆపండి. ఈవిషయమై ఎక్కువగా తర్కించవలసిన అవసరం లేదు" అన్నది.

లలితమాటలకు దత్తు స్తంభితుడయినాడు. తనమూలంగా వ్యక్తిత్వాన్ని పొందిన లలిత తననే ఎదురుగా పట్టుకుని తిరస్కరిస్తోంది.

ఈ వ్యవహారానికంతకీ ఒక కారణాన్ని అతడు మనస్సులో నిశ్చయించుకున్నాడు. కాని ఆ ఆలోచన రాగానే ఎన్నాళ్ళనుంచో తనకు ఉన్న ఆశ పూర్తిగా విఫలమైపోతుందనే భయం కలిగింది. నిరంజనుడికి ఉద్వాసన చెప్పటానికి అతడు రెండు మూడు ఉపాయాలు ఆలోచించిపెట్టుకుని వెంటనే మళ్ళీ లలిత దగ్గరకు వెళ్ళాడు.

లలిత ఇంకా అప్పటి ఇంటికిపోలేదు, నిరంజనుడికోసం వెతుకుతోంది. నిరంజనుడు ఆ తోటలో ఒకమూల ఎక్కడో ఒక చెట్టుకింద ఆలోచించుకుంటూ కూర్చున్నాడు. దత్తుగారి కటువైన మాటలు అతడప్పుడే మరిచిపోయాడు. అతడు

ఆలోచిస్తున్నది లలిత సంగతీ—మరొకరి సంగతీ. ఒక కంట కాన్ని మరొక కంటకంతో లాగిపారెయ్యాలని అనుకుంటే రెండూ గుచ్చుకున్నాయి. నిజానికి లలితవిషయం అంతగా బాధించకపోయినా రాయిమణిసి మాత్రం మనస్సులోంచి తొలిసిపారెయ్యలేకపోయాడు. పరిపూర్ణయౌవనంలో ఏకాకినిగా ఉంటూన్న ఆ ధీవరకన్య నిష్కల్మషప్రవర్తన అతడిమనస్సును ఏ నాగపాశంతోనో బంధించింది. ఆబంధాన్ని వదల్చుకోవటం సులభంకాదు. వదల్చుకోవాలని తాను చేసిన ఈ ప్రయత్నం ఇలా విఫలమవటం ఆలోచించి ఇది ఇంకా ఎలాపరిణమిస్తుందో అని భయం కలగసాగింది. ఈ ఆలోచనల్లో పడి కొట్టుకుంటూండగా లలిత వచ్చి, "నేను మీకోసం యిల్లంతా వెదకి వచ్చాను. పదండి" అన్నది.

నిరంజనుడు ఆశ్చర్యపోతూ 'ఎక్కడికి?" అని అడిగాడు.

"నాన్నగారి దగ్గరకు. మీ రెందుకు ఈ అవమానాన్ని సహించటం? నేను చాలారోజులనుంచి కనిపెడుతున్నాను మీరు వృథాగా తిట్లు తనాల్సివస్తోంది. పదండి మీరు"

లలిత మాటలకు నిరంజనుడికి కళ్ళలో నీళ్ళుతిరిగాయి, లలిత అది చూసి, "ఏడుస్తున్నారా? నేను స్వయంగా నాన్న గారితో చెపుతాను" అన్నది.

నిరంజనుడు కళ్ళు తుడుచుకుని "ఊహుం, అలా చెయ్యటం మంచిదికాదు" అన్నాడు.

"ఎందుకని? నేను వెంటపెట్టుకుని వెడతాను"

లలిత ఇవాళ తిరుగుబాటు చేస్తున్నదని నిరంజనుడు గ్రహించాడు. "నేను చెప్తున్నానుగదా- అలా చెయ్యటం మరీ అసహ్యంగా ఉంటుంది. మిష్టర్ దత్తు చాలరోజులనుంచి ఆత్మీయునిలాగా ఉంటున్నాడు మీదగ్గర. నేను నిన్నగాక మొన్నవచ్చినవాణ్ణి. నాకోసమని మీ రిలాచేస్తే ఈయింటి మర్యాదకు భంగం ఏర్పడుతుంది అదీగాక మీరుపొరపాటుగా అర్థంచేసుకున్నారు. దత్తుగారిమాటలను నేను పూర్తిగా అర్థం చేసుకున్నానని కాదు- నేను ఇంతకన్న ఎక్కువ కటూక్తులను కూడ సహించినవాణ్ణి. ఈ స్వల్పవిషయాన్ని పురస్కరించు కుని బాబుగారిమనస్సుకు ఆరాటాన్ని కలిగించవలసిన అగత్యం లేదు" అన్నాడు.

నిరంజనుడి ఓర్పుచూసి లలిత విస్మితురాలైంది. అతడి యుక్తులన్నిటినీ పూర్తిగా తెలుసుకొనేంత స్థిమితంగా లేదామె మనస్సు. "అయితే అన్యాయాన్ని సహిస్తారన్నమాట!" అన్నది.

యుక్తులను ప్రయోగించటం వృథాఅని నిరంజనుడు గ్రహించాడు. మరోఉపాయంతో లలితను శాంతపరచాలనే ఉద్దేశంతో "ఎంతసహించానో, అంతకన్న ఎన్నోరెట్లు ఎక్కువ బహుమానాన్ని పొందగలిగాను. ఇవాళ మీనుంచి ఏ మమ త్వాన్నయితే పొందానో దానివల్ల నామనస్సులోని దుఃఖ మంతా తొలగిపోయింది." అన్నాడు. ఆమాట లతడు మన స్ఫూర్తిగా చెప్పినట్లున్నాయి.

లలిత సిగ్గుపడింది "కాని ఇది ఆఖరుసారి. ఇక ముందు మిష్టర్ దత్తు మిమ్మల్ని అన్యాయంగా ఏదైనాఅంటే నాన్న

గారితో చెబుతాను నేను. అన్యాయాన్ని నేను సహించలేను" అన్నది.

ఇలాఅని ఆమె అక్కడినుంచి గబగబా వెళ్ళిపోయింది. నిరంజనుడి భయం మరెంత ఎక్కువయింది. అతడు అమాయకుడు కాడు. దత్తుగారు తనని ఒక్కనాటికీ క్షమించలేడు. రేపు మళ్ళీ అవకాశం చిక్కితే అలాగే మాట్లాడుతాడు, అని అతడు స్పష్టంగా తెలుసుకున్నాడు. చివరకు తనమూలంగా ఆ సంసారంలో ఒక ఘోరమైన అశాంతి ప్రబలవచ్చు. చివరకు తన బుర్రలోకి ఒక ఆలోచన వచ్చింది. అది ఆచరణయోగ్యం అవునో కాదో సలహా అడిగి తెలుసుకోటానికి అతడు భిల్లుక్ కోసమని వెళ్ళాడు.

## ౧౪

ఈ రెండురోజుల్లో రాయిసుణి సగమయిపోయింది. ఈ రెండు రోజులూ 'నన్ను క్షమించండి' అని కేవలం మనస్సులో జపించుకోసాగింది. తన క్షమాపణ అతడికి పంపటానికుపాయం ఏమీ కన్పించలేదు. అన్యాపదేశంగా ఈ సంగతి భిల్లుక్‌తో చెప్పింది. కాని అతడు అదిఅర్థం చేసుకోలేకపోయాడు. తాను చెప్పిన విషయాన్నే మళ్ళీ విశదపరచి చెప్పటానికి ఆమె సంకోచించింది. అప్పుడామెకు పుస్తకాల్లో ఎక్కడో చదివిన పాత గాథ ఒకటి జ్ఞాపకంవచ్చింది. ఇచ్ఛాశక్తిద్వారా మనస్సులోని సంగతి దూరంగాఉన్న ఆత్మీయునికి వినిపించినట్లు

ఆమె ఆ గ్రంథంలో చదివింది దానిమీద ఆధారపడే ఆమె తనని క్షమించమని మనస్సులో అన్ని విధాల ప్రార్థించింది. తన ఈ ప్రార్థన ఈపాటికి నిరంజనుడి దగ్గరకు చేరుకుని ఉంటుందనికూడా మధ్యమధ్య మనస్సులో అనిపించసాగింది.

ఇలా ఆలోచించుకుని ఒకవిధంగా నిశ్చింతురాలై అప్పటకు ఇంట్లోపను లేవో చూసుకోసాగింది. చీకటిపడగానే తన ఇచ్ఛాశక్తి యావత్తూ పూర్తిగా వ్యర్థమైపోయినట్లు తెలుసుకుంది. అప్పుడు మళ్ళీ కళ్ళనీళ్ళతో దూరంగాఉన్న ఆ ఆత్మీయునికి ఈ నివేదనే చేస్తూకూర్చుంది.

ఇలా రెండుసాయంత్రాలు గడిచిపోయాయి.

ఈ రెండురోజులూ ఏకోవిధంగా యింటిపనులు చేసుకుంటూనే వచ్చింది. కాని ఇవాళ మొత్తానికి ఏ పనిమీదకూ బుద్ధిపోనేలేదు. రెండు గంటలప్పుడు బజారుపని పూర్తిచేసుకుని చంద్రినాథుడువచ్చి "పెట్టు, అన్నం పెట్టు" అన్నాడు.

రాయిమణి కూర్చునే "ఇవాళ అన్నం వండలేదు నాన్నా! పొద్దుటి చద్దన్నం ఉంది తింటావా?" అని అడిగింది.

చద్దన్నంఅంటే చంద్రినాథుడికి చాలాయిష్టం. అంచేత అతడు అయిష్టత కనపరచకుండా, కాళ్ళూ చేతులూ కడుక్కుని వంటింట్లోకి వచ్చాడు. గిన్నెలోఉన్న అన్నం కంచంలో తానే పెట్టుకుని కూతుర్ని పిలిచి, "మరినువ్వో?" అనిఅడిగాడు.

రాయిమణి చీరె ఒళ్ళంతా కప్పుకుంటూ "నాకు చలిచలిగా ఉం దివాళ. నేను తినను"అన్నది.

చంద్రనాథుడు అన్నంతింటూ "అది మంచిపని. అనారోగ్యంగా ఉందని ముందుగా ఉపవాసం ఉండటం ఎంతైనా మంచిది" అన్నాడు.

తండ్రి నోటి ద్వారా పథ్యాలిషయంలో జాగ్రత్తగా ఉండాలన్న మాటలువిని రాయిమణి నవ్వుకుంది.

చంద్రనాథుడు అన్నంతినుంటూనేవుని ఏదో వాగటం ప్రారంభించాడు మధ్య మధ్య కూతుర్నిపిలిచి "ఏమీ మాట్లాడటం లేదేం?" అడి అడిగాను. రాయిమణి ఏదో మైకంక్రమ్మినట్లు కూర్చునిఉంది. తండ్రి విచిత్రవిషయాలు చెపుతూ, వాటి మీద తన విచిత్ర అభిప్రాయాన్నికూడా బైటపెడుతూంటే బాతాఖానీ వినాలనే ఆసక్తి లేదామెకు. అతడు చెబుతున్న వాటిలో ఒకమాటకు ఆమె చటుక్కున ఉలిక్కిపడి "ఏమిటి నాన్నా నువ్వుచెబుతున్నది?" అని అడిగింది.

"బాబుగారి సంగతే! ఆయనతో చెప్పాను. కాని ఈ ముసలివాడిమాట చెవిని పట్టించుకోలేదు" అని ఒక్క నిమిషంలో మళ్ళీ మధుఘోష్ మేకను ఎవరో దొంగిలించిన సంగతి చెప్పటం మొదలెట్టాడు. ఈ రెండింటికీ సంబంధం లేదనేసంగతి చెప్పటం అనవసరం.

రాయిమణి ఆమాటకు అడ్డువచ్చి "ఆసంగతి ఏమిటి నాన్నా! పూర్తిగా చెప్పలేదు" అని అడిగింది.

"ఓ! అదా? ఆనక చెపుతాలే" అని మళ్ళీ ఆ మేకగోడ చే చెప్పటం మొదలెట్టాడు. రాయిమణి ఇంక ఉండబట్టలేక "ఏమిటి నాన్నా! నువ్వు వాగేదానికి తుదీ మొదలూ లేదల్లే

వుందే. ఏదో ఒకసంగతి ప్రారంభిస్తావు- అంతలో మళ్ళీ మరో దాంట్లోకి లాగుతావ్. ఏమిటో గొడవగాఉంది" అన్నది.

"అదలాఉంచు. ఆ భిల్లుక్ సంగతి చూడు. అతను కల్లు తాగటం మానేశాడని బాబుగారు చెప్పారా? అతడుచాటుగా లొట్టెడుకల్లు తాగటం నేను కళ్ళారాచూశాను" అన్నాడు చంద్రనాథ్.

రాయిమణి నెల్లిగా వంటయింటి అరుగుమీదికి వచ్చి కూర్చుంది. నిరంజనుడిసంగతి తెలుసుకోటానికి ఆమెకుదొరికిన ఈ అవకాశం జారవిడువలేక పోయింది. "నువు అద్దరికి వెళ్ళావా నాన్నా! బాబుగారు కనిపించారా?"అని అడిగింది.

"ఊం. చూడలేదనుకున్నావా? నిన్ననేగా! ఎన్నిసంగతులు మాట్లాడాననుకున్నావ్! నదిలో ఎలాంటిచేపలు దొరికేదీ మధునావ ఎంత ఖరీదైందీ.— అన్నీ అడిగారు" అని భోజనం పూర్తిచేసి, "నువ్వు ఏమీ తినలేదల్లేఉంది. సాయంకాలం కాస్త సగ్గుజావ.."

రాయిమణి జవాబుచెప్పకుండా కూర్చుంది. బాబుగారిని కలుసుకోలేదని చెపితే తనమర్యాదకు భంగమని అతను ఇలా కల్పించిచెప్పాడు. కాని రాయిమణి అది తెలుసుకోలేదు. నిరంజనుడు ఇన్నిసంగతులుఅడిగి తనసంగతి అడిగి తెలుసుకోకపోవటానికి తాను చేసిన మహాపరాధం ఏమిటి? అని ఆలోచించుకోసాగింది. కాస్సేపు అలాగేకూర్చుని వసారాలోకి వెళ్ళింది. చంద్రనాథ్ ఒకదమ్ము హుక్కా లాగి, కూతుర్ని ఆరోగ్యంవిషయంలో జాగ్రత్తగా ఉండమని ఉపదేశమిచ్చి మళ్ళీ సాయంత్రం బజారుకు వెళ్ళాడు.

రాయిమణి పైటచెంగుతో కళ్లు ఒత్తుకుంటూ, తెల్ల కాగితం ఒకటి తీసుకొచ్చి; "క్షమించండి—తప్పుచేశాను" అని రాసి, తన మనస్సులోని భావం ఆ రెండు మాటల్లోనూ పూర్తిగా వచ్చిందా రాలేదాఅని అదే మాటిమాటికీ చదువు కుని చూసుకుంది. కాని ఆ ఉత్తరం ఆయన దగ్గరకు చేరటం యెలా? భిల్లుక్ చేతికివ్వటం వృథా—అజాగ్రత్త మనిషి, పారేసినా పారెయ్యవచ్చు. తండ్రిచేతికివ్వటం అసంభవం. ఆలోచించగా ఆలోచించగా ఒక కుర్రవాడు గుర్తుకొచ్చాడు. వాడు బుద్ధిమంతుడు వాడు ఒక వేళ విప్పిచూస్తే? అని మరు క్షణంలోనే తట్టింది. ఎంత ఆలోచించినా తీసుకెళ్ళే వ్యక్తి సరియైనవాడెవరూ స్ఫురించకపోయేసరికి, పాపం, ఆ అక్ష రాలమీదనే ఆమెకు కోపంవచ్చింది ఆ కాగితాన్ని ముక్కలు ముక్కలుగా చింపుదామని అనుకుంటూంటగానే పరిచితమైన కంఠం వినిపించి, ఆమె ఉలిక్కిపడి, ఆ కాగితాన్ని అలాగే గుప్పిట్లో పెట్టుకుంది

నిరంజనుడు మెల్లాలో అడుగుపెట్టి—"ఇవాళ ఏమీ తినలేదా మణీ! జ్వరం వచ్చిందా?" అని అడిగాడు.

రాయిమణి లంఘనం ఉన్నదన్నసంగతి నిరంజనుడు దారిలో చంద్రినాధుడివల్ల తెలుసుకున్నాడు ఆరోజున అలా హఠాత్తుగావెళ్ళి తన మనోదౌర్బల్యాన్ని వ్యక్తంచేసుకున్న సంగతి రాయిమణి గ్రహించకపోయినా తన పవిత్రతకు తానే సంకుచితుడైనాడు. ఆ సంకుచితత్వాన్ని కప్పిపుచ్చుకోటానికై ఏదో సహజంగా రెండు మాటలు మాట్లాడాలని ఈ రెండు మాటలూ దారిపొడుగునా ఆలోచించుకుంటూ వచ్చాడు.

రాయిమణి కేమీ స్ఫురించలేదు. దారుణమైన దుస్స్వప్నం తొలగిపోగానే ఆమె హఠాత్తుగా మూర్ఛురాలై పోయింది. నిరంజనుడు మళ్ళీ ప్రశ్నించేసరికి, ఆమె తల ఊగించి ఆ ప్రశ్నకు జవాబు చెప్పింది. నువ్వెందుకు మాట్లాట్టం మానేశావ్! అని అడుగుదామని నిరంజనుడికి నాలిక చివరదాకా వచ్చింది. కాని ఆమాట పెకలిరాలేదు. ఎదురుగా రాయిమణి ముఖం ప్రక్కకు త్రిప్పుకొని నిలబడి ఉంది—ఆ స్థితి నిరంజనుణ్ణి ఆదుర్దాపరచింది. అతడు వసారాలోకొచ్చేసే ముందు రాయిమణి ఆరోగ్యాన్ని గురించీ తరువాత చంద్రనాథుడి ఆరోగ్యాన్ని గురించీ అడిగాడు. తాను మాట్లాడకపోవటం ఏమీ బాగుండలేదని రాయిమణి గ్రహించింది. కాని ప్రసంగాన్ని పెంచేందుకు అనువైన మాటలేవీ ఆమెకు స్ఫురించలేదు. నిరంజనుడు కాసేపు అలాగే కూర్చుని, చివరకు 'నేను వెళుతున్నాను మణీ! నువ్వు కొంచెం జాగ్రత్తగా ఉండు" అన్నాడు.

రాయిమణి పరధ్యానం వదిలించి, గబగబా వసారాలోకొచ్చి, గళవస్త్రయై నిరంజనుడి పాదాలమీద పడి నమస్కరించి మళ్ళీ లేచి చప్పున ఇంట్లోకి వెళ్ళిపోయింది. రాయిమణి ఈ తొందరకు, ఆదుర్దాకు కారణం ఏమిటా అని అతడు తెలుసుకోటానికి ప్రయత్నిస్తూండగ—తన కాళ్ళదగ్గిర పడిఉన్న కాగితమ్ముక్కమీద పడింది అతడి దృష్టి. అది తీసుకుని చదువుకుని నిరంజనుడు అంతా తెలుసుకున్నాడు. తాను రాకపోవటానికి గల కారణం విషయమై రాయిమణికి ఏదో విచిత్రమైన అపోహ ఏర్పడింది. అందుకే ఆమె ఎంతో మనస్తాపాన్ని కూడా అనుభవించింది—అని తెలుసుకుని నిరంజనుడు

చాలా బాధపడ్డాడు. అంతా చెప్పేసి ఆమె మనస్సు తేలిక పరుద్దామనే ఉద్దేశంతో అతడు రాయిమణిని పిలిచాడు. కాని ఇంట్లోంచి జవాబేమీ రాలేదు. అప్పుడింకా మెల్లాలోనుంచే "నువ్వేమీ తప్పు చెయ్యలేదు మణీ! నాకసలు కోపమే రాలేదు" అని అన్నాడు బిగ్గరగా. అప్పటికీ లోపల్నుంచి చడీ-చప్పుడూ ఏమీ వినిపించలేదు. ఈ అభాగ్య యువతిని ఎలాగయినా ఊరడించిపోవటం చాలా అవసరమని తోచిందతడికి. మరో రోజున అయినట్లయితే ఏదో మాట్లాడి, వెళ్ళిపోయేనాడే. కాని ఇవాళ తన మనస్సును పూర్తిగా జయించాలి—అని ప్రతిజ్ఞచేసుకుని మరీ వచ్చాడు. రెండుసార్లుపిలిచినా రాయిమణి రాకపోయేసరికి నిరంజనుడు తానే లోపలికి వెళ్ళాడు.

అపరిమితమైన సంకోచాన్నుంచీ, తాను ఎదుటికి వచ్చినందువల్ల కలిగిన సిగ్గునుంచీ విముక్తిపొందాలనే వాంఛతో ఆమె చీకటింట్లో మూలకూర్చుని తనను మరుగుపరచుకుంది. నిరంజనుడు యింట్లోకివచ్చినాకూడా ఆమె సాహసించి ముఖం యిటుతిప్పలేకపోయింది.

నిరంజనుడు ఒక్క-క్షణం ఆ నిశ్చలమూర్తికేసి చూసి, గుమ్మం దగ్గిరనుంచే "నువ్వు బైటకిరా మణీ! నాకు చాలా పనులున్నాయి ఇప్పుడే వెళ్ళిపోవాలి" అన్నాడు.

రాయిమణి కాసేపు తటపటాయించి వసారాలోకివచ్చి తలవంచుకుని నిలబడింది. "నువ్వు చాలా పొరపాటుపడ్డావు. నాకసలు కోపమే రాలేదు. నాకు బోలెడన్ని పనులుండటం మూలాన నిన్ను కలుసుకోటానికి రాలేకపోయాను. అందుకని బాధపడకు" అన్నాడు. ఈ 'రెండుమాటలూ'అని అతడు వసా

రాలోంచి ఈవలికి వచ్చాడు మెల్లాలోకివచ్చి మళ్ళీవెనక్కి తిరిగి "మరోసంగతి లలిత నిన్నొకసారి చూడాలని అనుకుంటోంది. నవ్వువస్తావా?" అని అడిగాడు

రాయిమణి అతిమృదువుగా "రమ్మంటే, వస్తాను" అన్నది.

"సరే, ఎప్పుడో ఒకరోజునవచ్చి తీసుకొనిపడతా. ముందు నీకు బాగా కులాసాచిక్కనీ. కాని కాలిబాధ తగ్గిపోయిందా? ఏదీ చూడనీ——"

రాయిమణి నాలిక కరచుకొని చీరె ముందుకుచ్చెళ్ళతో పాదాలు కప్పుకొని కూర్చుంది. నిరంజనుడు నవ్వుతూ "ఓ! బ్రాహ్మడికి పాదాలు చూపించకూడదనా యేం? అపరాధమవుతుందనా?" అని మరుక్షణంలోనే గాంభీర్యం తెచ్చుకుని "కాని జాగ్రత్త! ఎక్కడా సెళ్ళలోకాని బురదలోకాని తిరగకు మళ్లీ మొదటికి వస్తుంది" అని నిరంజనుడు వెళ్ళిపోయాడు.

ఇన్నాళ్ళనుంచి రొమ్ములమీద రాళ్ళెత్తినట్లున్న హృదయంలోని భారమంతా నిరంజనుడి రెండుమాటలతో చేత్తో తీసేసినట్లు తొలిగిపోయింది చివరి ఈపరిహాసం మనస్సుమీద ఒక స్నిగ్ధమైన పైపూతను పూసిపోయింది.

౧౫

రావుసాహెబ్ గారు వ్యవహారవిషయికమైన ఏదో జటిల సమస్యలో పడిఉన్నాడపుడు చేతికందినక్కడున్న 'షెల్ఫ్'లోంచి లావాటి పుస్తకాలన్నీ ఒక్కొక్కటే లాగిచూసి టేబిల్ మీద కుప్పగా పడేశాడు. అయినా ఆ సమస్యకు సమాధానం దొరకలేదు. సరిగ్గా ఈసమయంలో లలితవచ్చి తండ్రివీపు నిమురుతూ వెనకనిలబడి "నాన్నా! కాస్సేపు అలా వెళ్ళి తిరిగిరానా?" అని అడిగింది.

ఆయన ముఖం పైకి ఎత్తకుండానే "ఇంత పెందరాళే ఎక్కడికెడతావ్?" అన్నాడు.

"పెందరాళే ఎక్కడ నాన్నా? నాలుగయిపోయింది యిప్పుడు."

"ఓ, అలాగా! గడియారం ఆగిపోయిందల్లే ఉందిలే" వాస్తవానికి టేబిల్ మీది 'టైంపీస్' పడింటికే ఆగిపోయింది. ఇందాకట్నుంచీ ఆ ఆడని గడియారమే రావుసాహెబ్ గారికి సమయాన్ని సూచిస్తోంది. అది ఆగిపోయిందని తెలుసుకున్నాక కూడా ఆయన మరోపుస్తకం తీసుకుని పేజీలు తిరగెయ్యటం మొదలెట్టాడు. "వెళ్ళనా నాన్నా?" లలిత మళ్ళీఅడిగింది.

రావుసాహెబ్ గారు పరధ్యానంగా "ఎక్కడికి" అని అడిగాడు.

"అవతలి గట్టుకు"

ఈసారి ఆయన హూం. అని నిట్టూర్చి "ఎవరితో కూడా వెడతావ్?" అన్నాడు.

"దత్తుగారు తీసుకెళుతున్నారు వెళ్ళనా?"

అప్పటికి రావుసాహెబ్‌గారి సమస్యకు సమాధాన మయిన 'పాయింట్' దొరికింది. "హూఁ" అన్నాడు.

లలిత నవ్వుతూ బైటికి వెళ్ళిపోయింది.

అవతలివైపుకు వెళ్ళాలి అనే లలితయొక్క ఈ సంక ల్పానికి ఓ చిన్న ఇతిహాసం ఉంది. లలితఎదుట నిరంజనుణ్ణి సందించి దత్తు ఏ పొరపాటయితే చేసిఉన్నాడో—ఆ పొర పాటు సవరించుకోటానికనీ దత్తు ఈ రెండురోజులనుంచీ లలిత వెంటవెంట తిరుగుతున్నాడు. లలిత మొదట్లో అతణ్ణి కొంచెం దూరదూరంగానే ఉండనిస్తూ వచ్చింది. కాని ఇవాళ ప్రొద్దు న్నుంచీ ఎందుకనో హఠాత్తుగా ఆమెకు అక్కడికి వెళ్ళిరావా లనే ఆలోచన కలిగింది. కాని కూడా ఎవరొస్తారు? ముందు భిల్లుక్‌ను బ్రతిమాలుకుంది. భిల్లుక్ ఏవేవో అభ్యంతరాలు చెప్పి ఆమెను ఆ ప్రయాణం మాన్పించాలని ప్రయత్నించాడు కాని లలిత అలా ఊరుకోక భిల్లుక్‌ను తప్పదని బలవంత పెడు తున్న సమయంలో మిష్టర్ దత్తు వచ్చి హాజరయినాడు. అతడు భిల్లుక్‌ద్వారా లలిత ప్రస్తావన వినగానే "అక్కడికి ఓసారి వెళ్ళి రావాలని నాకూ చాలా రోజులనుంచి అభి లాషగాఉంది. కాని సమయం కలిసొచ్చిందికాదు" అన్నాడు. లలిత వెంటనే "అయితే నాతోకూడా రారాదూ? నాన్న గారితో చెప్పిరానా?" అంది దత్తు ఒప్పుకున్నాడు ఎలాగోఅలా లలితమీద పోయినతనఆధిపత్యాన్ని తిరిగి నిలబెట్టుకోవాలిమరి.

నావలోంచి కాలుకింద పెట్టగానే "ఆ యిల్లెంతదూరం అనిఅడిగింది.

"ఏ యిల్లు?"

ఏయిల్లు అంటుందో లలిత అని దత్తు అనుమానించ సాగాడు. ఆ బెస్తవాళ్ళతో అతడికి మొదట్నుంచీ అసలు పరిచయమే తక్కువ. వాళ్ళు అంతమంచివాళ్ళు కారని చాలా రోజులనుంచీ వింటూ వస్తున్నాడు. ఆ దుస్సంఘటన జరిగిన రోజున తాను మిష్టర్ సేన్‌తోకూడ ఉన్నసంగతి గుర్తు కొచ్చింది. ఆసంగతి జ్ఞాపకంపెట్టుకుని ఇవాళ వాళ్లెవరైనా—అని ఆలోచనరాగానే "అది నాకు సరిగ్గా తెలియదు. అక్కడికి వెళ్ళాల్సినంత అవసరంపర్యాత్రమేముంది? నదిఒడ్డున కాస్సేపు తిరిగి వెళ్ళిపోదాం" అన్నాడు.

"ఉహూం నేను అక్కడికి వెళ్ళాలి." అని ఇద్దరుగొల్ల పిల్లలు ఆవుల్ని తోలుకెళుతూంటే వాళ్ళనుపిలిచి చంద్రనాథుడి ఇల్లెక్కడో అడిగి తెలుసుకుని లలిత అటుకేసి నడవ సాగింది. దారిలో ఆపల్లెలోనివాళ్ళు ఒకళ్ళిద్దరు ఎదురుపడ్డారు. దత్తు వాళ్ళముఖాలకేసి తీవ్రంగా పరిశీలించిచూశాడు. వారి మొహాల్లో మార్పుఏమీ కన్పించకపోయేసరికి కొంత కుదుట పడ్డాడు. ఆ సమయంలో అతడి కో చిత్రమైన ఆలోచన వచ్చింది. లలితకు చంద్రనాథుడితో—అతడి కూతురితో పరిచయం అవటం ఒకరకంగా మంచిదే! అనాగరికులైన వీళ్ళతో పరిచయమైతే వాళ్ళఅంతర్యాలు, అభిరుచులు ఎలాంటివో లలిత తనంతట తనే తెలుసుకోగలుగుతుంది. నిరంజనుడితో తనకు స్నేహంసంగతి ఆయువతి తన వ్యావహారికభాషలో భావప్రకటనచేస్తూ చెపుతూంది. అదివిన్నాక నాగరికురాలైన లలిత నిరంజనుడ్ని గురించి ఏ అభిప్రాయానికి వస్తుందో

ఊహించుకుని దత్తు తనలో తాను చాలా సంతో షించాడు.



తండ్రి కూతురు మెల్లాలో చాపవేసుకుని కూర్చుని ఉన్నారు. రాయిమణి మహాభారతంతీసి తండ్రికి నవాయుతో పాఖ్యానం చదివి విన్పిస్తోంది. శ్రోత అర్ధనిమీలితనేత్రుడై వింటూ ధూమపానం చేస్తున్నాడు. చటుక్కున ఆ హుక్కా అక్కడపెట్టేసి చంద్రినాథ్ లేచి కూర్చున్నాడు. రాయిమణి గుమ్మానికి అటుతిరిగి కూర్చునిఉంది. తండ్రి కంగారుగా లేవటం అదీ చూసి, ఆమె మొహం వెనక్కితిప్పిచూసి వెంటనే తల మీది ముసుగు ముందుకులాక్కుని గబగబా యింట్లోకిపోయి దూరింది.

చంద్రినాథ్ దత్తును, లలితను తెల్లబోయిచూస్తూ కూర్చున్నాడు. లలిత అతనిస్థితిచూసి, "భయపడొద్దు. మేము మీయిల్లు చూసిపోదామని వచ్చాం" అన్నది.

చంద్రినాథ్ అప్పటికీ మాట్లాడలేకపోయాడు. ఈసమయంలో రాయిమణి తలుపుచాటున నిలబడి వాళ్ళు కూర్చునేందుకు రెండు పీటలులాంటివి చేత్తో ముందుకు త్రోసింది. ఆ చప్పుడుకు చంద్రినాథుడి పరధ్యానం వదిలింది.

అతడు గబగబా ఆరెండూ తీసుకొచ్చివేసి 'కూర్చోండి' అన్నాడు. దత్తు కూర్చున్నాడు. లలిత నుంచునే "నువ్వు చంద్రనాథుడి వనుకుంటాను" అన్నది.

చంద్రనాథుడు సగర్వంగా "చిత్తం దొరసానమ్మ గారూ!" అన్నాడు. లలిత నవ్వుతూ "నేను దొరసానిని కాను.

మన హిందువుల అమ్మాయిలను ఎలాపిలుస్తారోనన్నా అలాగే పిలు''అంది. లలిత అలాఅనేసరికి చంద్రనాధుడికి సాహసంవచ్చి "చిత్తం, అలాగే" అన్నాడు.

తర్వాత లలిత రోజువారీపంగతులు లేవో అడిగింది. చంద్రనాధ్ ఒక్కప్రశ్నకు బోలెడన్ని సుఖదుఃఖాలు గుచ్చెత్తి చెప్పాడు. అందులోనే ఈమధ్య తనకు చచ్చేంత జబ్బుచేసి చిక్కిసగమైనానన్న పంగతికూడా చెప్పడం మరిచిపోలేదు. మాటలసందర్భంలో నిరంజనుడిసంగతికూడా వచ్చింది. చంద్రనాధ్ గబుక్కున చేతులురెండూ జోడించి అతణ్ణి ఉద్దేశించి నమస్కరించి "అయ్యగారా, దేముడు నిజంగా అమ్మగారూ!" అన్నాడు. తర్వాత చంద్రనాధ్ అతడి గుణాలను వర్ణిస్తూంటే దత్తుగారికి మనస్సులో మంటగానేఉంది. కాని లలితకు చాలాబాగుంది. గొప్పకుటుంబంలో పుట్టినవాడు ఎలా తను బీదకొంపలో చేపలకంపు భరిస్తూ తెల్లవార్లు గడపగలిగాడో– నీళ్ళూ బురదా అనక రోజూ ఇంతదూరమూ వచ్చి ఎలా మందూమాకూ ఏర్పాటుచేశాడో అవన్నీ అతడువర్ణించి చెబుతూంటే ఎంతో వినసొంపుగా ఉన్నాయి. నిరంజనుడు తమ ఆత్మీయుడేఅని చెప్పాలనే ఉద్దేశ్యంతో "అతడు ఇవన్నీ చెప్పగా విన్నాను. అతడు నీకు చాలా ఇష్టుడుకదూ!" అంది.

అతడంటే తమ కెలాంటి భావం ఉందో చంద్రనాధ్ చెప్పబోతూండగా మిష్టర్ దత్తు లేచి "వెడదాంపద లలితా! ఇంక నావ దొరకదు ఆలస్యమైతే" అన్నాడు.

"వస్తున్నా" అంది లలిత చంద్రనాధునకేసి తిరిగి "ఆ అమ్మాయి ఎక్కడ?" అని అడిగింది.

చంద్రనాథ్ ఇంట్లో ఉన్నదని చేత్తో సంజ్ఞచేశాడు. ఆమె సిగ్గుతో లోపలికి వెళ్ళిఉంటుందని లలిత గ్రహించింది. పిలిచినా బైటికిరాదు అని ఊహించుకుని "ఇంట్లో ఇంకా యెవరున్నారూ?" అని అడిగింది.

ఆ కూతురుతప్ప ప్రపంచంలో తన కింక ఎవరూ లేరని చంద్రనాథ్ సూచించాడు. అతడింకా ఏదో చెప్పబోతుండగా లలిత ఇంకేమీ లక్ష్యపెట్టుకోకుండా సరాసరి లోపలికి వెళ్ళింది.

రాయిమణి తలవొంచుకుని వీళ్ళమాటలు వింటూ పరధ్యానంగా కూర్చుని ఉంది. తలమీది చెరగు క్రిందికి జారి పోయిం దామెకు. లలిత లోపలికి వెళ్ళగానే గడ్డం పుచ్చుకుని ఆమెముఖం పైకెత్తి "లే, నేను లలితను" అంది.

లలితకాళ్ళకు చెప్పలున్నా ఆమెవస్తున్నట్లు రాయిమణి గమనించలేదు. రాయిమణి చటుక్కున లేచి కూచుంది. ఆమె పేరు అదివరకే విని ఉన్నది ఆమెనుచూడగానే ఈమె లలిత అయిఉంటుందని ఊహించుకుంది. ఈ కరుణామయితో ఏం మాట్లాడాలో ఆమెకు తోచలేదు. లలిత ఆమె రెండుబుజాల మీదా చెయ్యేసి, "నన్నుచూసి సిగ్గుపడుతున్నావా? ఛీ! నేను ఎన్నాళ్ళనుంచి నిన్ను చూడాలనుకుంటున్నా, నువ్వే రాలేదుగా" అంది.

రాయిమణి అతినెమ్మదిగా "ఎప్పుడురమ్మంటే అప్పుడే వస్తా" అన్నది. అభిజాత్యమూ, మర్యాద, చదువుకున్నానన్న గర్వమూ అన్నీ ఆక్షణంలో మరచిపోయింది లలిత. "రోజూ వస్తూఉండాల్సిందే నువ్వు. అట్టే దూరంలేదు. మన మిద్దరం రోజూ కబుర్లు చెప్పుకోవచ్చు" అంది.

రాయిమణి నేత్రాలు సంతోషంతో ప్లావితములయి నాయి "ఏడుస్తున్నావా?" అని అడిగింది. లలిత.

"లేదు."

"అయితే మరి కళ్ళల్లో నీళ్ళేమిటి?"

ఈసారి కళ్ళనీళ్ళాపుకోటం నిజంగా కష్టమయింది. రాయిమణి పైటచెంగుతో కళ్ళనీళ్ళు తుడుచుకుని, "నన్ను పంపమని మా నాన్నతో చెప్పండి" అంది.

"రేపు పొద్దున్న వస్తావుగా. సరే, బైటకిరా మీ నాన్నతో చెపుతాను" అని లలిత బలవంతాన రాయిమణిని బైటికి లాక్కొచ్చి, చంద్రనాథ్‌తో "రేపొద్దున మీరిద్దరూ మాయింటికి రావాలి. అక్కడే భోంచెయ్యాలి అంది.

చంద్రనాథ్ కొంచెం సంకోచించాడు. "ఏం మాట్లాడ వేం?" అని అడిగింది లలిత.

"నేను అవేమీ తినలేను—"

"'అవేమీ'-అంటే ఏమిటవి" అని అడిగింది లలిత ఆశ్చ ర్యంతో. చంద్రనాథ్ తలగోక్కుంటూ "బాబర్చీలు వండే మాంసం అవీ-" అన్నాడు.

లలిత నవ్వుతూ "మావేషభాషలు ఇలా ఉన్నాయని రోజూ మేం మాంసమే తింటామనుకుంటున్నావా? మా అమ్మ తులసిఆకులు వెయ్యని నీళ్ళుకూడా తాగదు" అంది.

ఆమాటవిని చంద్రనాథ్ సంతోషంతో "అయితే నేను అమ్మగారి ప్రసాదం పుచ్చుకుంటాను" అన్నాడు.

వెళ్ళబోయేముందు రాయిమణి ఇంట్లోంచి తియ్యమామిడికాయలు కొన్ని తెచ్చి తండ్రిచేతికిస్తూ "వాటిని అటువైపు దాకా పంపించిరా నాన్నా" అంది.

ఆమాట లలితచెవిని పడింది. "ఇవాళకు తీసుకెడుతున్నా ఇవి. రేపుకనుక రాకపోయారావంటే అన్నీ తిప్పిపంపించేస్తా, ముందుగానే చెపుతున్నా" అంది.

కొద్ది పరిచయంతోనే ఇలా అంతర్యాలుకలిసిన ఈ సాయాసముద్రం రాయిమణికి ఎంతో ఆనందాన్ని కలిగించింది.

చీకటిపడ్డాక తండ్రిరాగానే "అటుప్రక్కకు వెళ్ళావా నాన్నా?" అని అడిగింది రాయిమణి.

ఎవరిసంగతి తెలుసుకోవాలని ఈ ప్రశ్న అడిగిందో ఆ సమాధానంలేదు. చంద్రనాథ్ ఒక్కగుక్కలో తను ఎంత దూరం వెళ్ళివచ్చిందీ కథఅంతా చెప్పి, చివరకు "భిల్లుక్ మామిడికాయముక్కలు తీసుకున్నాడు. అయ్యగారు ఎక్కడికో వెళ్ళారని తెలిసింది. ఈదొరగారు మన్నిగురించి ఏవేవో చెప్పాట్ట! అంతముంచివాడుగా కన్పించటంలేదు మణి!" అన్నాడు.

మిష్టర్ దత్తునుగురించి అతడిఅభిప్రాయాన్ని బైటపెట్టి పలుకాల్లో పొగాకు వేసుకుంటూ కూర్చున్నాడు.

౧౬

తూర్పువైపు కిటికీ తెరుచుకుని, శాలువా వొకటి కప్పుకుని ఎండ మీదపడేట్లు మంచంవేసుకు పడుకున్నాడు నిరంజనుడు. రాత్రి అతడికి బాగా జ్వరం తగిలింది. ఆ జ్వరతీవ్రత ఇప్పటికీ ఉందియింకా. పొద్దున్నే లేచి భిల్లుక్‌ను ఏదో పనిమీదపంపి అతడు గదిలోకివచ్చి మెదలకుండా పడుకున్నాడు. తొమ్మిదయినా భిల్లుక్ ఇంకా రాకపోయేసరికి, అతడసలు వెళ్ళాడో లేదో తెలుసుకువద్దామని లేవబోయేసమయంలో లలిత అతని గదిలోకివచ్చి "మీరున్నారా! ఎవరూ లేరనుకుంటున్నాయింకా నేను!" అన్నది.

ఆమాట అక్షరాలా అబద్ధం గదితలుపు తీసేఉంది. లలిత దూరంగా ఉన్నప్పటికీ, ఎర్రశాలువ కప్పుకుని కూర్చున్న ఈ వ్యక్తి కన్పించక మానదు. ఈసంధ్య ఆమె తోటలోకి షికారు వెళ్ళేప్పుడు నిరంజనుడు వున్నాడో లేడో అని తొంగి చూసిపోతూవచ్చింది. ఇవాళా అలాగే వచ్చింది.

నిరంజన్ తనకు అస్వస్థతగా ఉన్న సంగతి చెప్పకుండా, "ఆఁ, ఇవాళ యింకా బైటికి వెళ్ళలేదు" అన్నాడు. లలిత ఇహ వెళ్ళిపోతుందిలే అన్న ఉద్దేశంతో అతడు మంచంమీదనుంచి లేవలేదు. కాని లలిత వెళ్ళలేదు 'గుమ్మంకేసితిరిగి లోపలికిరా' అన్నది.

లలితపిలుపుతో లోపలికివచ్చి తనకి నమస్కరించిన వ్యక్తిని చూసేసరికి నిరంజనుడు వణికిపోయాడు. అతడి వణుకును ఎవరూ కనిపెట్టలేరు. లలిత నవ్వుతూ "మాశారా!

మీరు తీసుకురాలేకపోయారు కాని, నేను తీసుకువచ్చాను. మణికి చదువువచ్చునని మీరు మొదట్లోనే చెప్పారు కాని, ఇంతగుణవంతురాలని చెప్పారు కాదు. బహుశా మీకు తెలియదనుకుంటాను" అంది.

నిరంజనుడు ఈమాటకు జవాబుచెప్పలేదు. మంచం మీదనుంచి లేచివచ్చి "కూర్చోండి" అన్నాడు.

"బాపురే! కూచోటానికి వీలెక్కడుంది? ఎన్నిచేపలు వచ్చాయో! వాటినన్నీ తరగాలి. ఆవిద్య ఇవాళ నేను మణి దగ్గర నేర్చుకుంటాను తెలుసా?" అని ఇంతమహావిద్య తాను కదా నేర్చుకోబోతున్నాననే సంతోషంతో – ఆ ఉపాధ్యాయిని చెయ్యిపుచ్చుకుని లాక్కుపోయింది. రాయిమణి ఒకసారి వెనక్కి తిరిగి చూసింది. తానుచేయబోయే ఈ పనివల్ల నిరంజనుడు అసంతుష్టుడవుతాడేమోనని ఆమె భయపడింది. కాని ఆ చిహ్నాలు అతడి మొహంలో ఏమీ కన్పించకపోయేసరికి నిశ్చింతగా లలితతోకూడా వెళ్ళింది.

రాయిమణిని లలిత తీసుకువచ్చిందనటంలో నిరంజనుడికి సందేహమేమీలేదు. లలిత ఒకపని చేద్దామనుకుంటే అది చేసేంతవరకూ నిద్రపోలేనిమనిషి. ఈ కొద్దిరోజుల పరిచయంతోనే నిరంజనుడు ఆ విషయం గ్రహించాడు.

సమానవయస్కురాండ్రి స్నేహం లలితకు ఎంతైనా అవసరం. ఇంట్లోవున్న ఆడవాళ్లు గృహిణీ, దాసీ మాత్రమే. భోజనసమయంలో తప్ప ఆ యిద్దరితోనూ లలిత ఎక్కువగా మాట్లాడదు. అదీగాక మనస్సులోని సుఖదుఃఖాలు అవి ఎంత చిన్నవైనా చితకవైనా ఒకరితో చెప్పకోందే ఉండలేదు. అది

మానవ స్వభావం. ఇంట్లో ఉన్న మిగిలినవాళ్ళతో సహజంగా ఉన్న అంతరాన్ని పురస్కరించుకుని దానికి తగినట్లుగా ఆమె పట్ల ప్రవర్తించకతప్పింది కాదు. అంచేత ఆమె రాయిమణి ఉన్నంతసేపూ ఆమెకు ఊపిరిసలపనివ్వలేదు.

ఆమెను నెయ్యపుప్రశ్నలేసి, వందవిధాల ఆదరణ వ్యక్తం చేసి ఆమెను ఆత్మీయురాలినిగా చేసుకుంది. తను యిద్దరిమధ్య వేషభాషల్లోతప్ప మరోకవిధమైన అంతరం ఉందని ఉభయులూ గమనించనేలేదు.

రోజల్లా మణితో గడిపి, ఆమెదగ్గిర అనేకవిధాలైన ఇంటిపనులు నేర్చుకోవటంతో పాటు— కూరలుతరగటంకూడా నేర్చుకుని, అందుకు చిహ్నంగా రెండుచేతులవేళ్ళకు ఏడెనిమిది కత్తిపీటగంట్లు పెట్టుకుని, ఆమెతో పాటు బైటికివచ్చింది లలిత. గృహధర్మాలవిషయంలో స్త్రీలకు సహజంగా ఏ అనురాగమయితే ఉంటుందో—అది మణి సాహచర్యంవల్ల లలిత మనస్సులోంచి పైకి వ్యక్తమయింది.

నిరంజనుడిగదిలోకి వెళ్ళి లలిత, రాయిమణి యిద్దరూ ఉలిక్కిపడ్డారు. తలకు రుమాల బిగించి నిరంజనుడు కళ్ళుమూసుకుని పడిఉన్నాడు. అతడి ముఖమంతా ఎర్రగా ఉంది. లలిత కొంచెంసేపు సంకోచించి నిరంజనుణ్ని పిలిచింది కాని సమాధానంలేదు. రాయిమణి అతడి నుదురుమీద చెయ్యేసి "చాలా జ్వరంగాఉంది, అమ్మాయిగారూ!" అంది.

ఈ స్థితిలో ఏంచెయ్యాలో లలిత స్థిరీకరించుకోలేకపోయింది. మణి ఉద్వేగంతో "భిల్లుక్‌ను ఒకసారి పిలిపించండి అమ్మాయిగారూ" అంది.

అయిదునిమిషాలు పోయాక భిల్లుక్‌ను వెంటపెట్టుకుని వచ్చింది లలిత. "భాయిజీ" అని పిలిచాడు భిల్లుక్.

నిరంజనుడు మాట్లాడలేదు. "జ్వరం ఎక్కువగానే ఉంది అమ్మా! బాబుగారితో చెప్పి డాక్టరుగార్ని పిలిపించండి, భయంలేదు" అని లలితను, మణిని ఓదార్చి పంపించి, విసన కర్రతీసుకుని విసురుతూ తలాపిదిక్కున కూర్చున్నాడు భిల్లుక్.

సఖురాండ్రిద్దరూ కొంచెంసేపు నిశ్చింతగా గడిపారు కాని డాక్టరువచ్చినదాన్నిబట్టి రావుసాహెబ్‌గారు చాలా చింతితులైనారు. డాక్టరు అరగంట పరీక్షచేసి 'న్యూమోనియా' అని నిర్ధారణచేసి, లలితకేసి తిరిగి "చాలా జాగ్రత్తగా వుండాలి" అని చెప్పాడు.

రాయిమణి డాక్టరుగారి అభిప్రాయాన్ని తెలుసుకోవాలని గుమ్మందగ్గర నుంచునివుంది. లలిత బైటకు వచ్చేసరికి మణి ఆమెచెయ్యిపట్టుకుని, "నిజంచెప్పండి అమ్మాయిగారూ! ఎలావుంది?" అని అడిగిందది.

లలిత ఆమెముఖంకేసి చూసి, "నువ్వు అదుర్దాపడటం దేనికి? అదే తగ్గిపోతుంది" అన్నది.

"డాక్టరుగారు చాలా జాగ్రత్తగా ఉండాలని చెప్పారుటగా!"

ఈ సమయంలో రావుసాహెబ్‌గారు బైటికి వచ్చారు. లలితను పిలిచి, "దత్తుకు కబురుపంపి, కలకత్తానుంచి నర్సుని పిలిపించమని చెప్పు" అన్నాడు.

"నర్సు ఎందుకు నాన్నా?"

"ఉపచారంచేయటానికి కావొద్దూ?"

"మేం చెయ్యలేమూ నాన్నా!" అని లలిత మణికేసి చూసింది. రాయిమణి నిస్సంకోచంగా తల ఊగించి అంగీకారాన్ని తెలిపింది. అయినా రావుసాహెబ్‌గారుమాత్రం "బహుశా మీవల్ల కాదేమో! ఇవన్నీ ట్రైనింగ్ పొందాల్సిన పనులు" అన్నాడు.

"బాగానే చేయగలం నాన్నా! మీరు నర్సుకోసం పంపకండి. ఆత్మీయులు నేర్చుకోకపోయినా చేయగలిగినంత ఉపచారం అలాంటి నర్సులు పదిమందైనా చెయ్యలేరు తెలుసా?"

అందులోని యదార్థాన్ని ఆయన తెలుసుకున్నాడు. "సరే, అయితే ఇవాళ్టికి పోనియ్ రెండురోజులు మీరు కని పెట్టి వుండండి. అవసరమైతే అప్పుడు చూద్దాం" అని కొంచెందూరం వెళ్ళి మళ్ళీ వెనక్కితిరిగివచ్చి "కాని, నర్సుని పిలిపించటమే మంచిదని నా మనస్సుకి తోస్తోంది లలితా!" అన్నాడు.

"రెండురోజులు మమ్మల్ని చూడనియ్ నాన్నా! ఆ తర్వాత అవసరమయితే పిలిపిద్దురుగాని"

ఇహ మణికి లలితకు సంప్రదింపులు ప్రారంభమైనాయ్. నర్స్ అంటే అర్థమేమిటో లలిత మణికి చెప్పగానే "అక్కర్లేదు అమ్మాయిగారూ! మనం యిద్దరం, భిల్లుక్ ముగ్గురంకలసి ఉపచారాలు బాగానే చేయగలం. మీరు కొంచెం నాకు నేర్పారంటే-నేను రాత్రిళ్ళు బాగాన్నే మేల్కొని ఉండగలను" అంది మణి.

ఇలా నిర్ణయించుకున్నాక, రాయిమణి వచ్చి చంద్రనాథ్‌కు అన్ని సంగతులూ చెప్పి, "నువ్వు ఇంటికి వెళ్ళు నాన్నా! నేను యిక్కడ ఉండకపోతే వీల్లేదు" అంది.

"సరే, కాని, బాబుగార్ని ఏమీ తిననీయకండి."

"నువ్వు జాగ్రత్తగావుండు నాన్నా! ఎవ్వరులేరుకదా అని మళ్ళీ అపథ్యంమాత్రం చెయ్యకు"

"అపథ్యమా? బాబుగారికి జబ్బు అనగానే నాకసలు ఆహారంమీద యిష్టమే తప్పింది మణీ!" అని ఆయనను జబ్బు పోగొట్టమని యిష్టదైవానికి మొక్కుకున్నాడు చంద్రనాథ్.

రాయిమణికూడా యిష్టదైవానికి నమస్కరించి "నువ్వు ఉపోషాలుమాత్రం ఉండొద్దు నాన్నా. రెండుపూట్లా ఇంత ఉడకేసుకుని తింటూఉండు. తెలిసిందా?" అంది.

కూతురి ఆజ్ఞప్రకారం నడుచుకోటానికి ఒప్పుకుని, చంద్రినాథుడు వెళ్ళిపోయాడు.

రాయిమణిమాట అబద్ధంకాదని లలిత రెండురోజుల్లోనే గ్రహించింది. ఆమె డాక్టరు, లలిత ఎలాచెపితే అలా చెయ్యగలుగుతోంది. కాని రాత్రిళ్ళు విశ్రాంతితీసుకోమంటేమాత్రం తీసుకోటంలేదు. తెల్లవార్లూ రోగికి విసురుతూ కూచ్చుంటోంది. తెల్లవారకట్లగాని చేతిలోవిసనకర్ర ఆమె కింద పెట్టటంలేదు. నిరంజనుడికి ఏదైనా ఆహారం ఇవ్వాల్సినప్పుడే మాత్రమే అతడి మంచంమీదనుంచి లేస్తోంది అప్పుడుకూడా అక్కడ కూర్చునిఉంటే అతడి జాతిధర్మానికి లోపం వస్తుందేమో అని ఆమెభయం. అందుచేత ఆ సమయంలోమాత్రం అక్కడినుంచి లేచి బైటికి వెళుతోంది.

పన్నెండురోజులకు నిరంజనుడికి తెలివివచ్చింది. కళ్ళు తెరవగానే అతడు రాయిమణి శుష్క-వివర్ణముఖం చూశాడు. అతి క్షీణకంఠంతో "నువ్వు ఇక్కడ ఉన్నావేం మణీ?" అని అడిగాడు.

రాయిమణి కంపించిపోయింది. జీవితంలో పేరుకున్న దిగుళ్ళన్నీ ఈ ఒక్క-మాట అడిగేసరికి ఒక్క-క్షణం దూరంగా పోయాయ్. నిరంజనుడికి తెలివి వచ్చింది. రాయిమణి ముఖం ఆనందంతో ఉద్భాసితమైంది. తలమీద చెరగుకొంగు కొంచెం ముందుకు లాక్కుని, "ఆc. అమ్మగారు కూర్చోబెట్టి వెళ్ళారు" అంది.

నిరంజనుడు జిజ్ఞాసదృష్టితో మణిముఖంకేసి చూస్తూ, "అమ్మగారంటే-లలితా?" అన్నాడు. మణి తల ఊగించింది. తర్వాత నిరంజనుడు మాట్లాడలేదు. తన స్థితి అంతా తెలుసుకునే ఓపిక రాలేదతడికి. మళ్ళీ మైకం కమ్మింది.

నిరంజనుడికి తెలివి వచ్చిందని తెలుసుకుని రావుసాహెబ్‌గారు లలితతోగూడా అక్కడికి వచ్చారు. డాక్టరువచ్చి పరీక్షించి నవ్వుతూ—"ఇంకే భయంలేదు. ఈసారికి బ్రతికి పోయినట్లే" అన్నాడు.



మర్నాడు ఉదయం నిరంజనుడికి తెలివి పూర్తిగా వచ్చింది. విహ్వాలునిలాగా అతడు అటూ ఇటూ చూడ సాగాడు. లలిత కొంచెం దూరంలో ఒక పుస్తకం తెరుచుకుని

కుర్చీలో కూర్చుని, మధ్యమధ్య తలయెత్తి నిరంజనుడికేసి చూస్తోంది. నిరంజనుడికి స్పృహరావటం చూసి ఆమె గబగబా దగ్గిరకువచ్చి, చిరునవ్వు నవ్వుతూ "ఆహారం ఏమయినా తీసు కుంటారా!" అని అడిగింది.

నిరంజనుడు లలితముఖంకేసి అలాగే చూస్తూఊరుకుని, చివరకు "ఊహూఁ" అన్నాడు

"ఊహూఁ అంటేకాదు, ఏదో కాస్త తీసుకోకతప్పదు." అని లలిత లేచివెళ్ళింది. కొంచెంసేపట్లో ఒకగ్లాసుతో దానిమ్మ గింజలరసం తీసుకొచ్చి "తాగండి" అంది.

నిరంజనుడు గ్లాసు అందుకోకుండా ఆమెచేతిని తనచేతు ల్లోకి తీసుకుని "మీ ఋణం నే నెన్నటికి తీర్చుకోలేను— నాకోసం—" ఆ తర్వాత గాద్గద్యంవల్ల మాటరాలే దతడికి. సరళహృదయుడైన అతడి ఆ మాట ఆమెను బాధపెట్టింది. పంటితో పెదిమను బిగబట్టుకుని, ఆమె ఆగ్లాసు నోటికి అందిం చింది నిరంజనుడు మెల్లిగా ఆ రసమంతా తాగేసి, "నాకేం జబ్బుచేసింది!" అని అడిగాడు.

"జ్వరం!"

నిరంజనుడికి నమ్మకం కలగలా. అయినా ఆమె మాటకు ఎదురాడకుండా "మణి యెక్కడ?" అని అడిగాడు.

"ఇవాళప్రొద్దునే ఇంటికెళ్ళింది. నాతో చెప్పికూడా వెళ్ళలేదు. భిల్లుక్‌ను కూర్చోపెట్టి వెళ్ళింది. పాపం ఆమె ఎంత శ్రమపడింది! ఈ పన్నెండురోజులనుంచీ కన్నుమూయలేదు. ఆ మొదటిరోజున విసనకర్ర తీసుకుని కూర్చున్నమనిషి—" అంతవరకూచెప్పి లలిత ఆగింది. సగం మూతలుపడిన నిరంజ

నుడి కనుకొలకుల్లో నీటిబిందువులు నిలిచిఉండటం . చూసింది తెలివికలది కనుక లలిత వెంటనే ప్రసంగం మార్చి, "మీరు నిద్రపోతారా? లేక నేనో కథ చదువుతాను వింటారా? మంచికథ, చాలా బావుంటుంది 'అని లేచివెళ్ళింది.

రాయిమణి ఎందుకువెళ్ళిపోయిందో నిరంజనుడుకి తెలుసు. రోజూ రాత్రిళ్లు మేలుకునిఉండటంవల్ల ఆనాడు తెల్లవారుఝామున మాత్రం నిద్రపోయింది. తూర్పు తెలతెల వారుతూండగా నిరంజనుడికి మెళుకువవచ్చి చూసేసరికి రాయి మణి ఒళ్లు తెలియనినిద్రలో ఉంది ఆమెతల నిరంజనుడి రొమ్ము మీదఉంది. అతడు కంపించిపోయాడు. మరుక్షణంలోనే అతను అతి బలవంతాన "మణీ!" అని పిలిచాడు మణికి మెళుకువ వచ్చి లేచి సిగ్గుతో మంచానికి మూడుబారల దూరంలోకి వెళ్ళి కూర్చుంది. నిరంజనుడు ఆమెకేసి చూడకుండానే "నువ్వు యింటికివెళ్ళు మణీ! నాకు జ్వరం తగ్గిపోయింది" అన్నాడు. మణి ఏమీ మాట్లాడలేదు. లేచివెళ్ళి గుమ్మంలో కూర్చుని ఎప్పుడు తెల్లారుతుందా అని ఎదురుచూడసాగింది. ఒక్కక్షణం అజాగ్రత్తవల్ల కలిగిన సిగ్గుతో ఆమెశరీరం కుంచుకుపోయింది.

వెలుతురురాగానే రాయిమణి తలుపు తెరచుకొని మెల్లిగా బైటికివచ్చి, భిల్లుకొను పిలిచి చెప్పి, నిద్రపోతున్న నిరంజనుడిమంచంమీద తలఆనించి నమస్కరించి వెళ్ళి పోయింది.

౧౮

చంద్రనాథ్ వసారాలో కూర్చుని, తాపీగా హుక్కా పీలుస్తున్నాడు. రాయిమణి ఇంత పెందలాడే రావటంచూసి, ఏమి అనర్థకం ముంచుకొచ్చిందో అనే ఆశంకతో త్రాగు తున్న హుక్కా వదిలేశాడు. రాయిమణి తండ్రిముఖంకేసి చూసి, "అదేమిటి నాన్నా అలా అయిపోయావేం?" అని అడి గింది. చంద్రనాథ్ హుక్కాగొట్టం క్రిందఆనించి— "బాబు గారు—

"కులాసాగానే ఉన్నారు. ఇంక నేను ఉండాల్సిన అవ సరంలేదు కనుక వచ్చేశాను."

"బ్రతికిపోయాను మణీ! ఇంతపొద్దున్నే నువ్వు రావటం చూసేసరికి నాకు పై ప్రాణాలు పైనే ఎగిరిపోయాయ్. రోగి దగ్గిర్నుంచి వచ్చేప్పుడు ఇలా బిక్కమొహంతో వస్తారంటే ఎక్కడైనా! మంచిదానివే!" అని చంద్రనాథ్ మళ్ళీ హుక్కా తాగటం మొదలెట్టాడు. రాయిమణి మెదలకుండా కూర్చుంది. చంద్రనాథ్ బాబుగారిసంగతులు మళ్ళీఅడగబోయేసరికి, "ఇంక అంతకన్న వేళే సంగతులేవీ లేవా యేం నాన్నా!" అన్నది. చంద్రనాథ్ ఆశ్చర్యపోయాడు. బాబుగారివిషయంలో మణి ఇంత ఆవేశం చూపించగా అత డెన్నడూ చూడలేదు...

"నేను విడిచిపెట్టివెళ్ళిన ఆవల ఏమయింది?" అని అడి గింది మణి.

"దాన్ని నేను అమ్మేశాను."

"అన్మోశావా? అయితే మరి ఇవాళ నేను చేపలుపట్టు కొచ్చే దెలా?

"అది అమ్మకపోతే ఏం తినేవాడిని? ఉపోషాలుండటం నావల్ల కాలేదు."

చంద్రనాథ్ మళ్ళీ హుక్కాలో పుగాకుపేసుకుంటూ కూర్చున్నాడు. రాయిమణి కాళ్ళుకడుక్కుని గదిలోకి వెళ్ళింది.

మణికి కోపంవచ్చిందని చంద్రనాథ్ గ్రహించాడు. బాబుగారి సంగతు లింకా అడగటాని కతనికి ధైర్యంచాల్లేదు. అత డింకోగుక్క హుక్కాలాగి బైటికి వెళ్ళిపోయాడు

చంద్రనాథ్ వెళ్ళిపోయాక రాయిమణి దిండులోతలదాచుకుని చాలా సేపు అలాగే పడుకుంది. రాత్రి చివరికి జరిగిన సంఘటన గుర్తుకొచ్చేసరికి సిగ్గుతో ఆమెశరీరం కుంచుకుపోయింది. నాలిక కొరుక్కుని తనలోనే ఛీ ఛీ! అనుకుంది.

ఇలా ఎంతసేపు గడిచిపోయిందో చెప్పలేం; హఠాత్తుగా బైట భిల్లుక్ పిలుపు విని, గబగబా బైటికివచ్చి "ఏమిటి సంగతి?" అని అడిగింది.

"ఏమీలేదు పిచ్చితల్లీ! బాబుగారు నిమ్మకాయలు తీసుకురమ్మని నీదగ్గిరకు పంపారు. చంద్రనాథ్ ఎక్కడ?"

మణికళ్ళల్లో ఆనందదీప్తులు వెలిగాయి. "మాలవల్లి కేసి వెళ్ళాడనుకుంటా. నువ్వు కాసేపు కూర్చో, నేను నిమ్మకాయలు కోసుకొస్తాను." అని వెళ్ళిపోయింది.

నిమ్మకాయలకోసమని భిల్లుక్ ను నిరంజనుడు పంపటం ఒట్టి మిషమాత్రమే. రావుసాహెబ్ గారితోటలో నిమ్మచెట్లు లేకపోలేదు. రాయిమణి వెళ్ళిపోయాక తనమాటల మూలంగా

ఆమె బాధపడి వెళ్ళిపోతుందని—చాలాసేపు ఆలోచించి తేల్చుకున్నాడతడు. మొదట్లో ఆమెకు కబురుచేద్దామా అనికూడా అనుకున్నాడు. కాని, ఆ ఆలోచన వచ్చేసరికే మనస్సుకు సంకోచం కలిగింది. అంచేత భిల్లుక్‌ను ఆ మిషతో పంపాడు. రాయిమణి తర్వాత ఏమయినా అనుకోనీ, కనీసం తనమీద తను కోపపడలేదనైనా అనుకుంటుంది కదా!

మణి నిమ్మకాయలు తెచ్చి అతడి పైపంచకు మూట కట్టి, "నువ్వు కాస్త కనిపెట్టి ఉండు కక్కాయ్! రాత్రి కాస్త మెలుకువగా ఉండు. నేను ఈరాత్రికి అక్కడకు రావటంలేదు. సాయంకాలం నాకు కబురుచెయ్యి," అన్నది. "అలాగే"

సాయంకాలం మామూలుగా కబురుచేశాడు. రాయిమణిని అక్కడకు తీసుకెళ్ళాలనికూడా ప్రయత్నించాడు కాని, "నాన్నకు ఇబ్బంది అవుతుందని చెప్పి ఆమె కదల్లేదు.

భిల్లుక్ వెళ్ళిపోయాక, చంద్రనాథ్ వచ్చి "అమ్మాయ్ నువ్వు బాబుగారిమీదకోపంవచ్చి వచ్చావా?" అనడిగాడు.

మణి ఆశ్చర్యపోయింది "నీకీమాట ఎవరుచెప్పారు!"

"బాబుగారే 'మణి కోపంవచ్చి వెళ్ళిపోయింది చంద్రనాథ్' అన్నారు. 'అంతుకనేనా పొద్దున నేనేవిషయం అడగగానే కోపపడింది?' అన్నాను నేను."

మణిముఖం వెలవెలపోయింది. "నువ్వామాట అన్నావా? నే నలా అనలేదే."

"అనలేదూ? 'బాబుగారి సంగతులుతప్ప ఇంక అడగాల్సినవి ఏమీలేవా?' అని అనలేదూ? నేను ఆయన ముందర అబద్ధం చెప్పలేను.

తండ్రిమాటవిని మణి భయంతో విస్మాథురాలయింది. నిరంజనుడు ఆమాటలు విని ఏమనుకున్నాడో యేమో! తండ్రి మీద కోపంవచ్చింది. అంతకన్న ఎక్కువగా భయమూ వేసింది. ఆరాత్రిఅంతా ఆమెకు నిద్రపట్టలేదు. పొద్దున్నే లేవగానే ఒకబుట్టనిండా సంత్రకాయలుతెచ్చి నువ్వు కాస్త అక్కడికివెళ్ళి ఈ బుట్ట ఇచ్చిరా నాన్నా!" అన్నది.

"నువ్వుకూడా రా నాతో" అన్నాడు చంద్రనాథ్. అందుకు ఒప్పుకోటానికి ఆమెకు ధైర్యం చాలలేదు.

"నే నింక రానక్కర్లేదు నాన్నా! పని ఏదయినాఉండి కబురుచేస్తే వస్తానులే" అన్నది.

చంద్రనాథ్ మధ్యాహ్నం తిరిగివచ్చి రాయిమణి అడగటానికి పూర్వమే నిరంజనుడ్ని గురించి చెప్పవలసిందంతా చెప్పేశాడు. కాని ఆమె ఏవిషయం తెలుసుకుందామని ఎక్కువ ఆదుర్దాపడసాగిందో అదిమాత్రం అతడు గ్రహించ లేదు. స్పష్టంగా ఆమె అడగలేకనూపోయింది...

కొంచెం ఆగి..."నువ్వు ఎన్నైనా చెప్పు మణీ! రోగికి ఉపచారం ఎలా చెయ్యాలో అమ్మాయిగారికి తెలిసినట్లు ఎవరికీ తెలియదనుకో. పొద్దున్న లేచినదగ్గిర్నుంచీ ఆమె గంటగంటకి బాబుగారిచేత ఎన్నెన్నిరకాల పండ్లరసం తాగించిందో-వాటి పేర్లుకూడా తెలియవు నాకు. పనిచేతులతో పనులుచేసినట్లు చేసేది అన్నీ. మందుయిచ్చేది, విసనకర్రతో విసిరేది- అసలు ఇంకొకరి అవసరమేలేదు" అన్నాడు చంద్రనాథ్.

రాయిమణి చటుక్కున లేచినుంచుని- "అక్కడితో ఆపు నాన్నా! వేళయింది, స్నానం చేసిరా! ఇంక ఈ కబుర్లు వినలేను నేను" అన్నది.

చంద్రినాథ్ కోపం తెచ్చుకుని "ఆయనమాట ఎత్తితేనే నీకంతకోపమా! వస్తేరానీ నాకేం? బ్రాహ్మలమీదకోపం తెచ్చుకున్నావంటే దానిఫలం నువ్వేఅనుభవిస్తావ్!"అన్నాడు.

రాయిమణి ఇంకేమీ మాట్లాడలేదు. పమిటచెంగు మూతికి అడ్డంపెట్టుకుని వంటయింట్లోకి వెళ్ళిపోయింది.

పగలల్లా ఆమె ఆయింట్లోంచి కదిలి ఇవతలికి రాలేదు. సాయంకాలం ఇరుగుపొరుగు అమ్మలక్కలు చెరువుకు నీళ్ళకు వెళుతూ పిలిస్తే తలనొప్పిగా ఉందనే వంక చెప్పి వెళ్ళలేదు. నిరంజనుడి తలంపిదిక్కున కూర్చుని లలిత విసురుతూ ఉండటం— ఈ దృశ్యమే ఆమెకళ్ళకు కన్పించసాగింది. 'ఇది అన్యాయం, ఇది అన్యాయం' అన్నమాటలు మనస్సులో ధ్వనించసాగాయి. సాయంకాలమంతా ఇలాగే గడిచిపోయింది. సాయంకాలం భిల్లుక్ వస్తే రోజూలాగ అతణ్ణి ఆమె ఆదరించలేదు.

"సుస్తీగాఉందా అమ్మాయ్!" అని అడిగాడతను. రాయిమణి నీరసంగానవ్వి "లేదు" అంది.

"అయితే పద, అమ్మాయిగారు నిన్నొకసారి రమ్మన్నారు" రాయిమణి లేచినుంచుని "నేనురాలేను కక్కాయ్! ఆవిడగారితో చెప్పు అంతా కులాసాగా ఉన్నట్లేకదా?" అంది.

భిల్లుక్ ముక్తసరిగా జవాబుచెప్పి హుక్కాలో పొగాకు వేసుకోటానికి వెళ్ళిపోయాడు.

## ౧౯

చంద్రనాథుడన్న మాట అసలబద్ధం కాదు. రాయిమణి కోపంవచ్చి వెళ్ళిపోయిందని స్పష్టంగా చెప్పకపోయినప్పటికీ నిరంజనుడు చెప్పినదాన్నిబట్టి ఎంతమూర్ఖుడైనా అది గ్రహించ గలడు. నిరంజనుడిమాట వినగానే 'అయితే నేను మణిని పంపిస్తానులెండి బాబుగారూ!' అన్నాడు చంద్రనాథుడు. నిరంజనుడు వద్దని చేతితో సైగచేశాడు. లలిత దూరంగా కూర్చుని చదువుకుంటున్నదల్లా లేచివచ్చి "ఆమెను నేను రమ్మన్నానని చెప్పి పంపించు చంద్రనాథ్ పాపం పదిరోజులనుంచి ఆమె కడుపునిండా అన్నంకూడా తిని యెరగదు" అని ఆమె నిరంజనుడికేసి చూసింది. నిరంజనుడు ముఖం అటు తిప్పుకున్నాడు. ఏమీ మాట్లాడలేదు.

ఈ అభిమానం లలితకు కొంచెం సరదా కలిగించింది. ఆ అభిమానంలో ఉన్న కవితారసమే ఆమె మనస్సును ముందు ఉల్లాసపరిచింది. రాయిమణి కోపంవచ్చి వెళ్ళినప్పటికి, నిరంజనుడు ఆమెకుమళ్ళీకబురు చెయ్యొద్దనివారించినప్పటికీ, రాయిమణి హఠాత్తుగా వచ్చినంతమాత్రాన నిరంజనుడి మనస్సుకు కష్టం కలగదు సరికదా ఇదో చిత్రమైన నాటకంలా పరిణమిస్తుంది— అన్నభావంతోనే ఆమె భిల్లుకోసు పంపించింది. రాయిమణి అప్పటికీ రాకపోయేసరికి ఆమెకు కోపంవచ్చింది.

నిజానికి రాయిమణి వస్తుందనే ప్రత్యాశ నిరంజనుణ్ని కొంచెం స్వస్థపరిచింది. కాని మర్నాడు చంద్రనాథ్ ఒక్కడే రావటంవల్ల అతడు లలితలాగా దుఃఖితుడు కాలేదు. పైగా

కొంత కుదుటపడ్డాడు. నిరంజనుడిముఖంలో వేదనాలక్షణాలు కనిపించకపోయేసరికి లలిత కొంచెం ఆశ్చర్యపోయింది అసలు సంగతేమిటో గ్రహించలేకపోయింది.

ఆ తర్వాత రాయిమణిసంగతి అసలు అడుగున పడిపోయింది. ఆ అభాగ్యురాలిసంగతి పైకి రాకపోయినా నిరంజనుడి హృదయాన్ని మాత్రం కల్లోలపరుస్తూనేఉంది మొదటి రోజున పరిచయం అయిననాటినుంచీ, ఈనాటివరకు ప్రతి రోజూ జరిగిన సంగతి అతడిహృదయాన్ని తారుమారు చేస్తూనే ఉంది. బలవంతంగా ఆ ఆలోచనను తప్పించుకుందామని అతడు చేసిన ప్రయత్నాలన్నీ వ్యర్థమయినాయ్. లలిత రాయిమణి పరిచర్యవిశేషాలను గురించి చేసినవర్ణన- ఆమెను అపూర్వ శక్తిమతిగా చిత్రించింది. ఆమె కేవలం అకృతజ్ఞురాలు. ఆమె రాకపోతే తన హృదయబాధ పోదని తెలిసికూడా- తాను ఎప్పటికీ పూర్తిగా కోలుకునేసంగతిఅయినా వచ్చి తెలుసుకో లేదు బహుశా చాలారోజులు పడుతుందని తెలిసే భిల్లుక్ను పంపిస్తుంటుంది అని అనిపించసాగిందతనికి. కాని భిల్లుక్ రాక పూర్వమే లలితవచ్చి, అతడిమంచానికి దగ్గరగా కుర్చీలాక్కుని పుస్తకం తెరచి కూర్చుని, "మీకు నేను రాసినకథ ఒకటి చదివి వినిపిస్తాను. మాతృభాషలో రాసిందే, వినండి డాక్టరుగారు మిమ్మల్ని ఎక్కువగా ఆలోచించనీయవద్దన్నారు" అన్నది.

"చదవండి"

చదవటం మొదలెట్టగానే మిష్టర్ దత్తు గుమ్మంలోకి వచ్చి నిలబడి, "లలితా! ఒకసారి బైటికి వస్తావా?" అన్నాడు. లలిత కుర్చీలోకూర్చునే "ఎందుకు?" అన్నది.

"రావుసాహెబ్‌గారు నిన్నొకసారి పిలుచుకు రమ్మన్నారు."

"నేను యిప్పుడే ఆయనదగ్గిర్నుంచి వచ్చాను. ఆయన చెప్పినదంతా నేనూ విన్నాను. నే చెప్పింది ఆయనా విన్నారు. మీరుకూడా అప్పుడున్నట్లయితే వినగలిగేవారే. నిరంజన బాబుకు నేను రాసింది చదివి విన్పిస్తున్నానని చెపితే చాలు-ఆయన తెలుసుకుంటారు."

మిస్టర్ దత్తు కళ్ళు రెండూ కణకణలాడాయి ఏమీ మాట్లాడకుండానే అతడు వెళ్ళిపోయాడు. కాని ఏదో అవాంతరం ముంచుకొచ్చిందని నిరంజనుడు లలితమాటలు వినగానే గ్రహించాడు. కాని పైకి యేమీ అడగలేదు. అసలు జరిగిన సంగతి ఇది: నిరంజనుడి సేవాభారం లలిత ఎప్పుడైతే పైన వేసుకున్నదో అప్పటినుంచీ దత్తు లోలోపల మండిపడుతున్నాడు అతడు నర్సును పిలిపిస్తానన్నా-కూతురి ఉద్దేశాన్ననుసరించి రావుసాహెబ్ అందుకు అంగీకరించలేదు. నిరంజనుడికి నియమంగా లలిత ఉపచారాలు చెయ్యటం చూసి, దత్తు సహించలేకపోయాడు చివరికి అతడిజ్వరం తగ్గగానే, లలిత చదువుకు భంగం వస్తున్నదనీ, పరీక్షలు దగ్గిరకొచ్చాయనీ, ఇంక టైం వృధాచెయ్యటం మంచిదికాదనీ అతడు రావుసాహెబ్‌కు ఫిర్యాదుచేశాడు. ఆయన ఈ మాట పట్టుకుని మామూలుగా లలితతో అనేసరికి, ఆమె మండిపడి— "అన్నిటికన్నా చదువే ప్రధానమా యేం నాన్నా? మనయింట్లో ఒకవ్యక్తి మరణోన్ముఖుడై ఉంటే... అతడు స్వజనాన్ని అందరిని విడిచి మనని ఆశ్రయిస్తే అతడికి ఉపచారంచెయ్యటం అనర్థకమా? నేను

పరీక్షకు కూచోను అని మిష్టర్ దత్తుతో చెప్పు నాన్నా!" అన్నది. రావుసాహెబ్‌కు కూతురిసంగతి బాగా తెలుసు, కనుక ఏమీ మాట్లాడలేదు. లలిత నిరంజనుడి గదికేసి వెళ్ళిపోయింది.

మిష్టర్ దత్తుమీద ఆమెకు చటుక్కున విరక్తి కలిగింది. ఆ సంకుచితహృదయుని మనస్సు ఆమె కిదివరకే తెలుసు కాని, అతడినైచ్యం ఇంతస్పష్టంగా ఎప్పుడూ బైటపడలా. తోటలో అతడు కనపడినా అతడ్ని తిరస్కరించాలనే ఉద్దేశంతోనే ఆమె నిరంజనుడి గదిలోకి వెళ్ళి తన రచనలు విన్పించసాగింది.

ఇది జరిగినప్పట్నుంచీ నిరంజనుడి గదికి లలిత రాకపోకలు జాస్తి అయినాయి. నిరంజనుడికి విపత్తువచ్చిపడింది. యజమానికూతురుతో మాట్లాడడమంటే అతడికి ఎక్కడలేని సంకోచమూను. అనేకదినాల సాహచర్యంవల్ల కూడా అతడి ఈ స్వభావం రవంతైనా మారలేదు. ఇప్పుడు మధ్యమధ్య భిల్లుక్ వచ్చి కూచుంటున్నాడు. అతడిద్వారా రాయిమణిసంగతులు తెలుసుకోటానికి అవకాశం కలుగుతోంది. ఇటీవల లలిత ఎక్కువగా అతడిదగ్గిరే ఉంటూఉండటంవల్ల భిల్లుక్ వచ్చినా బైటి నుంచే కబుర్లు తెలుసుకుని వెళ్ళిపోవాల్సివస్తోంది. అది భిల్లుక్‌కు చాలా ఏలుగాఉంది. తననోటి కల్లుకంపుకు నిరంజనుడి చీవాట్లు తినవక్కర్లేకుండా సరిపోతోంది. ప్రతిరోజూ లలిత ఏడెనిమిదిగంటలు నిరంజనుడిగదిలోనే గడుపుతోంది. ఒకరోజున ప్రసంగవశాత్తు అతడీసంగతి రాయిమణితో చెప్పాడు. దానివల్ల ఆమెముఖంలో కన్పించిన మార్పును భిల్లుక్ గ్రహించలేకపోయాడు.

## ౨౦

మూడ్రోజుల్నాళ్ళు నిరంజనుడు మంచంమీదే ఉండాల్సి వచ్చింది. లలిత రెండుపూటలా వచ్చి మామూలుగా చూసి వెడుతోంది. మధ్యమధ్య చంద్రనాథుడూ వస్తున్నాడు. కాని రాయిమణి ఆవెళ్ళటం వెళ్ళటం మళ్ళీ రానేలేదు.

ఎటొచ్చీ చంద్రనాథుడికి దిక్కు-వచ్చింది. అతడికి ఏదో ఒకటి వాగుతూఉండందే తోచదు. రాయిమణిసంగతి నిరంజనుడుకాని, నిరంజనుడిసంగతి రాయిమణికాని అడగటం మానేశారు. అతడికి వీళ్ళిద్దర్ని గురించీతప్ప ఇంక ఇతరులను గురించి ఆలోచించాల్సిన పనిలేదు. లోపలేదో కుంభకోణం జరిగిఉంటుందని గ్రహించి, అతడు ఒకరోజున నిరంజనుడ్ని చూడడానికి వస్తూ కూతుర్ని పిలిచి, "అక్కడకు వెళ్ళిరానా మణీ!" అని అడిగాడు.

వంటయింట్లో ఏదో పనిచేసుకుంటూ తలయెత్తకుండానే "ఏందుకూ? — చావటానికా?" అంది.

కూతురు ఇలామాట్లాడగా ఆత డెవ్వడూ వినలేదు. అతడు కోపం తెచ్చుకుని, "ఆమాటతీరేమే అమ్మా! బాబుగారి దగ్గరకు వెళ్ళనాఅని అడిగితే అపభ్రంశపు కూతలు కూస్తా వేమిటీ!" అన్నాడు

ఆమె చటుక్కు-లలేచి "నేనట్లా యేం అనలేదునాన్నా! నువ్వు కోపం తెచ్చుకోనక్కర్లా" అంది.

చంద్రనాథ్ ఏమీ మాట్లాడకుండానే బైటికి వచ్చేశాడు. రాయిమణి పరుగెత్తుకుంటూ వచ్చి- అతడ్ని చెయ్యి

పుచ్చుకుని లోపలికివచ్చి, "మీ బాబుగారికోసం చేపలు పట్టి ఉంచాను. తీసుకెళ్ళు" అని ఒకబుట్టెడుచేపలు తెచ్చి తండ్రికి కిచ్చింది.

రాయిమణి పంపిందని చెపితే నిరంజనుడు సంకోచిస్తాడనే భావంతో అతడు జాగ్రత్తగా ఆ బుట్టతీసుకుని వెళ్ళి పోయాడు.

ఆచేపలుచూసి ఆయన యేమంటాడో తెలుసుకుందామనే ఉత్సుకతతో రాయిమణి కూచుంటుంది. సాయంకాలం తండ్రి రాగానే "ఇచ్చివచ్చావా నాన్నా?" అని అడిగింది.

"ఇచ్చాను. కాని వాళ్ళకి చేపలు తక్కువటే! అమ్మాయిగారు రోజూ పదిరకాల ఆహారపదార్థాలు చేసిపెడుతుంది" అని లలిత అతడికి ఆహారంపెట్టేవిధానం అంతా వర్ణించి చెప్పాడు. మణి అట్టేసేపు వినలేదు. వంటయింట్లోకి పోయి పొయ్యిరాజేస్తూ కూచుంది. చంద్రనాధుడి వాగుడంతా అయిపోయాక, అతడ్ని పిలిచి భోజనంపెట్టి, ఆమెపోయి పడుకుంది. నిరంజనుడు లలితచెయ్యిపుచ్చుకుని షికార్లు కొడుతున్నట్లు కలగన్నది ఆ రాత్రి అంతలో చటుక్కున మెలకువవచ్చి లేచి కూచుంది. కలఅని తెలిసికూడా. ఒకసారి తలుపుతీసి అటూ యిటూ చూసి- మళ్ళీ బొంత ముసుగెట్టుకుని పడుకుంది.



రెండునెలలు గడిచిపోయాయి. నిరంజనుడు అప్పటికి చంద్రనాధుని ఇంటికి రాలేదు. చంద్రనాథ్ రోజూ ఇంటను మించి నిరంజనుడ్ని కలుసుకుంటున్నాడు. మణి లలిత ద్వారా నిరంజనుడి కబుర్లు తెలుసుకుంటోంది. ఒక సంగతి తెలియదు

కోటానికై ఆమె తిప్పితిప్పి ప్రశ్నలువేసేది. ఆ ప్రశ్నేమిటో తెలుసుకోకుండానే చంద్రనాధ్ ఏదోజవాబు చెప్పేవాడు. రాయిమణి తాననుకున్న జవాబు రాక పోయేసరికి కోపంవచ్చి ఉగ్రోషాలుండేది చంద్రనాధునికిదేమీ తెలియక ఏదో వాగుతూఉండేవాడు. ఇలా ఉంటూండగా ఒకరోజున భిల్లుక్ వచ్చాడు. ఈసారి నదిలో చాలాచేపలున్నా యని చెప్పి అత డేమంటాడో విందామని ప్రశ్నించింది. భిల్లుక్ చేపలుపట్టటంలో తన బాబుగారికి ఉన్న అయిష్టతను వెల్లడిచేసి వెళ్ళిపోయాడు. అప్పటినుంచి మణి తండ్రిని నిరంజ నుడ్నిగురించి అడగటం మానేసింది.

'సాలవనం' 'సిలోనాన్'గా మారిపోయినప్పట్నుంచీ ఊళ్ళో జమీందారుగారింట్లో దేవీపూజలు 'బాద్' అయి నాయ్. ఏదో నామకః ఉత్సవాలు జరిగేవి. పిలిస్తేవచ్చినచుట్టా లూ స్నేహితులూ ఏదో ఉపీయిపీ కొంటూఉండేవారు. అణా వస్తువు పావలాకు అమ్ముకోవచ్చునని ఆ ఉత్సవాల రోజుల్లో చాలా దూరంనుంచి వర్తకులు వచ్చేవాళ్ళు

రాయిమణి కిష్టంలేకపోయినా, ఏడాదికి ఒక్కరోజువచ్చే పండుగనిచెప్పి చంద్రనాధుడు ఆమెను లాక్కునివచ్చాడు. రాయిమణి ప్రతియేడూ ఆ ఉత్సవంలో చేపలదుకాణం పెట్టేది. ఈయేడు ఆ దుకాణం మరోకుర్రవాడికి అప్పగించి; ఒక గుబురుగాఉన్న చెట్టుక్రింద నుంచుని ఉంది. నిరంజనుణ్ని చాటుగా నైనా ఒకసారి చూసిపోదామని ఆమెవాంఛ. కాని నిరంజన్ తననిచూసి, ఎక్కడ కోపంతెచ్చుకుంటాడో అని భయం

కూడా ఉంది. సరిగ్గా ఈ సమయంలో చంద్రనాథుడొచ్చి రాయిమణిని పిలిచాడు.

అంతకుముందు మణిని అక్కడఉంచి చంద్రనాథ్ రావుసాహెబ్ గారింటికి నిరంజనుడ్ని కలుసుకోవటానికి వెళ్లాడు. ఏదో మాటలసందర్భంలో మణి ఉత్సవానికి వచ్చిందనికూడా అతడితో చెప్పాడు. నిరంజనుడు ఆమాటలువిన్నాడు కాని, ఏ మాత్రం కుతూహలాన్ని వ్యక్తపరచలేదు. లలిత పక్కనే ఉండి, "ఆమెను ఇక్కడకు ఎందుకుతీసుకురాలేదు?" అని అడిగింది.

నిరంజనుడు ఏదో అభ్యంతరం చెప్పబోయేవాడే. "ఆమెకు మీరంటే భయం దేనికి?" అంది లలిత. నిరంజనుడి ముఖం ఎర్రపడింది. చంద్రనాథ్ మణిని తీసుకురావటానికి వెళ్ళాడు.

లలిత తనని రమ్మన్నదని విని మణి సంతోషపడింది. "ఒట్టిచేతుల్తో రానా నాన్నా?" అంది.

"ఏం తీసుకువస్తావ్ మరి? చేపలా..."

మణికి ఆనాటి చేపలసంగతి జ్ఞాపకం వచ్చి ఉత్సాహమంతా ఇగిరిపోయింది. "ఏ మీ వద్దు లే-పద"

ఇద్దరూ గేటుదగ్గరకు వెళ్ళేసరికి లలిత నిరంజనులు ఎదురుగా వస్తున్నారు. మణి చటుక్కున ఆగింది. "ఏమిటి? ఆగావెందుకు?" అన్నాడు చంద్రనాథ్.

"నువ్వు వెళ్ళు నాన్నా! నాకు గుండెల్లో ఎలాగో ఉంది. ఇంక నేను రాలేను.

మెల్లాలోనిలబడి, "సెబాకి బాకీ చెల్లించుకోటానికి వచ్చాను మణీ!" అని ఆమె రెండుచేతులూ పట్టుకుంది.

"ఒక్కతెవే వచ్చావా?"

లలిత నవ్వుతూ, "ఒక్కతెనూ రావటానికి భయం వెయ్యటానికి దారిలో పులులూ ఎలుగుబంట్లూ ఉన్నాయనుకున్నావేం?" అంది.

"ఆఁ, అదికాదు. చాలాదూరం ఉందిగా! అందుకని అన్నాను." సరిగ్గా ఈ సమయంలో నిరంజనుడొచ్చి మెల్లాలో నిలబడ్డాడు. లలిత ఇవాళ అతడిని బలవంతాన వెంటపెట్టుకుని తీసుకువచ్చింది. నిరంజనుడ్ని చూడగానే మణి లలిత కౌగిలిలోంచి విడిపించుకుని వంటింట్లోకి పరుగెత్తింది.

లలిత నవ్వుతూ "భలేదానివే నువ్వు. నేం మీఇంటికి వస్తే నువ్వు పారిపోతావేమిటి?" అని వంటింట్లోకి వెళ్ళి మణిని బైటికి లాక్కునివచ్చింది. మణి తప్పనిసరిగా ఆమెతోపాటు వచ్చి నుంచుంది.

నిరంజనుడూ చంద్రనాథ్ యింటికి తప్పనిసరైఅయ్యే వచ్చాడు. రాయిమణితో మాట్లాట్టానికి అతడికి చాలా సంకోచంగాఉంది. పోని మాట్లాడకుండా ఊరుకున్నా—అందులో విశేషించి లలితముందర—అసలు బావుండదు. అంచేత అతను ఒకటి రెండు మామూలు కుశలప్రశ్నలువేశాడు. మణి 'అవును' 'కాదు' అనిమాత్రం జవాబులుచెప్పింది. వీళ్ళిద్దరూ మనస్సు విప్పి మాట్లాడుకోవటంలేదని లలిత గ్రహించింది. అప్పుడామె—"మాకు ఆకలేస్తోంది మణీ" మీ యింట్లో ఏముంది?" అని అడిగింది.

రాయిమణి చాపవేసి "కూర్చోండి" అన్నది.

నిరంజనుడికి అభ్యంతరం చెప్పటానికి అవకాశం చిక్కలేదు.

భోజనంముందర కూర్చునేసరికి నిరంజనుడి పరధ్యానమంతా పోయింది. లలిత ప్రశ్నపరంపరలో అతడు గాభరా పడ్డాడు. అలా ఒక గంటసేపు గడిచాక, లలిత వచ్చేస్తూ వచ్చేస్తూ రేపు 'బోట్ రేస్' చూడటానికి రాయిమణినీ, చంద్రినాథ్‌నీ ఆహ్వానించివచ్చింది.

లలిత వెళ్ళిపోయాక మణి చాలాసేపు కూచుని ఆలోచించింది. నిరంజనుడు తనతో మాట్లాడినమాటలనే మాటి మాటికి ఆవృత్తి చేసుకోసాగింది. ఆలోచించగా-నిరంజనుడు తనతో ఇదివరకులాగా మనస్సువిప్పి మాట్లాడలేదని గ్రహించింది. నిరంజనుడికి తనకి మధ్య లలిత అకాంతరంగావచ్చి నిలబడినట్లు తోచింది ఒక్క నిట్టూర్పువిడిచి అక్కడనుంచి లేచింది.

♦ ♦ ♦ ♦ ♦

విజయదశమివెళ్ళినమర్నాడు రావుసాహెబ్ 'బోట్ రేస్' ఏర్పాటుచేశాడు. ఈ 'బోట్ రేస్'లో ఆయన అతిథి వర్గమంతా పాల్గొన్నారు. గెలిచినవాళ్ళకు బహుమతికూడా ఉంది. ఈ 'బోట్ రేస్'చూడటానికి నదికి రెండువైపులా జనం చేరారు.

ఆనాటి 'రేస్'లో మరో విశేషంగూడా ఉంది. లలిత స్వయంగా పాల్గొంటోంది నారి......పూలతో అలంకరించిన పడవమీద యెక్కిందామె. అందులో పాల్గొన్నప్రతిద్వంద్వులు

కూడా పడవలుఎక్కారు. మామూలు సమయానికి ఏడు పడవలు బయలుదేరాయి. వెయ్యిమందికిపైగా ప్రేక్షకులున్నారక్కడ

నిర్దిష్ట స్థలాన్ని చేరుకుని పడవలు తిరిగొస్తున్నాయి. లలితపడవ అన్నిటికన్నా ముందుంది. రావుసాహెబ్, ఆయన గృహిణి కూతుర్ని ప్రశంసిస్తున్నట్లు అటే చూస్తూకూచున్నారు.

"లలిత గెలుస్తుంది" అన్నాడు రావుసాహెబ్. గృహిణి దృష్టి మరల్చకుండానే "నాకేమిటో భయభయంగా ఉంది—" అని అంటోంది ఇంకా ఆమెమాట పూర్తి కాక మునుపే గందరగోళం విని రావుసాహెబ్ లేచినిలబడ్డాడు. చూస్తే లలితపడవ హఠాత్తుగా అడ్డంతిరిగి, కనురెప్పపాటులో లలిత నీళ్ళలో పడిపోయింది. వెనకాలనుంచి మాధవదత్తు నౌకర్లందర్నీ పేరుపేరునా కేకేస్తున్నాడు.

లలిత నీళ్ళలో పడగానే వెనకపడవలోంచి నిరంజనుడు గభాలున నీళ్ళలోకి దుమికి, అచేతనురాలైన లలితను బుజాన వేసుకుని మెల్లిగా ఒకపడవ అడుగుభాగం పట్టుకుని పైకి ఎక్కించాడు. తానుకూడా మెల్లిగా పైకివెక్కి, ఒకచేత్తో లలితను పట్టుకుని, ఒకచేత్తో తెడ్డువేసుకుంటూ ఒడ్డుకుచేరాడు.

ఒడ్డున రావుసాహెబ్ గారి గృహిణి జ్ఞాపకమున్న దేవుళ్ళందరికీ దణ్ణాలుపెడుతూకూచుంది. నౌకర్లూ చాకర్లూ అతిథులూ అంతా మౌనంగా ఒడ్డుననిలబడిచూస్తున్నారు. పడవ ఒడ్డుకువస్తూంటే అందరూ అక్కడకు పరుగెత్తారు. గృహిణి ఆతుర్దాతో "బ్రతికిఉందా నాయనా!" అని అడిగింది.

"ఏం భయంలేదు. బండి పిలవండి" అన్నాడు నిరంజనుడు. బండి సిద్ధంగా నేఉంది. అతడు ఆమెను రెండుచేతులతో ఎత్తుకుని బండిలో కూర్చోబెట్టి ఒడ్డుకువచ్చాడు.

రాయిమీది అటువైపున రైలుగోడ దగ్గరగాకూచుని ఈ 'బోట్ రేస్' చూస్తోంది మొదట్లో ఆమెకేమీ తెలియలేదు. కాని నిరంజనుడు లలితను పడవలోకి ఎక్కించగానే ఆమె యింటికొచ్చి ఏడుస్తూకూచుంది.

చంద్రనాథ్ వసారాలో పడుకుని నిద్రపోతున్నాడు. మణి ఏడుపుతో లేచికూచుని—సంగతంతా విని, "గొప్పవాళ్ళకీ 'బోట్ రేస్' ఏమిటి? పోదాం పద, ఒకసారి బాబుగారిని చూసొద్దాం" అని కూతుర్ని వెంటపెట్టుకుని బైటికివచ్చాడు.

రావుసాహెబ్‌గారి అతిథులు ముందుగానే వెళ్ళిపోయారు నిరంజనుడు అందరిదగ్గిరా శెలవుతీసుకుని ఒక్కడే వెడుతున్నాడు. వెనకనుంచిఎవరో "బాబుగారూ!" అనిపిలిచారు.

వెనక్కితిరిగి "ఎవరు? చంద్రనాథ్! ఇందాకట్నుంచి కనపళ్ళేదే" అన్నాడు.

చంద్రనాథ్ అపరాధిలాగా సంకుచితుడై "జ్వరం వచ్చిందిబాబూ! పడుకున్నాను, పిల్లదాని ఏడుపువిని లేచి ఇట్లా వచ్చాను. మీకు దెబ్బయేమీ తగల్లేదు కదా" అన్నాడు.

"లేదు" జ్వరంతో అంతదూరం నడవకూడదు చంద్రనాథ్! తిరిగివెళ్ళు"

"ఫరవాలేదు బాబుగారూ! నడిస్తే కాస్త చెమట పడుతుంది. మంచిదే, మిమ్మల్నిపంపించి, ఇద్దరం మాట్లాడుకుంటూవచ్చేస్తాం. కూడా అమ్మాయివుందిగా!"

నిరంజనుడు ఈసారి సరిగ్గా చూశాడు. చంద్రనాథ్ వెనకాల రాయిమణిఉంది. తండ్రీ కూతురూ చాలా ఆదుర్దా పడి తనని చూడటానికి వచ్చారని గ్రహించాడు. చటుక్కున మణిమీద అతడికి దయ కలిగింది "నువ్వు భయపడొద్దు మణి! నాకేం దెబ్బతగల్లేదు. మీరు వెళ్ళండి" రాయిమణిని తనవెంట తీసుకుని వెళ్ళటానికి నిరంజనుడికి సంకోచంగాఉంది. ఎలాగయినా వాళ్ళను తప్పించుకుందామని "చంద్రనాథ్‌ను తీసుకెళ్ళు మణి! రేపు సాయంకాలం నేను వచ్చిచూస్తాలే".

మణి చంద్రనాథుని చెవిలో ఏదో చెప్పింది. "చప్పున తడిగుడ్డలు విడిచెయ్యమని అమ్మాయ్ చెప్పమంటోంది బాబుగారూ! మొన్ననేగా అంత జబ్బుపడి లేచారు" అన్నాడు.

"అలాగే" అని నిరంజనుడు గబగబా నడవసాగాడు.

గేటుముందర భిల్లుక్ నిలబడిఉన్నాడు. నిరంజనుడి ప్రశ్నకు—"అమ్మాయిగారు కులాసాగా నేఉన్నారు. ఇప్పుడే టీ తాగారు" అని జవాబు చెప్పాడు. నిరంజనుడు నిశ్చింతుడై భిల్లుక్‌తో నిప్పురాజెయ్యమని చెప్పి ఆ తడిగుడ్డలు విడిచెయ్యటానికి లోపలి కెళ్ళాడు.



తెల్లవారుఝాము పొద్దుండగా భిల్లుక్ నిరంజనుడ్ని లేపి, రావు సాహెబ్‌గారు పిలుస్తున్నారని చెప్పాడు. నిరంజనుడు అలిసి ఉన్నాడు. కొంచెం చిరాకువేసింది. అయినా యజమానిఆజ్ఞను తిరస్కరించలేక దుప్పటి కప్పుకుని వెళ్ళాడు.

టీ టేబిల్‌ముందు అతిథులంతా కూర్చుని ఉన్నారు. ప్లేట్లూ, కప్పులూ, చెంచాలూ చప్పుడవుతున్నాయి. సంభా

షణ జరుగుతోంది. నిరంజనుడు వచ్చి నన్ను "పిలిపించారా?" అని అడిగాడు.

మిష్టర్ దత్తు ఏదో అనబోతూండగా రావుసాహెబ్ ఆమాటకు అడ్డంవచ్చి "ఆఁ. మీ భోజనం అయిందా? కాలేదా? కూర్చోండి మాతోపాటు" అన్నాడు.

నిరంజనుడు అభ్యంతరం చెప్తూ "ఒంట్లో బాగా లేదు. ఇవాళ భోంచెయ్యను" అన్నాడు.

"అదేం లేదు. చాలా అలసిపోయావ్ కనుక అలా ఉంది. భోంచేస్తే తగ్గిపోతుంది" అన్నాడు రావుసాహెబ్.

భోజనం విషయంలో అతనికి కొన్ని విధి నిషేధా లున్నాయ్. అంచేత ఏమీ మాట్లాడకుండా నుంచున్నాడు.

ఇంతకుపూర్వం ఎప్పుడూ నిరంజనుడు రావుసాహెబ్ గారి టేబిల్ ముందు కూర్చుని భోంచేసి ఎరగడు. ఆ సంగతి రావుసాహెబ్‌కు జ్ఞాపకంలేదు. రావుసాహెబ్ తన హోదా మరిచిపోయి, నిరంజనుడ్ని చెయ్యిపుచ్చుకుని ఇవతలకు తీసుకు రాగానే దత్తు నిరంజనుడ్ని ఇంగ్లీషులో ఏమని ఎక్కిరించాడో అది వినేసరికి అతనికి కోపంవచ్చింది. తనకుచదువేమీ రానట్లు నటించినసంగతి అతడు మరచిపోయాడు. మాధవదత్తుకు ఇంగ్లీషులోనే జవాబుచెప్పాడు. నిరంజనుడు అంత స్వచ్ఛంగా ఇంగ్లీషు మాట్లాడ్డంచూసి రావుసాహెబ్ నిర్ఘాంతపోయాడు. లలితముఖం ఎర్రపడింది, దత్తు కంగారుపడ్డాడు. అందరి ఎదుట నిరంజనుని మర్యాద పెరిగిపోయినట్లుంది. అప్పుడు నిరంజనుడు తన తప్పు తాను గ్రహించి ఇంకేమీ మాట్లాడకుండా గబ గబా అక్కడనుంచి వెళ్ళిపోయాడు.

## ౨౨

లలిత చాలా పెందరాళే లేచి, తోటలో రాతిబెంచీ మీాద ఆలోచించుకుంటూ కూర్చుంది. ఆ ఆలోచన నిరంజనుడ్ని గురించే. నిరంజనుడి జీవితంలో ఏదో రహస్యం ఉంది. అది తెలుసుకోవాలని ఎంతో కుతూహలం ఉన్నా, నిరంజనుడ్ని పిలవటానికి సాహసించలేకపోయింది. జరిగిన సంఘటనలూ, సంభాషణలూ జ్ఞాపకం వచ్చిన కొద్దీ ఆమె సంకుచితురాలు కాసాగింది. ఇంగ్లీషులోని ప్రేమకవిత్వం తర్జుమా చేసి ఆమె చాలాసార్లు నిరంజనుడికి వినిపించింది. అదే మరీ జ్ఞాపకం రాసాగింది. అప్పుడతడు నిజంగా లోలోపల నవ్వుకుని ఉంటాడు.

నిరంజనుడు తనగది తలుపు లోపల గడియవేసుకుని, సామానులూ అవీ సర్దుకుంటూ రావుసాహెబ్ గారి ఇల్లు విడిచి పెట్టి పోవాలనే సంకల్పంలో ఉన్నాడు. ఇన్నాళ్ళనుంచీ తానెవరో చెప్పకుండా గుంభనగా కాలక్షేపం చేస్తూ వచ్చినా— నిన్న ఒక్క క్షణం అజాగ్రత్తవల్ల జరిగిన సంఘటనలోని గురుత్వం అతడు గ్రహించాడు. కొద్దిసేపట్లోనే రావుసాహెబ్ గారికి సంజాయిషీ చెప్పుకోవలసిన సమయం సమీపించింది. అప్పుడింక దాగేది ఏమీ లేదు. ఆయన కుతూహలం కొద్దీ ప్రతిదీ ఆరాగా తెలుసుకునేందుకు కూడా ప్రయత్నించవచ్చు. అప్పుడిహ తన సాంసారిక కళంకం కూడా బైటపడొచ్చు. అంచేత పదిగంటలలోపుగానే అతడా యిల్లు విడిచిపెట్టిపోవాలని సంకల్పించుకున్నాడు, అంతా రహస్యంగానే సర్దుకుంటున్నాడు, కాని కిటికీ బైటనుంచి ఒక వ్యక్తి ఇదంతా కనిపెడుతున్నాడు. అతడు

చూసిచూసి తలుపు బైటగొళ్ళెంపెట్టి, సరాసరి లలితను వెతుకుంటూ వెళ్ళాడు.

నిరంజనుడితో మాట్లాడటానికి ఉపాయమేమీతోచక, లలిత క్రితం సాయింత్రం తన ప్రాణరక్షణ చేసినందుకు ధన్యవాదాలు తెలియజేస్తూ ఉత్తరం రాయసాగింది. ఆ ఉత్తరం మొదట మాతృభాషలో రాసి, చింపేసి తర్వాత ఇంగ్లీషులో రాస్తుండగా భిల్లుక్ వచ్చాడు.

"ఏమటి?" అని అడిగింది లలిత.

భిల్లుక్ నమస్కరించి తన సందేహాన్ని బైటపెట్టాడు. "ఎందుకు వెళ్ళిపోతున్నారు?" అని అడిగింది. ఆ ప్రశ్నకతడు జవాబు చెప్పలేకపోయాడు. ఏమిటో సంగతి తెలుసుకుందామని లలిత తనంతట తనే నిరంజనుడి గదికేసి వెళ్ళింది. మళ్ళీ వెనక్కితిరిగివచ్చి, ఆ ఉత్తరం చేతికిచ్చి 'ఈ ఉత్తరం ఆయనకు చూపించి పిలుచుకురమ్మన'మన్నది.

భిల్లుక్ వెళ్ళిపోయాడు.

ఆ ఉత్తరం చూసుకొని నిరంజనుడు అతి సంకోచంతో లలిత ఎదుటికివచ్చి నిలబడ్డాడు. రాగానే ఏం మాట్లాడాలో తోచక—"ధన్యవాదాలు అర్పించవలసినంత ఆవశ్యకతఏమీ లేదు" అన్నాడు.

లలిత తలవంచుకుని నవ్వుకుంటూ "అయితే మీకు ఇంగ్లీషు వచ్చా?" అని అడిగింది.

నిరంజనుడు తెల్లబోతూ "కొంచెం వచ్చు" అన్నాడు.

లలిత మళ్ళీ నవ్వింది. అత డది గమనించలేదు. ఆ ప్రసంగం మార్చాలనే ఉద్దేశంతో "నేను ఇవాళ వెళ్ళిపోవాలనుకుంటున్నాను" అన్నాడు.

"ఎక్కడికి?"

"మా అమ్మను చూసిరావటానికి ఒకసారి వెడదామనుకుంటున్నాను. వెళ్ళి చాలా రోజులయింది.

"మా నాన్నగారితో చెపుతాను. యజమానిని నేను కానుగా" నిరంజనుడు నవ్వుతూ "మీరు చెపితేనే బావుంటుంది. నే నడిగితే బహుశా సెలవు యివ్వరు. మిష్టర్ దత్తు అభ్యంతరం చెపుతాడు" అన్నాడు.

"మీరు వెళ్ళటం దత్తుకు యిష్టమే. అదేం లేదు. కాని నాన్నగారితో చెపుతాను. బహుశా ప్రయాణం సాగదేమో. ఎవరి అభ్యంతరం ఉన్నా లేకపోయినా నా అభ్యంతరముంది అసలు." అని అంటూనే "వెడుతున్నానని చంద్రనాథుడికి చెప్పారా?" అని అడిగింది.

లలితమాట విని నిరంజనుడు సిగ్గుపడ్డాడు. కోపం కూడా వచ్చింది. ఎలాగో తమాయించుకుని కఠినంగా 'అతడికి చెప్పాల్సిన అగత్యం లేదు' అన్నాడు.

లలిత లేచి, "అగత్యముంది. రావటంఅంటే మీ చేతుల్లోఉంది, కాని వెళ్ళిపోవటం మీ చేతుల్లోలేదని తెలుసుకోలేదా యింకా?" అని నవ్వుతూ వెళ్ళిపోయింది.

ఆమెమాటలధోరణి చూసి తనప్రయాణం సాగదేమో అని అనిపించిం దతడికి. కాని వెళ్ళకుండ ఉండటానికి వీల్లేదు. ఇక్కడిహ గుంభనగా ఉండటం చాలాకష్టం. రావుసాహెబ్

గారి దగ్గిర శెలవుతీసుకుని వెళ్ళిపోదామనే నిశ్చయానికి వచ్చాడు. కాని ఈలోపుగానే ఒక అవాంతరం వచ్చిపడింది.

చంద్రినాధ్ వచ్చి నిరంజనుడికి నమస్కరించి, మమ్మల్ని ఎవరిదగ్గిర విడిచివెడుతున్నారు బాబూ!" అని అడిగాడు. అతడు సమాధానం చెప్పటానికి వీల్లేనంత జాలిగా ఉంది చంద్రనాథ్ కంఠస్వరం.

"నీ కెవరు చెప్పారు?" అని అడిగాడు.

"ఈ సంగతి దాస్తే దాగుతుందా బాబూ!" అని ఆ సంగతి చెప్పిన భిల్లుక్ కేసి చూశాడు.

భిల్లుక్ తనపేరు చెప్పవద్దని సైగచేసేసరికి చంద్రినాథ్ నీళ్ళు నములుతూ వూరుకున్నాడు. వెళ్ళకపోతే వీల్లేదు చంద్రినాథ్! ఆ పుస్తకాలు తీసుకెళ్ళి మీయింట్లో ఉంచు"అని జవాబుచెప్పటానికి అవకాశం యివ్వకుండానే ఆ పుస్తకాల గుట్ట చూపించాడు.



రాయిమణి బెల్లం పాకంపట్టి కొబ్బరిలవుజులు చేస్తుండగా, చంద్రినాధ్ వచ్చి, "మన దురదృష్టమే మణీ! బాబుగారు వెళ్ళిపోతున్నారు—" అన్నాడు.

రాయిమణిచేతిలోగిన్నె దబాలున క్రింద పడింది. ఎలాగో తమాయించుకుని "ఎక్కడికి?" అని అడిగింది.

"గొప్పవాళ్ళసంగతి మనకేం తెలుస్తుందే! మనలాంటి వెస్తలతో చెప్పిపోతారా?" అని ఆ పుస్తకాలమూట అక్కడ పడేసి హుక్కాతీసుకు కూచున్నాడు.

మణి కాస్సేపు మెదలకుండా ఊరుకుని, ఈపుస్తకాలు ఎవరివి నాన్నా?''అని అడిగింది.

చంద్రనాథ్ హుకా్క-లాగి 'బాబుగారివిలే. తీసిదాయి' అన్నాడు.

మణి ఆ పుస్తకాలకేసి మళ్ళీచూడలేదు. ఆ పదార్థాలన్నీ ఎక్కడివక్కడ సర్ది వెళ్ళిపోయింది. చంద్రనాథ్ ఆమె వాలకాన్నిబట్టి ఇవాళ భోంచెయ్యదని గ్రహించాడు. సంకోచిస్తూ "గదిలోకి వెళ్ళావేం? వంటచెయ్యలేదా యివాళ?" అని అడిగాడు.

మణి లోపలనుంచే "నీకు తరవాణి అన్నం ఉంది తిను; నాకు జ్వరంగాఉంది" అన్నది.

కూతురికి హఠాత్తుగా జ్వరం రావటానికి కారణం చంద్రనాథ్ గ్రహించాడు. లోపలికెళ్ళి కూతుర్ని చెయ్యిపుచ్చుకుని వాత్సల్యంగా పిలుస్తూ "లంఘనం ఉంటే జ్వరం ఎక్కువవుతుంది. కాస్త ఎంగిలిపడుదువుగాని రా" అన్నాడు. రాయిమణి ఏదో చెప్పబోయింది కాని, గొంతుబొంగురుపోయి మాట్లాడలేకపోయింది. మెదలకుండా లేచి వెళ్ళింది.

## ౨౩

ఏమిటిచెయ్యటమో నిరంజనుడేమీ నిశ్చయించుకోలేకపోయాడు. మొదట్లో రావుసాహెబ్‌గారికి అన్ని విషయాలూ చెప్పి శెలవు తీసుకుందామనుకున్నాడు కాని అప్పుడు ఆయన శెలవివ్వకుండా అసలు 'డిస్మిస్' చేస్తే తన సంగతి ఏమవుతుంది! నిరుద్యోగజీవితంలోని కష్టసుఖాలు అతడికి అనుభవమే! తన విషయమయి దిగులు ఎలాఉన్నా తల్లినిగురించిన దిగులు ఎక్కువైందతడికి. అబద్ధంచెప్పటానికి మనస్కరించటం లేదు. ఏం చెయ్యటానికి మనస్కరించటంలేదు. ఏం చెయ్యటానికి తోచక గదిలోంచి బైటికివచ్చి నదివైపుకు నడుచసాగాడు.

భిల్లుక్ పిలుపుతో అతడుమళ్ళీ మనధోరణిలోకివచ్చాడు. అతడలా ఎంతసేపు నదిఒడ్డున తిరిగాడో అతడికే తెలియదు. రావుసాహెబ్‌గారు పిలుస్తున్నారని భిల్లుక్ చెప్పేసరికి తనకు పరీక్షాసమయంవచ్చిందని తెలుసుకున్నాడు. బంగాళాకేసివస్తూ కూడా అతడు తన కర్తవ్యాన్ని తేల్చుకోలేదు.

రావుసాహెబ్‌గారు తన ఆఫీసురూంలో కూచుని కాగితాలేవేవో చూసుకుంటున్నాడు. దత్తు అక్కడలేకపోవటం నిరంజనుడికి శాస్త మనశ్శాంతిని కలిగించింది. రావుసాహెబ్‌గారికి వినయంగా నమస్కరించి "మీరు నన్ను పిలిచారా?" అని అడిగాడు.

ఆయన తల పైకి యెత్తకుండానే "ఊఁ" అన్నాడు. కొంచెంసేపు అలాగే ఊరుకుని—తాను వచ్చినసంగతి

ఆయన గమనించినట్లు లేదని తెలుసుకుని, "నేను వెళ్ళనా?" అని అడిగాడు మళ్ళీ.

"ఆఁ" అని ఆయన తలయెత్తిచూసి "ఎంతసేపయిందీ? వచ్చి కూచో" అన్నాడు.

"ఇంతకుముందే" అని నిరంజనుడు ఒక కుర్చీలాక్కుని ఆయన కెదురుగా కూచున్నాడు.

రావుసాహెబ్ టేబుల్ మీద కాయితాలు ఒకప్రక్కకు సర్దుతూ "నువ్వు వెళ్ళాలనుకుంటున్నావా?" అని అడిగాడు.

లలిత ఆసంగతి అప్పుడే చెప్పేసిఉంటుందని నిరంజనుడు గ్రహించాడు. "చిత్తం. మీరు అనుజ్ఞయిస్తే ఒక్కసారి వెళ్ళి మాఅమ్మను చూసివస్తాను. ఆమెనుచూసి చాలారోజులయింది" అన్నాడు.

నిరంజనుడిమాటల్లోని కాతరభావం చూసేసరికి రావుసాహెబ్ గారి హృదయం కరుణతో నిండిపోయింది. ఆయనకు చిన్నప్పుడే తల్లి చనిపోయింది. మాతృప్రేమ అతడికి లభించలేదు. అంచేత ఆయన ఏమీ అనలేక "సరే- మళ్ళీ ఎప్పుడొస్తావ్?"అని అడిగాడు.

"మీరు ఎప్పుడురమ్మంటే అప్పుడు వస్తాను."

"వీలైనంతత్వరలో వచ్చెయ్. వారంపదిరోజులకన్న ఆలస్యంచెయ్యొద్దు" అని ఆయన మళ్ళీ కాగితాలు చూసుకోవటం మొదలెట్టాడు నిరంజనుడు వెళ్ళబోతూండగా, "ఇదుగో చూడు, నిన్నొకమాట అడుగుతున్నాను. మనస్సులో ఏమీ అనుకోవద్దు. నేను నీకు పితృతుల్యుణ్ణి. నామాట తప్పపట్టొద్దు" అన్నాడు.

తన పరీక్షాసమయం వచ్చిందని నిరంజనుడు తెలుసుకున్నాడు. అబద్ధం చెప్పటం అతడికి యిష్టంలేదు.

నౌకరీ ఉండనీ, ఊడనీ—నిజం చెప్పాల్సిందే అని నిశ్చయించుకుని 'అడగండి' అన్నాడు.

రావుసాహెబ్‌గారు కుర్చీలోంచి లేచి పచార్లుచేస్తూ, నిరంజనుడి ఎదుటికివచ్చి, "నువ్వేమీ మనస్సులో అనుకోక నువ్వు అసలెవరో చెప్పు మాకు. నిన్నరాత్రి నువ్వు స్వచ్ఛంగా ఇంగ్లీషు మాట్లాడటంచూసి, నిజంగా నువ్వెవరివయినదీ మేం గుర్తించలేదని గ్రహించాం" అన్నాడు.

ఆయనప్రశ్నకు నిరంజనుడు కాస్సేపు మౌనంవహించి తన జీవితవృత్తాంతం యావత్తూ విశదంగా చెప్పేశాడు. అతడు చెప్పుచున్నంతసేపూ రావుసాహెబ్ నిరంజనుడి ముఖాన్నే పరిశీలిస్తూ కూర్చున్నాడు. అతడి ముఖంలో ఎప్పుడెప్పుడు దుఃఖచిహ్నాలు కనిపించిందీ, ఎప్పుడెప్పుడు క్రోధలక్షణాలు బైటపడిందీ గమనిస్తూనేఉన్నాడు. అతనికి మధ్యలో అడ్డురాకుండా ఆసాంతం శ్రద్ధగా విన్నాడు. అతడు చెప్పటం అయిపోయాక ఒక చుట్ట వెలిగించి ఈజీచైర్‌లో కూచుని ఆలోచనలోపడ్డాడు. నిరంజనుడు మెదలకుండా కాస్సేపు అట్లాగే కూచుని మెల్లిగా గదిలోంచి బైటికి వచ్చేశాడు.

నిరంజనుడి సాంసారిక వృత్తాంతం రావుసాహెబ్‌ను బాగా కదిలించివేసింది. ఈ వినయసంపన్నుడైన యువకుడు ఆయన మనస్సుకు బాగా నచ్చాడు.

ఆయన ఇలాఆలోచించుకుంటూ ఉండగా లలిత, మాధవదత్తు ఉదయం షికారుకెళ్ళి తిరిగివచ్చారు. రావుసాహెబ్

ఏదో ఆలోచనలో ఉండడం చూసి, ఇద్దరూ కాస్సేపు అలాగే నిలబడ్డారు తర్వాత లలితే ముందుకువచ్చి "అలాకూచున్నా వేం నాన్నా? నీకేమయినా అస్వస్థతగాఉందా?" అనిఅడిగింది.

"ఊహూఁ."

రావుసాహెబ్ సమయం వృథాచేసే మనిషి కాదు. ఆయన అలా ఊరికే కూచునిఉండటం చూచేసరికి లలితకు నిజంగా ఏదో భయమేసింది. "ఏమిటలా ఉన్నావ్? మాట్లాడ వేం నాన్నా?" అని మళ్ళీ అడిగింది.

"ఏం లేదు. నాకు ఒంట్లో బాగానేఉంది?" అని కాస్సే పాగి, "నిరంజనుడు శెలవడగటానికి వచ్చాడు" అన్నాడు.

లలిత కుర్చీలో కూర్చుని "ఆ సంగతి తెలుసు. మీరు శెలవిచ్చారా?" అంది.

"ఆఁ. శెలవిచ్చాను. అతడివాళ తన వృత్తాంతమంతా చెప్పాడు. బి. ఏ. దాకా చదువుకున్నాడు. హఠాత్తుగా తండ్రి పోవటంమూలంగా పరీక్షకుమాత్రం కూర్చోలేదు. కుర్రవాడు చాలా మంచివాడు. ఏమంటావ్?"

నిరంజనుడు తండ్రికి బాగా నచ్చాడని లలిత గ్రహించింది. అతడు బాగా చదువుకున్నవాడని తానూ తెలుసుకుంది. కాని తన తండ్రిని ఇంత విచలితునిచేసిన రహస్యం అతడి జీవితంలో ఏం ఉందో ఆమెకు తెలియదు. తెలుసుకుందామని కుతూహలంఉన్నా అడగటం మంచిదిగాదని ఆమె తండ్రిని అడగలేకపోయింది.

మిస్టర్ దత్తు నిరంజనుడి సంగతి తెలుసుకుందామనే ఇంతసేపూ కూచున్నాడు నిరంజనుడు బాగా చదువుకున్న

వాడై ఉంటాడని నిన్ననే తెలుసుకున్నా, తాను అమర్యాదగా ప్రవర్తించినందుకు సిగ్గుపడకుండా లలిత ఏమవుతుందోఅని చింతపడసాగాడు. నిరంజనుడు తనకు ప్రతిద్వంది అయినాడే అన్న దిగులుతో దత్తు రాత్రిఅంతా నిద్రపోనేలేదు. ఇవాళ ఉదయం నిరంజనుడు వెళ్ళిపోతున్నాడని లలిత చెప్పేసరికి 'అమ్మయ్య' అని అనుకుని "ఎందుకని?" అని అడిగాడు కాని లలిత జవాబుచెప్పకపోయేసరికి మళ్ళీ తరిచితరిచి మాత్రం అడగలేదు.

రావుసాహెబ్ నిరంజనుణ్ణి ప్రశంసిస్తూఉంటే దత్తుకు లోలోపల మండిపోతోంది. అయినా కొంతివరకు తమాయించుకుని, "అతడు బి. ఏ. వరకు చదివాడని మీరెలా తెలుసుకున్నారు?" అనిఅడిగాడు.

రావుసాహెబ్ పొగపదుల్తూ "అతడేచెప్పాడు" అన్నాడు.

"అతడిమాట నమ్మకమేమిటి?"

రావుసాహెబ్ కళ్ళు పెద్దవిచేసి మిష్టర్ దత్తుముఖం కేసి కాస్సేపుచూసి "చూడు మాధవ్! ఈ 'లా' రోజులు వచ్చాక మనుష్యులమీద విశ్వాసమే పోగొట్టుకుంటున్నారు మరీ. కాని నేను ముప్ఫైయేళ్ళనుంచీ ఇన్నివ్యవహారాలు చూసుకుంటున్నా అనవసరంగా మనుష్యులమీద అపనమ్మకాలు పెట్టుకోలేదు" అన్నాడు.

"మీరు కాస్తకీ కూస్తకీ ప్రతివాళ్ళనీ నమ్ముతారు కనుకనే సులభంగా మోసపోతారు."

రావుసాహెబ్ బట్టతల నిమురుకుంటూ "ఏదీ? ఇంత వరకు నేను ఎవర్నినమ్మి మోసపోలేదు! వృథాగా వాదన ఎందుకు! పోనీ ఆ షెల్ఫ్‌లో 'యూనివర్సిటీ క్యాలెండర్' ఉందిగా! నిజమో అబద్ధమో తీసిచూడు. అతడు ఇవాళ నాతో చెప్పినసంగతులనుబట్టి చూస్తే ఈ చదువులు నేదీ అతడికసలు ఒక లెఖ్ఖలోదే కాదు" అన్నాడు.

మిష్టర్ దత్తు ఇంకేమీ మాట్లాడకుండా — ఆ 'క్యాలెండర్' తీసి పేజీలు తిరగెయ్యటం మొదలెట్టాడు. నిరంజన గంగూలీ యఫ్. ఏ. ఫస్టుక్లాసులో ప్యాసయినట్లు అందులో పేరు ఉంది. అది చదివేసరికి అతడిముఖం వెలవెల పోయింది. ఇంకేమీ మాట్లాడలేకపోయాడు. "ఏమిటి? కన్పించిందా?" అని ఉత్కంఠతో అడిగాడు. రావుసాహెబ్.

దత్తు నీళ్ళు నములుతూ "చిత్రం. యఫ్. ఏ. ప్యాసయినమాట నిజమే" అన్నాడు.

లలిత ఇప్పటివరకు వాళ్ళమాటలువింటూ ఊరుకుంది. దత్తు సంకుచిత మనస్తత్వంమీద ఆమెకు అసహ్యం వేసింది. ఎకసక్కెంగా "ఏం? ఇప్పటికైనా నమ్మకం కలిగిందా?" అని అడిగింది.

లలితమాటలు విని ఇద్దరూ ఆమెకేసి చూశారు. వాళ్లు ఆమె మాటలు వినిపించుకోనట్లు నటిస్తూ—"ఏమిటిఅన్నావ్ లలితా?" అని అడిగాడు రావుసాహెబ్.

లలిత ఇంక పూర్తిగా తమాయించుకోలేక పోయింది. అయినా వీలైనంత నిగ్రహించుకుని, "దత్తుగారు ఇప్పటికైనా నమ్ముతారేమోఅని అన్నాను" అన్నది.

దత్తు ఆమాటల్లోని భావాన్ని గ్రహించి, సిగ్గుపడ్డాడు. పైకేమీ మాట్లాడలేదు. రావుసాహెబ్‌గారు మామూలుగా చుట్టతాగుతూ కూచున్నాడు. ఆయన అసలుసంగతి యావత్తూ పూర్తిగానే గ్రహించాడు. అయినా ఇలాంటి అప్రియమైన సంఘటన ఇకనైనా జరగకుండా ఉంటే మంచిదనే భావంతో "నీ చదువు ఎలా సాగుతోంది లలితా?" అని అడిగాడు.

లలిత తండ్రిఉద్దేశాన్ని గ్రహించి "ఫర్వాలేదు" అంది

"పరీక్ష లెప్పుడు?"

"ఇంకా నెల్లాళ్ళున్నాయి"

"సరే, అయితే నువ్వువెళ్ళి చదువుకో. ఇవాళ నాకు అవుసరమైన పని ఉంది"

లలిత వెళ్ళిపోయింది.

మధ్యాహ్నం భోజనమయ్యాక రావుసాహెబ్ తన గదిలో విశ్రాంతితీసుకుంటూండగా ఆయనభార్య లోపలికి వచ్చింది. ఇవాళ ఆయన భోజనసమయంలో ఏదో పరధ్యానంగా ఉన్నట్లు ఆమె గమనించింది. సాధారణంగా సాంసారిక విషయాలు ఆమె ఆసమయంలోనే భర్తతో మాట్లాడుతూ ఉంటుంది. కాని ఇవాళ ఆయన భోజనసమయంలో 'ఊఁ' 'ఉహూఁ'లుతప్ప జవాబులేమీ చెప్పలేదు.

రావుసాహెబ్‌గారు నుదుటిమీద చెయ్యిపెట్టుకుని ఉన్నాడు. ఆమె గబగబా దగ్గిరకువచ్చి, ఒంటిమీదచెయ్యివేసి చూసి, మీకేమయినా అస్వస్థతగా ఉందా?" అని అడిగింది.

ఆయన నుదుటిమీద చెయ్యితీసేసి, 'లేదు, ఒకవిషయం ఆలోచిస్తున్నాను'' అన్నాడు.

"ఏమిటది? నాతో చెప్పవచ్చునా?"

భార్యను పక్కనే కూర్చోమని చెప్పి, సంగతియావత్తు చెప్పాడు. అంతావిని "పాపం, కుర్రాడు చాలాకష్టాలు పడ్డ వాడే'' అంది.

"ఊఁ, అతడిసంగతంతా విన్నాక నామనస్సేమీబాగా లేదివాళ. ఒక్కపనికూడా చెయ్యలేకపోయాను.

"కుర్రాడు చాలా మంచివాడు. నిన్న లలిత నదిలోపడ్డప్పుడు - అందరూ అట్లా నిలబడి చూస్తుంటే అతడే నీళ్ళలో దూకి లలితను బ్రతికించాడు.

ఈమెకుకూడా అతడిమీద సుమతపర్పడిందని ఆయన గ్రహించాడు. తాను ఏదైనా చెయ్యతలచుకున్నా ఆమెయేమీ అభ్యంతరం చెప్పదనికూడా గమనించాడు. "అతడికేదైనా ఉపకారంచేస్తే కాని మనస్సుకు శాంతిఉండేట్లులేదు. అదీగాక మన అమ్మాయిని బ్రతికించినందుకు ఎటూ బహుమతి యివ్వాల్సేఉంది. ఏమంటావ్?''

"అవును ఎన్నిచెప్పినా మర్యాదస్తులయింటిబిడ్డ. తోటపనితోనే ఇహాముందుకూడా జీవించటం బాగుండదు. పైగా చదువుకున్నవాడు. అతడికి మీరేదైనా చెయ్యండి. ఎన్నో విధాల డబ్బు ఖర్చుఅవుతూనే ఉంటుంది దేవుడా, పోనీ అతడికేదైనాచేస్తే ఒక వ్యక్తికి సహాయంచేసినట్లవుతుంది''

రావుసాహెబ్ గారు కొంచెం చమత్కారంగా—'నువ్వు నా డబ్బు ఖర్చయే ఉపాయమే చూస్తుంటావు. ఇదంతా మీ కోసంకాదూ!' అంటూ కాస్త అభినయించేశాడు.

గృహిణి సిగ్గుపడుతూ "ముసలితనంవస్తున్నా చమత్కారాలు మానలేదు. ఇవాళకాకపోయినా రేపయినా అల్లుడొస్తాడని గుర్తుందా! పోనీ, ఏం చెయ్యటానికి నిశ్చయించుకున్నారు!" అంది.

ఆయన తలనిమురుకుంటూ "ఇంకా యేమీ నిశ్చయించుకోలేదు. అదీగాక అసలు అతడు నా సహాయాన్ని అంగీకరిస్తాడో లేదో తెలుసుకోందే—ఏమీ చెయ్యలేను. ముందు అతడ్ని అడిగి, తర్వాత ఏంచేస్తే బావుంటుందో ఆలోచించి చెయ్యాలి" అన్నాడు.

సాయంకాలం నిరంజనుడు గదిలోకూర్చుని సామానులు సర్దుకుంటున్నాడు. రాత్రి రైలుకు వెళ్ళిపోవాలనుకుంటున్నాడు. ఆట్టే టైంలేదు. ఈలోపుగానే చంద్రనాధ్ యింటికికూడా ఒకసారి వెళ్ళిరావాలి. అంచేత కొంచెంతొందరపడుతున్నాడు. రావుసాహెబ్ గారి దగ్గిర్నుంచి వచ్చినప్పట్నుంచీ మనస్సు కాస్త ప్రశాంతంగావుంది. హృదయం తేలిగ్గాఉంది. రావుసాహెబ్ గారు తనకి శెలవు యివ్వటమే కాకుండా ఉద్యోగంలోంచి తొలగిస్తాడని తెలిస్తే నిశ్చింతుడవుతాడు. ఎంచేతంటే తాను వచ్చేటప్పుడు ఆయన ఇంకేమీ మాట్లాడలేదు.

ఏమయినా తాను వెళ్ళేలోపుగా ఏదో జరుగుతుంది. అది తెలుసుకోటానికి నిగ్రహం అవలంబిస్తున్నాడు.

ఈసమయంలో లలితవచ్చి, "ఏమిటి, ఇవాళే వెడతారా! నాకు తెలియదే!" అంది.

నిరంజనుడు కొంచెం ఉలిక్కిపడ్డాడు. లేచినిలబడి సంకోచిస్తూ "ఆం. ఇవాళే వెడతాను" అన్నాడు.

"అదేమిటి? రేపు లక్ష్మీపూజ అయితే ఇవాళ ఎవరయినా వెళ్ళనిస్తారా!"

"మీ యింట్లో లేదుగా పూజ! ఇంక నేను వెళ్ళటానికి-"

"మా యింట్లో ఉంటేయేం లేకపోతేయేం? రేపు పూజ అన్నమాట నిజమేకదా! మరి—"

నిరంజనుడు వినయంగా "కాని ఇవాళ నన్ను—"

"ఊహూం. ఇవాళ, రేపు వెళ్ళటానికి వీల్లేదు. పూజ అయిపోయాకే. పదండి, కాస్సేపు షికారు వెళ్ళివద్దాం" అని లలిత ముందు బయలు దేరింది. లలితమాటకు ఎదురుచెప్పటానికి వీల్లేదని గ్రహించి నిరంజనుడు సామానుసర్దటం ఆపేశాడు. కాని ఆమె తనతో షికారుకు రమ్మనేసరికి దత్తుసంగతి గుర్తుకొచ్చింది అతడు బ్రతిమాలుతూ "దత్తుగార్ని వెంటపెట్టుకు వెళ్ళకూడదూ. నాకు కొంచెం పని ఉందే" అన్నాడు.

దత్తుమాట వచ్చేసరికి ఆమెకు ఒళ్లు మండిపోయింది. "మీరు రాకపోతే నేనొక్కర్తెనే వెడతా"నని వెళ్ళిపోయింది.

ఆమెకు కోపంవచ్చిందని గ్రహించి, నిరంజనుడు ఇంకేం మాట్లాడకుండా గబగబా గదిలోంచి బైటికివచ్చి ఆమెను అనుసరించాడు. దత్తు ఆఫీసువరండాలోనుంచి ఈ దృశ్యం చూసి కోపంతో పెదవి భిగించుకున్నాడు. లలితఒక్కర్తే వెళుతూ ఉండటంచూసిబయలు దేరినవాడల్లా అక్కడే ఆగిపోయాడు.

## ౨౪

ఇవాళ లక్ష్మీపూజ. ఉదయంనుంచి నదికి అవతలిబడ్డున ఉత్సవంగా ఉంది. ప్రతిసంవత్సరం ఈ రోజున బీదవాళ్లు తమ శక్తికొలది ఉత్సవం చేసుకుంటూ ఉంటారు. కాని ఈవైపున ఉన్న శ్రీమంతుల యిళ్ళల్లో ఆ ఉత్సవమేమీ ఉండదు. ఎక్కడ అయితే లక్ష్మి ఉండదో అక్కడే ఆమెను బంధించటానికి వ్యర్థప్రయత్నం చేస్తూ ఉండటం కన్పిస్తుంది సాధారణంగా—

రాయిమణి తెల్లవారుఝామునుంచి పనిలో మునిగి తేలుతోంది. రాత్రికూడా అయినా పిండివంటలు చేస్తూ చాలా సేపు మేలుకుంది. చంద్రనాథ్ వసారాలో హుక్కాపీలుస్తూ కూచుని ఎవరెవరి యిళ్ళల్లో ఎలా పూజలు జరిగేదీ తనలో తాను ఊహించుకుంటున్నాడు.

రాయిమణి గుమ్మం ఊడుస్తూ "నాన్నా! నువ్వు బజారునుంచి వచ్చేటప్పుడు—ఇంకెవరెవర్నీ పిలవాలో పిలిచి రా" అని చెప్పింది

"సరే కాని, చూడు మణీ! బాబుగార్నీ—అమ్మాయి గార్నీకూడా పిలిచివస్తాను. ఏమంటావ్?"

మణికి మనస్సులో ఉద్దేశమున్నా నిరంజనుణ్ణి పిలవమని తండ్రితో చెప్పటానికి సిగ్గుపడింది. నిరంజనుడు ఊరికి వెళ్ళ లేదని ఆమె భిల్లుక్ ద్వారా తెలుసుకుంది. నిరంజనుడు ఆ 'బోట్ రేస్' అయినప్పట్నుంచి వాళ్ళింటికి రావటం లేదు. తండ్రిని ఏదోవంకతో నిరంజనుడి కబుర్లు తెలుసుకురావటానికని పంపుతూ ఉండేది, కాని చంద్రనాథుడొచ్చి చెప్తున్నదాన్ని బట్టి ఆమెకు మరింత దుఃఖం కలుగుతుండేది. కనాము భిల్లుక్

హుక్కా త్రాగుతూ ఏదో మాటామాటావచ్చి "చూశావా చంద్రదా? మన బాబుగారు బాగా చదువుకున్నవాడే. అమ్మాయిగారిప్పుడు పొద్దునా సాయంత్రం ఆయనదగ్గరే చదువుకుంటోంది" అనిచెప్పాడు

చంద్రనాథ్ ఆమాటవిని ఉత్సాహంతో "చదువుకేం? చాలామందికి వచ్చునోయ్! కాని బీదవాళ్ళమీద ఇంతమమత ఎంతమందికి ఉంటుంది చెప్పు? ఆ రోజున బజారుకు వెళుతూ అమ్మాయిగారూ, బాబుగారూ షికారు వెళుతూఉండటం చూశాను. నన్నుచూసి 'కులాసాగా ఉన్నావా చంద్రనాథ్? జ్వరం రావడంలేదుకదా!' అని అడిగారు. 'మీదయవల్ల కులాసాగానే ఉన్నాను బాబూ' అన్నాను 'నేను అక్కడకు రావటంలేదని ఏమీ అనుకోవద్దు చంద్రనాథ్! కొంచెం తీరిక చిక్కగానే వస్తాను. మణి కులాసాగాఉందా?' అని అడిగారు. నిజంగా దేముడనుకో! లేకపోతే ఎవరైనా ఇవన్నీ అడుగుతారా?" అంటూ అతన్ని ఉద్దేశించి చేతులెత్తినమస్కరించాడు.

రాయమణి అప్పుడు అన్నంవండుతూ ఉడికిందోలేదో అని మెతుకుపట్టుకుని చూస్తోంది. వీళ్ళిద్దరిమాటలూ విని, నిరంజనుడు ఎందుకురావటంలేదో ఊహించుకునేసరికి ఆమె కింక వంటచెయ్యబుద్ధిపుట్టలేదు- తండ్రిని భోంచేయమనిచెప్పి, ఆమె బొంతకప్పుకుని పడుకుంది. ఇవాళ నిరంజనుడ్ని పిలవటం సంగతి వచ్చేసరికి ఆమె యేమీ చెప్పలేకపోయింది. పిలిచినా వస్తాడోరాడో అని ఆమెకు సందేహంఉంది. చీకటిపడ్డాక పురోహితుడు పూజచేయించటానికి వచ్చాడు. అప్పుడే ఇరుగుపొరుగు పిల్లలుచేరి గందరగోళంచేస్తున్నారు. పెద్దవాళ్ళు ఇంకా రా

లేదు. రాయిమణి మధ్యమధ్య జామచెట్టు సందులోంచిచూస్తూ ఉంది. రాత్రి యెనిమిదింటికి వీళ్ళందరి భోజనాలూ పూర్తి అవుతుండగా—ముందు లాంతరు పట్టుకుని భిల్లుక్, వెనక లలితా నిరంజనులూ రావటంచూసి, మణి ఏదో పనిఉన్నట్లు వంటయింట్లోకి పోయి దాక్కుంది. సిగ్గుతో వాళ్ళ యెదుటికి రాలేకపోయింది.

ఆలస్యమయినందుకు నిరంజన్ చంద్రనాథ్‌కు క్షమాపణ చెప్పబోతుంటే, అతడు నాలికకరచుకుని, నిరంజనుడి పాదధూళి శిరస్సున దాల్చి, "అదేమిటి బాబూ! ఇప్పుడేగా అందరూ భోజనాలకు కూర్చుంది" అని చాపతెచ్చి వేశాడు. లలిత అప్పటికే వంటయింట్లోకి వెళ్ళి మణితో కబుర్లు ప్రారంభించింది. చంద్రనాథ్ బైటనుంచి, "మణి! బాబుగారికీ, అమ్మాయిగారికి కూచోటానికి కాస్త చోటు చూడు ప్రతిదీ చెప్పాలిసిందే, లేకపోతే నీకేమీ తెలియదు" అని కేకేశాడు.

రాయిమణి బైటికివచ్చి నిరంజనుడికి నమస్కరించింది. "ఖులాసాగా ఉన్నావా మణీ?" అని అడిగాడు నిరంజనుడు. ఆమె తలఊగించి ఫలహారంతీసుకురావటానికి లోపలికివెళ్ళింది. ఫలాహారాలయిపోయాక "చంద్రనాథ్! నేను మా అమ్మను చూసిరావటానికి వెడుతున్నాను" అన్నాడు నిరంజనుడు.

"మళ్ళీ వస్తారుగా బాబూ! బీదవాళ్ళం, మరిచిపోకండి"

"అహహా, చంద్రనాథ్! మిమ్మల్ని మరిచిపోతానా! మళ్ళీ పదిరోజుల్లో వస్తాగా." ఈ సమయంలో రాయిమణి నిశ్శబ్దంగావచ్చి అతడికి నమస్కరించింది.

"జాగ్రత్త మణీ! చంద్రావాధుక్ని ఒక కంట కనిపెట్టి ఉండు" అని లలితతో బయలుదేరాడు నిరంజనుడు. రాయి మణి వాళ్ళను కన్పించినంతదూరమూ చూసి, చివరకు వెళ్ళి ఎలాగో భోజనంచేసి పడుకుంది. నిద్రలో ఆమెకు నిరంజనుడి చిరునవ్వుముఖం కన్పించసాగింది. ఆరాత్రి సరిగ్గా నిద్ర పట్టలేదామెకు.

మర్నాడు ఉదయం తాను ఊళ్ళోలేనప్పుడు చెయ్యవలసిన పనులన్నీ కూలిలకు అప్పగించటానికని బంగళాకేసి వెడుతున్నాడు. రావుసాహెబ్ గారు తోటలోనుంచి అప్పుడు తనకోసమయ్యే వస్తున్నాడు. దగ్గరకురాగానే "పదవోయ్ గంగూలీ, కాస్సేపు షికారుకు వెళ్ళివద్దాం" అని ముందు బయలుదేరా డాయన. నిరంజనుడు వెనకాలవెళ్ళాడు. రావు సాహెబ్ గారు ఇలా హఠాత్తుగా షికారుకు ఎందుకు బయలు దేరాడో అతడు తెలుసుకోలేకపోయాడు. అతడు ఇక్కడ ఉద్యోగంలో ప్రవేశించాక ఈయన నదిఒడ్డుకు షికారుకు వెళ్ళగా యెన్నడూ చూడలేదు.

కొంతదూరం వెళ్ళాక "నువ్వు యివాళే వెడుతున్నావా గంగూలీ?" అని అడిగాడు రావుసాహెబ్.

నిరంజనుడు తల ఊగించి 'ఊఁ' అన్నాడు.

"మళ్ళీ యెప్పుడొస్తావ్?"

"చిత్తం. పదిరోజుల్లో వస్తాను"

మళ్లీ కొంతదూరం వెళ్ళాక "లలిత చదువు యెలా ఉంది? ప్యాసవుతుందా?" అని అడిగా డాయన.

"ప్యాసవుతుందనే ఆశ వుంది"

ఆయన నవ్వుతూ "ఆ ఆశతోనే కదా అందరూ చదివేది. కాని అన్నప్పుడల్లా వ్యాసమాత్రులు కారు. నీమాటలవల్ల ఏమీ స్పష్టంగా తేలలేదు" అన్నాడు.

"చిత్తం వ్యాసవుతూ ఉండండి" గట్టిగా చెప్పాడు నిరంజనుడు.

"అలా చెప్పు" అని రావుసాహెబ్ ముందు నడుస్తూ "సరేకాని గంగూలీ! నీకీ నౌకరీ చెయ్యటం, బాధగా లేదూ? చదువుకున్నవాడివి ఇది చెయ్యటమేమిటి? ఇంకేదైనా—"

ఆయనమాటల్లోని భావమేమిటో గ్రహించలేక— "చిత్తం. అదేం లేదు. కష్టం ఏముంది?" అన్నాడు.

"సరే, కష్టం లేకపోవచ్చు. కాని ఇలాగే జీవితమంతా గడపలేవు. ఇంకా కుర్రవాడివి కనుక ఆ కష్టసుఖాలు తెలియటంలేదు. నా వయస్సు వచ్చేసరికి ఇది సాగదు. అదీకాక నువ్వింకా చిన్నవాడివే కనుక నీకేదైనా ఉపకారం చెయ్యటం ఉచితం. ఆతర్వాత ఇంక వీలుండదు.

నిరంజనుడు మెదలకుండా ఊరుకున్నాడు. రావుసాహెబ్ మళ్ళీ—'నువ్వింకా ఏదైనా చెయ్యటం ఉచితమనితోస్తుంది నాకు. నీకింకా చదువుకునే వయస్సు దాటలేదు. మళ్ళీ చదువుకో గలవా?" అన్నాడు.

"ఆ, చదువుకుంటాను, కాని డబ్బు—"

"ఆఁ. ఆఁ. అదే, డబ్బులేకపోవటం మూలంగా చదువుకోలేకపోయావ్. నాకది తెలుసు. లేకపోతే నువ్వెందుకు నౌకరీ చేస్తావ్?" అని నడిబడ్డుకువచ్చి "పద, పడవమీద కాస్త దూరం వెళ్ళివద్దాం" అన్నాడు.

రావుసాహెబ్‌గారి ఈ చిత్రమైన వాలకాన్ని చూసి నిరంజనుడు ఆశ్చర్యపోయి మాట్లాడకుండా ఊరుకున్నాడు. ఇద్దరూ నావలోకెక్కి కూచున్నారు. కొంచెందూరం వెళ్ళాక ఆయన చుట్ట ముట్టించి, "చూడు నిరంజన్! నువ్వు ఆరోజున నీసంగతులు చెప్పింతర్వాత నేను చాలా ఆలోచించిచూశాను నీచెల్లెలిసంగతి. నేవిన్నదాన్నిబట్టి ఆమె గర్హనీయమైనపని చేసినట్లు తోచదు నాకు. అత్తవారింటిదగ్గర బాధలుపడలేక ఏ ఆశ్రమానికో పోయిఉంటుందనుకుంటా" అన్నాడు.

తన చెల్లెల్నిగురించి అతడు ఎవరినోటంట విన్నా చెడుగానే విన్నాడు. ఇవాళ ఈయన ఒక్కడూ మంచిగామాట్లాడటం వినేసరికి రావుసాహెబ్‌గారంటే నిరంజనుడికి చాలా గౌరవం ఏర్పడింది. "బహుశా అంతే అయివుండొచ్చు. కాని ఎవర్ని చూడబోయినా ఆమెనుగురించి చెడుగా మాట్లాడేవాళ్ళే. సుధ ఎక్కడవుందో వెతకాలని చాలాసార్లు ప్రయత్నించి కూడా లోకాపవాదుకు జడిసి ఊరుకున్నాను" అన్నాడు.

రావుసాహెబ్ సహానుభూతి వ్యక్తపరుస్తూ "నేనా మొదట్లోనే గ్రహించాను నిరంజన్. మన సంఘం ఇంత డటంమూలంగానే మన హిందూమతం అధఃపతిత సిద్ధంగావుంది. మీరంతా యువకులు. ఈ సమా ల్చి—మరొక క్రొత్తసమాజాన్ని—హిందువుకు ధ్య జాతివిభేదంలేనిదాన్ని—అఖండ హిందూ న్ని—నిర్మించవలసినభారం మీమీదఉంది"

"ఈమాట నిజమే. కాని సమాజానికి విరుద్ధంగా ఎవరైనా యెదురుతిరిగారంటే వాళ్ళను అందులోంచితరిమేందుకు సిద్ధపడేవాళ్లు చాలామంది ఉంటారు.

"అవును. అది నాకూ తెలుసు. కాని ఈ ఎదురుతిరిగే వాళ్లపక్షం వహించేవాళ్ళుకూడా కొంతమంది ఉంటారని మాత్రం మరిచిపోకు. ప్రాచీనులకూ నవీనులకూ తగాదా ఏర్పడుతుంది. నవీనులే అందులో గెలవవచ్చు. ఒకవేళ గెలవక పోయినా సమాజంలో పరివర్తనమాత్రం వచ్చితీరుతుంది. అలా సంఘానికి ఎదురుతిరగాలని నాకూ మధ్యమధ్య అనిపిస్తూ ఉంటుంది. కాని, ఈ వృద్ధాప్యంలో అశాంతిని తెచ్చిపెట్టు కోవడం యిష్టంలేదు. ఆ సంగతిఅలాఉంచు. ఈవిషయం ఇంత టితో తేలేదికాదు" అని మళ్ళీ చుట్టకాల్చటం మొదలెట్టాడు.

ఇద్దరూ మెదలకుండా ఊరుకున్నారు. రావుసాహెబ్ గారు ఏం మాట్లాడతలచుకున్నదీ తెలియక నిరంజను మ నీళ్ళ కేసిచూస్తూ కూచున్నాడు. ఆయన కొంచెంసేపు ఆగి, 'చూడు, నేను చాలారోజులనుంచి ఆలోచిస్తూవచ్చాను. మన దేశపరిస్థితి నానాటికి తిసినట్టుగాఉంది. ఇలా కొన్నాళ్ళుంటే తిండి లేకకూడాచావాల్సివస్తుంది. చదువుకున్న వాళ్లుమీ యువకులున్నారంటే ఉద్యోగంతప్ప యింకేమీ ఆలో అసలు అందుకే చదువుతారనుకుంటా. నీవ చూడరాదూ? బి. ఏ. దాకా చదువుకుని తో గానికి తయారయావ్. ఇతరప్రాంతాలనుంచి వ వారంతా ఇక్కడ వ్యాపారాలూ అవీ చే కుంటున్నారు. మనకి వాళ్ళే ప్రభువులయినట్ట

నీళ్ళు మనం తాగాల్సివస్తోంది. ఉద్యోగం చేయకపోయినా వ్యవసాయంచేస్తే కడుపునిండా తిండి దొరుకుతుంది అని నా నమ్మకం. విదేశాలకుపోయి, మనదేశానికి అవసరమైన విద్య నేర్చుకుని వచ్చి ప్రయోజకులైనవారు ఒక్కడూ నాకు కన్పించలేదు" అని చుట్ట మరోదమ్ములాగి, "విదేశాల్లో వాళ్లు చూడు, కొండలమీదకూడా పంటలు పండించగలుగు తున్నారు. మనదేశంలో ఇంతచక్కని భూమి ఉన్నా రైతు తిండిలేక మరణిస్తున్నాడు. నా ఉద్దేశమేమిటంటే మీలాంటి వాళ్ళు విదేశాలకుపోయి ఈ విద్య నేర్చుకురావాలి" అన్నాడు.

రావుసాహెబ్‌గారికి జవాబు ఏంచెప్పాలో నిరంజనుడికి తోచలేదు. అతడి సందిగ్ధస్థితి ఆయన గమనించాడు "ఏం? మాట్లాడవేం?" అని అడిగాడు.

"ఏం మాట్లాడను చెప్పండి! నా స్థితి మీకు తెలుసు. విదేశాలకు వెళ్ళేందుకు—"

"డబ్బులేకపోతే నేనిస్తాను. ఈ వృద్ధాప్యంలోనైనా దేశోపకారకమైన ఒకపని చెయ్యగలిగానని తృప్తిపడతాను"

ఆమాటవిని నిరంజనుడు ఆశ్చర్యపోతూ ఆయనముఖం కేసి చూస్తూ ఊరుకున్నాడు. తర్వాత— "చూడండి, మీడబ్బు—"

రావుసాహెబ్ అతడి ఉద్దేశాన్నిగ్రహించి ఆ మాటకు అడ్డువచ్చి, "నాదగ్గిర డబ్బు తీసుకోటానికి నీకు సంకోచం ఉండటం సహజమే. పోనీ తర్వాత సంపాయించేప్పుడు తీర్చ దువుగానిలే. అప్పుతీసుకున్నా వనుకో" అన్నాడు.

రావుసాహెబ్‌గారి ఉదారబుద్ధి చూసి నిరంజనుడు ముగ్ధుడైనాడు. అయినా డబ్బుతీసుకోటానికి సంకోచంమాత్రం అలాగే ఉంది. చాలాసేపు ఆలోచించి ''మాఅమ్మను ఒకసారి అడిగిచూడటం మంచిది. ఆమె ఏమంటుందో చూసి—'' రావుసాహెబ్ ఉత్సాహితుడై ''ఓ, తప్పకుండా. మీ అమ్మను అడగకపోవటమేమిటి! ఈ విషయమై ఆమెకు నేనుకూడా ఒక ఉత్తరం రాస్తాను''అని పల్లెకారితో 'నావను ఒడ్డుకు పట్టవోయ్' అన్నాడు.

రావుసాహెబ్ నడుస్తూ ''మీ అమ్మ యిష్టపడితే, నువ్వు వచ్చేముందు నాకో ఉత్తరం రాయి. నీ ఉత్తరం చూసుకుని మిగతా ప్రయత్నాలుచూస్తాను'' అని, ఆసమయంలో మిష్టర్ దత్తు వస్తూఉండటం చూసి, నిరంజనుడితో 'సరే, వెళ్ళు, వెళ్ళేముందు నాదగ్గిర్నుంచి ఉత్తరం తీసుకెళ్ళు'' అని ఆయన డ్రాయింగ్‌రూంకేసి వెళ్ళాడు. దత్తు దూరంనుంచే నిరంజనుడి మీద ఒక క్రోధవీక్షణం విసరి, రావుసాహెబ్‌తో కలిసి వెళ్ళిపోయాడు.

—౨౫—

నిరంజనుడు విదేశాలకు వెడుతున్న సందర్భాన్ని పురస్కరించుకొని రావుసాహెబ్ ఒక విందు ఏర్పాటుచేశాడు. బంగాళా, తోట అన్నీ అలంకరించారు రావుసాహెబ్‌గారు హడావిడిగా తిరుగుతూ నౌకర్లను ఆజ్ఞాపిస్తున్నాడు. ఆయన ఎప్పుడూ ఇంత కంగారుపడటం చూడలేదెవ్వరూ. ఆయన సెక్రటరీ మాధవదత్తు ఊళ్ళోలేడు. అతడు కొద్దిరోజులక్రితమే

శెలవుతీసుకుని వెళ్లాడు. బహుశా మరోచోట ఉద్యోగం చూసుకుందామని వెళ్ళాశల్లేంది లోపల గృహిణి భోజనపు యేర్పాట్లన్నీ చూస్తోంది.

నిరంజనుడు విదేశాలకు వెడుతున్నాడనే వార్త ఊళ్లో కొంచెం అలజడిని కలిగించింది. అతడితో రావుసాహెబ్ ఇంత ఘనిష్టసంబంధం ఏర్పరుచుకోవటంచూసి కొందరు వ్యంగ్యంగా ఎక్కిరించనుకూడా ఎక్కిరించారు.

నిరంజనుడు తన గదిలో కూర్చుని ఏవో అవసరమైన పనులు చూసుకుంటున్నాడు అతడు మేనమామ యింటికి వెళ్ళి తల్లిని చూసివచ్చాడు కొడుకు విదేశాలకువెళ్ళ టానికి తల్లి అనుమతి యిచ్చింది. ఒక్కగా ఒక్కకొడుకు అంతదూరం వెళ్ళటం నిజానికి ఆమెకు యిష్టం లేకపోయినా, అతడిభవిష్యత్తును ఆలోచించి ఆమె కాదనలేకపోయింది.

రావుసాహేబ్ ఏర్పాట్లన్నీ చేశాడు. కాని నిరంజను డికి ఊరూపుగా మాటిమాటికీ మూడుముఖాలు కళ్ళుమూసు కున్నా కన్పించసాగాయి. సుధ, లలిత, రాయిమణి-వీళ్ళవే ఆ ముఖాలు. సుధ సేవాశ్రమంలో ఉంటున్నదన్న సంగతి స్పష్టంగా తెలిసింది. అయినా అవకాశం లేకపోవటంవల్ల, అభి లాష ఎంతగాఉన్నా, ఆమెను వెళ్ళి చూసిరాలేకపోయాడు. రేపే అతడిప్రయాణం.

లలితవిషయమై అతనికిప్పుడు ఎక్కువ బెంగపట్టుకుంది. తనకు తెలియకుండానే అతడు లలితను ప్రేమిస్తున్నాడు. కాని వెళ్ళిపోవాల్సిన సమయం దగ్గరకు వచ్చేసింది. అతడికి పనిలో మనస్సుచొరక లలితను వెతుక్కుంటూ బైటకొచ్చాడు.

తోటలో లలిత కన్పించకపోయేసరికి నిరంజనుడు ఆమె రీడింగ్‌రూంకేసి వెళ్లాడు. గుమ్మందగ్గరకొచ్చి పరదాతొలంచి లోపలకు చూశాడు. టేబిల్‌మీద తలఆనించి ఆమె ఏడుస్తూ కూచుంది. మొదట్లో గదిలోకి వెళ్ళనా వద్దా అని అతడు కాస్సేపు సంకోచించాడు. చివరకు "లోపలకు రావచ్చునా!" అని అడిగాడు.

నిరంజనుడికంఠస్వరంవిని లలితఉలిక్కిపడింది. చటుక్కున కళ్ల నీళ్లు తుడుచుకుని "రండి" అన్నది. గదిలోకివచ్చి ఆ టేబిల్ ముందరే ఒక కుర్చీలాక్కుని కూచుని, ఏమీ ఆలోచించకుం డానే "ఏడుస్తున్నారా మీరు!" అని అడిగాడు.

లలితముఖం సిగ్గుతో ఎర్రపడింది. తలవంచి 'లేదు' అంది.

"అయితే మరి మీకళ్ళల్లో నీళ్ళున్నాయ్, ఎందుకని!"

నిరంజనుడి అద్భుతమైన ఈ ప్రశ్నవిని లలిత అతడి ముఖంకేసిచూస్తూ "నాకళ్ళల్లో నీళ్లున్నాయని ఎవరు చెప్పారు!" అంది.

"నాకు కన్పించటంలా! ఒకరు చెప్పాలా!"

లలిత జవాబు చెప్పలేదు.

"ఏం, జవాబు చెప్పరేం!"

"ఏం చెప్పను!" లలిత కంఠం అశ్రురుద్ధమయింది. ఆమెకంఠస్వరంవిని నిరంజనుడు ఉలిక్కిపడ్డాడు. అతడికి విష యం యావత్తూ స్వచ్ఛమైన నీటిలాగా కన్పించసాగింది. అతడి మనస్సంతా పులకించింది. ఏం చెయ్యాలో తోచక కాస్సేపు అలాగే ఊరుకున్నాడు. తర్వాత లలితకుర్చీవెన కాలకు వచ్చి "మిస్ లలితా" అన్నాడు.

లలిత తలవంచుకుని టేబిల్ మీద మెల్లిగా చిటిక వేస్తూ కూచుని ఉంది. సమాధానం ఏమీ చెప్పలేదు. 'మిస్ లలితా' అని మళ్ళీ పిలిచాడు నిరంజనుడు.

లలిత బొంగురుపోయిన కంఠంతో "ఏమిటీ?" అంది.

నిరంజనుడు కాస్సేపు నిశ్చలంగా నిలబడి, "ఇంత అదృష్టాన్ని నేనెన్నడూ కల్లోకూడా ఊహించలా. నువ్వు నన్ను ప్రేమిస్తున్నావన్న సంగతి నా ఊహకు అందిందికాదు" అన్నాడు.

లలితకు కళ్ళ వెంట ఆనందాశ్రువులు స్రవించాయి. ఆమె ఏమీ మాట్లాడలేకపోయింది

నిరంజనుడు ఏ మాలోచించుకున్నాడో—మెల్లిగా "కాని అన్యాయం!" అన్నాడు.

లలిత తల పైకి ఎత్తి "అన్యాయం ఎందుకని? జాతి కోసమనా?" అన్నది.

"ఉహూం, నాకు జాతిపట్టింపు లేదు. నేను అయోగ్యుణ్ణి. నిన్ను స్వీకరించటానికి తగిన యోగ్యత నాలో లేదు లలితా!"

"ఎందుకని లేదు?" అని అతడి కళ్ళలోకి చూసింది.

"నేనిప్పుడు చెప్పలేను. మళ్ళీ విదేశాలనుంచి వచ్చాక చెపుతాను"

"మీ రాకకోసమై ఎదురుచూస్తూ ఉంటాను" అంది.



అతిథులు రావటం ప్రారంభమయింది. రావుసాహెబ్ చాలామందిని ఆహ్వానించాడు. లలిత చక్కగా అలంకరించుకునివచ్చి...విందుకు వచ్చిన స్త్రీలతో కులాసాగా మాట్లాడుతోంది. కాని ఆమె మాటల్నిబట్టి ఏదో పరధ్యానంగా ఉన్నట్లు

తెలుస్తూనే ఉంది. అతిథులకు పరిచయంచేయటంకోసమై రావుసాహెబ్ నిరంజనుడికోసమై వెతకసాగాడు. అప్పుడతను తన గదిలోకూర్చునివున్నాడు. అతడికిల్లాంటివిఅంతగాఅలవాటు లేకపోవటంమూలంగా సిగ్గుతో బైటికిరాలేకపోయాడు. రావు సాహేబ్ అతడ్ని తీసుకొచ్చి అతిథులందరికీ పరిచయంచేసి, అతడి విదేశయాత్రను గురించి కూడా ప్రస్తావించాడు.

భోజనపు టేబిల్ముందు లలిత పరధ్యానంగాకూర్చుని ఉండటం మిసెస్ ఛటర్జీ గమనించి, 'ముఖంఅలా వాడిఉన్నదేం లలితా!వంట్లో ఏమయినా అస్వస్థతగా వుందా?' అని అడిగింది.

"లేదు. కాని కొంచెం తల నొప్పిగామాత్రం వుంది" అన్నది లలిత.

"ఊం. వుండదూ! రాత్రింబగళ్ళు చదువుతూ కూచుంటే ఏమవుతుంది మరి? కాస్సేపు చల్లగాలిలో తిరిగి రారాదూ?" అన్నది లలిత తల్లి.

"అయితే పద. కాస్సేపు నదిఒడ్డునతిరిగిరా. తలనొప్పి తప్పకుండా తగ్గిపోతుంది" అన్నది మిసెస్ ఛటర్జీ.

లలిత గేటుదాటి నదికేసి నడుస్తోంది. ఆ గందరగోళం లోనుంచి బైటపడేసరికి ఆమెకు కొంచెం మనశ్శాంతిచిక్కింది. ఆమె చాలాసేపట్నుంచి బైటికి రావాలని ప్రయత్నిస్తోంది. కాని, ఎవరితోనూ చెప్పకుండా అలా వెళ్ళిపోవటం బావుండదని, అమర్యాదకరంగా వుంటుందని అక్కడనుంచి బైటికి రాలేకపోయింది. నిరంజనుడి మాటలు ఆమెకు సరిగ్గా అర్థం కాలేదు. అతను అన్యాయం అన్నాడు ఎందుకని? ఏమిటీ అన్యాయం? జాతిపట్టింపు లేదని తన నోటిమీదుగా తానే

చెప్పేశాడు. అయితే మరి! లలితకు ఎంత ఆలోచించినా ఏమీ అంతు చిక్కలేదు. నదిఒడ్డున తిరుగుతూ ఆమె ఇదే ఆలోచిస్తోంది. చటుక్కున రాయిమణిసంగతి జ్ఞాపకం వచ్చింది. లక్ష్మీపూజ అయినప్పట్నుంచీ ఆమె మళ్లీ కనపళ్లేదు. ఆమెదగ్గిరకు వెడితే తనకీ దిగులునుంచి కొంచెం విముక్తి కలుగుతుందేమో అన్న భావంతో లలిత చంద్రనాథుడింటికి వెళ్ళింది.

చంద్రనాథుడింటికి వెళ్లి చూచేసరికి నిర్జనంగా ఉంది. ఎక్కడా చడీ-చప్పుడూ లేదు. కాస్సేపు అలాగే నుంచుని 'మణీ' అని పిలిచింది. జవాబేమీరాలేదు. ఏంచెయ్యాలో తోచలేదు. తలుపు తెరచిఉండటం చూసి, లోపలికివచ్చి చూసేసరికి, రాయిమణి పుస్తకాలమీద తలపెట్టుకుని ఏడుస్తోంది. లలిత అంతా గ్రహించింది. దగ్గిరకువచ్చి, అశ్రునిరుద్ధకంఠంతో "మణీ!" అని పిలిచింది.

మణి తలయెత్తి చూసింది. ఎదురుగా లలిత ఆమె తమాయించుకోలేక లలితమెడ కౌగిలించుకుని "అమ్మాయిగారూ!" అని ఏడ్చింది. ♦ ♦ ♦ ♦ ♦

పార్టీ పూర్తిఅయింది. అతిథులంతా వెళ్లిపోయారు. రావుసాహేబ్ తన స్నేహితులతో ఏదో మాట్లాడుతున్నాడు. నిరంజనుడు వెళ్లనావద్దా అని సంకోచిస్తున్నాడు. ఒక్కనిమిషమయినా ఆగబుద్ధిపుట్టలేదు. ఈ సమయంలో భిల్లుక్ వచ్చి, "భాయిజీ! కాస్సేపు అటుతిరిగివద్దాం రండి" అనిపిలిచాడు.

బైటికి రావటానికి ఉపాయం దొరికినందుకు నిరంజనుడు సంతోషిస్తూ "పద" అని ఇంకెవరికీ తెలియకుండా బంగళాలోంచి బైటికి వచ్చాడు.

వాళ్ళిద్దరు ఈ బెస్తవాళ్ళుండే పేటకు వచ్చేసరికి సూర్యాస్తమయం అవుతూ అవుతూ వుంది. చంద్రనాథుడి ఇంటిముందుకొచ్చి చూశారు ఇల్లు పాడుబడ్డట్టువుంది. తులసికోటముందు ఇంకా సాంధ్యదీపం వెలిగించనేలేదు. నిరంజనుడు దీనికి కారణం ఏమిటో తెలుసుకోలేకపోయాడు. రాయిమణి సాంధ్యదీపం వెలిగించకుండా ఏపనీ చెయ్యదు. కాస్సేపు అలాగే నుంచుని "ఇంట్లో ఎవ్వరూలేరు భిల్లుక్! రా, వెళ్ళిపోదాంపద" అన్నాడు నిరంజనుడు. భిల్లుక్ ఒకగది దర్వాజాకేసి చూపుతూ "తలుపు తీసేవున్నట్లుంది భాయిజీ! చందర్‌కుసు స్త్రీచేసిందేమో! నువ్వొకసారి చూసిరా! నేనిక్కడే వుంటాను" అన్నాడు.

భిల్లుక్ మాటలు విని నిరంజనుడు తలుపు దగ్గరకు వచ్చాడు. ఆ సాంధ్యకాంతిలో లోపల అస్పష్టంగా కన్పిస్తున్న దృశ్యంచూసి కొయ్యబారిపోయాడు. చంద్రనాథుడి దగ్గరకు తాను పంపిన పుస్తకాలు ముందర పోగేసుకుని లలిత—మణీ కావిలించుకుని ఏడుస్తున్నారు. కాస్సేపు అలాగేనుంచుని, భిల్లుక్‌తో "నేను చంద్రనాథుడ్ని చూచి వెళ్లటానికి వచ్చానని చెప్పు భిల్లుక్!" అని చెప్పి, జవాబుకై ఆగకుండానే బంగళాకేసి వెళ్లిపోయాడు. భిల్లుక్‌కు ఏమీ అర్థంకాలేదు. నిరంజనుడి ఈ ప్రవర్తన అర్థంకాక అతడు తెల్లబోతూ అట్లాగేచూస్తూ నిలబడ్డాడు.

చంద్రుడు చెట్లసందుల్లోంచి మెల్లిగా పైకివస్తున్నాడు. అవతలఒడ్డున బంగళాలోని అభ్యాగతుల హాస్యధ్వనులు ఇంకా గాలిలో లీనమవుతూండగానే జామచెట్టుమీద గుడ్లగూబ కర్కశంగా కూసింది.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA111B183 |
| పుస్తకం పేరు | విరంజన్ |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 193 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | pragathi |
| పేజీలు విడదీసినది | somya |
| స్కాన్ చేసినది | [illegible] |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |